శ్రీయుత

# లోకమాన్య బాలగంగాధరతిలకుగారి

సెక్యూరటీకేసు

# స్వరాజ్య ఉపన్యాసములు

గుంటూరుజిల్లా తెనాలిలో ప్లీడరగు

శ్రీ పెద్దిభొట్ల లక్ష్మీనరసింహముగారిచే ఆంధ్రీకృతము.



చెన్నపురి

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

# విజ్ఞప్తి.

శ్రీలోకమాన్య బాలగంగాధర తిలకుగారికి భరతఖండమున కీర్తి ఆంధ్రలోకమున మఱింత విస్తరిల్లవలయునని నాచిరకాలమిత్రు శ్రీయుత పెద్దిభొట్ల లక్ష్మీనరసింహముగారు యిందులోనియుపన్యాసము మిక్కిలి శ్రద్ధతో ఆంధ్రీకరించి నానద్దకు పంపిరి; కాని కారణాంతరములచే ప్రకటించుట కింతకాలము వీలైనదికాదు. శ్రీలోకమాన్యుల శ్రీలక్ష్మీనరసింహముగారికున్న యాంతరంగభక్తి యింత యని చెప్పశక్యము కాదు. అట్టివారీగ్రంథము ప్రకటించునప్పటికి పరలోకగతులగుట నాకేగాక ఆంధ్రుల కందఱకును విచారకరమైన అంశమేను. ఈమధ్య ప్రసాదింపబడ్డ రాజ్యాంగసంస్కరణములకు ముఖ్యకారకులలో శ్రీతిలకుగారని లోకమున కంతయు తెలిసియే యున్నది అట్టివారి ముఖ్యోపన్యాసములు చదివి ఆంధ్రులు ఆనందించుటయేగాక [illegible] తెలి[illegible] నమ్ముచున్నాను.

ఇట్లు,

నా[illegible] వేంకటేశ్వరులు.

# పీఠిక

---

భాషాంతరీకరణ మొనర్చుట సుసాధ్యమైన పనికాదు. ఒకభాష నుండి మఱియొకభాషలోనికి భాషాంతరీకరణము చేయునపుడు, మొదటి భాషలో నున్నట్లుగా వచనరచనమునుగాని, భావగాంభీర్యమునుగాని, యుచితముగను సందర్భానుసారముగను రచియించుట కష్టతరము. ఇంతే యుకాక, మొదటిభాషలోనుండు కొన్నిపదములకు సరియగు నర్థమిచ్చు పదములు రెండవభాషయందుండ వనుటను భాషాంతరీకరణము చేయు వారలకు తర్జుమా చేయువారలకు అనుభవసిద్ధమే. ఇది హిందూ దేశ మందలి భాషలన్నిటి ని వర్తించును.

దేశభాషలకును ఆంగ్లభాషకును పెక్కువిధములందు సాంప్రదాయభేదములు మున్నగునవి యుండుటయు విదితమే. దేశభాషలవలె నాంగ్లభాషయందుఁ బ్రత్యేకముగఁ బ్రత్యయము లుండకుండుటచే పదక్రమ ప్రాముఖ్యమైన వ్యాకరణము ననుసరించియుండును. దేశభాషలం దిట్టిపదక్రమము నంతగా పట్టింపులేక ప్రత్యయములద్వారా అర్థబోధకము సులభముగ నగును. ఇట్టికారణములచేత దేశభాషనుండి యాంగ్లభాషలోనికిగాని, ఆంగ్లభాషనుండి దేశభాషలోనికిగాని భాషాంతరీకరణము చేయుట కడుదుర్లభము. లోకమాన్య బాలగంగాధర తిలకుగారు మహారాష్ట్రభాషయం దుపన్యసించిన [illegible] లోనికి భాషాంతరీకరణము చేయించిరి కాని [illegible] తర్జుమాచేయువారు [illegible] బడిన కష్టము [illegible] పునహాజిల్లా [illegible] ప్రతివాదములనుబట్టి [illegible]

ప్రస్తుత మీపొత్తమున లోకమాన్య బాలగంగాధరతిలకుగారి బెల్గాముపట్టణమందును అహమ్మదు బాదాపట్టణమందు నిచ్చిన యుప న్యాసత్రయమును, పునహాజిల్లా మేజస్ట్రేటుగారి తీర్పును, అందుపైని అప్పీలు (Appeal) లలో బొంబాయి యున్నత న్యాయస్థానము (High Court) వారి తీర్పులు రెండు నున్నవి. ఇవన్నియు నాంగ్లభాష నుండి యాంధ్రీకరింపఁబడినవి. లోకమాన్య బాలగంగాధరతిలకుగారు మహారాష్ట్రభాషయం దిచ్చిన యుపన్యాసము లాంగ్లములోనికి భాషాం తరీకరింపఁబడి మఱల నాంగ్లమునుండి యాంధ్రీకరింపఁబడినందున భావ వ్యత్యాసము లనేకము లుండవచ్చును. ఆంగ్లమునుండి ఆంధ్రీకరించు నపుడు ప్రతిపదార్థమును వచ్చునట్లుకాక సామాన్యభావమునకు లోపము కలుగకుండ సాధ్యమైనంత శ్రద్ధతోడను జాగ్రత్తతోడను భాషాంతరీ కరణమొనర్పంబడినది. అయిన నిందు లోపము లుండవనిచెప్ప సాహసిం పఁజాలము.

లోకమాన్య బాలగంగాధరతిలకుగా రుపన్యాసములు నిచ్చిన దియు, నాయన జన్మదినోత్సవమున మహారాష్ట్రదేశస్థులు వారికి ఒకలక్ష రూపాయలొసంగినదియు, నాఁటిదినముననే యాయనపైని జామీను కేసు వచ్చినదనియు, జిల్లామేజస్ట్రేటుగారాయనను జామీను నీయవలసిన దని యాజ్ఞాపించినదియు, నాయన బొంబాయి హైకోర్టు కప్పీలు చేసిన దియు, నచటి న్యాయమూర్తు లిరువురు విచారించి జిల్లామేజస్ట్రేటుగారు చేసిన యాజ్ఞను రద్దుపఱచినదియు, అను నీవిషయములన్నియు నెప్పటి కప్పుడు విద్యుల్లతలఁబోలె వార్తాపత్రికాముఖమున నలుదెసల వ్యాపించి కుగ్రామములలోసైతము నొకవిధమగు కలవరమును గలుగఁజేసెను. కాని, బాలగంగాధరతిలకుగారెట్టి యుపన్యాసములు నిచ్చిరో, వారేమి తప్పిదమొనర్చినట్లు జిల్లామేజస్ట్రేటుగారెంచి జామీను నీయవలయు నని యాజ్ఞాపించిరో, ఆయుపన్యాసములు శిక్షార్హములుకావని ఉన్నత న్యాయసభ హైకోర్టు వారేవిధముగ నభిప్రాయపడిరో, ఉపన్యాసము

లిచ్చువా రేయేయంశములను గమనింపవలయునో యనునంశములు జనసామాన్యమునకుఁ దెలియమిం జేసి బాలగంగాధరతిలకుగారు నిర్దోషియనియు, దొరతనమువా రాయనకు అనవసరముగఁ గష్టములపా ల్జేసిరనియు కొందఱును; బాలగంగాధరతిలకుగా రుపన్యసించుటలో రాజద్రోహాదినేరములం జేసిరనియును, అందువలన దొరతనమువా రట్టిచర్య నాయనపై నుచితరీతిని జరపిరనియు మఱికొందఱును; జెప్పుకొనుచున్నారు. కాఁబట్టి, జనసామాన్యములో కలిగిన భిన్నాభిప్రాయములను దొలఁగించుటకై వారియుపన్యాసములును తీర్పులు నిందు ముద్రింపఁబడినవి. వీనిని జదువుకొనువారు బాలగంగాధరతిలకుగారు కొన్నితావుల నుపయోగించిన కఠినవాక్యములనుబట్టి దొరతనమువా రట్టివిషయములలో నెట్టిచర్యను జరపుదురో తెలిసికొనెదరనియు, ఉపన్యాసపూర్వక రాజద్రోహమన నెట్టిదో తెలిసికొనెదరనునమ్మకముచే నీచిన్నిపొత్తముం బ్రకటించితిమి.

ఆంగ్లభాషాపదములకు సరియగు నాంధ్రపదములు లభింపని పట్లఁగాని, అర్థము నిర్దుష్టము లేక స్పష్టముగనుండని తావులఁగాని, సందర్భము సంశయాస్పదముగఁ గన్పడినచోట్లఁగాని, పలువిధములగు అర్థములు స్ఫురించిన పట్లగాని అర్థచంద్రాకృతిగల గుర్తులలో నాంగ్లపదములు సైతము ముద్రింపఁబడినవి.

పెద్దిభొట్ల లక్ష్మీనరసింహము.

# శ్రీ బాలగంగాధరతిలకుజీవితము.

---

శ్రీయుత లోకమాన్య బాలగంగాధరతిలకుగారు మహారాష్ట్ర దేశములో రత్నగిరి యనుపట్టణమందు చిత్పావనబ్రాహ్మణవంశంబున (ది 23-7-1856) సంవత్సరమున జన్మించిరి. ఈయనతండ్రి పండితుఁడును కవియునై యుండినదేగాక రత్నగిరిలోని దేశభాషాపాఠశాల (Vernacular School) యందుఁ బ్రధానోపాధ్యాయుఁడుగ నుండెను. ఇతఁడు తన కుమారునికి సంస్కృతమును, మహారాష్ట్రమును, ఆంగ్లభాషయును అభ్యసింపఁజేసెను. తిలకుగారు షోడశవత్సరముల బాలుఁడై యుండఁగా నాయనతండ్రి స్వర్గస్థుఁడయ్యెను. ఆసంవత్సరమునందే ప్రవేశపరీక్ష (Matriculation) యందును, తర్వాత నాల్గుసంవత్సరములకు పట్ట బి. ఏ. పరీక్షయందును, పిమ్మట మూఁడుసంవత్సరములకు న్యాయశాస్త్ర బి. యల్. పరీక్షయందును తిలకుగారు గౌరవయుక్తముగఁ గృతార్థులైరి. ఆమఱు సంవత్సరమునందే 1880 వీరును, వీరి ప్రియమిత్రులగు అగర్కార్, విష్ణుశాస్త్రిచిపళూణకర్, నామజోషి యనువారును జేరి దేశాభివృద్ధికి విద్యావ్యాపకమే ప్రధానమనియెంచి పునహానగరమం దొక నూతనాంగ్లపాఠశాలను (New English School) తే 2—1—1890 దిని స్థాపించిరి. ఈపాఠశాల దినదినాభివృద్ధిఁగాంచి యున్నతస్థితికిఁ దేఁబడిన పిమ్మట "ఫెర్గ్యూసన్ కాలేజి" (Fergusson College) యను నొక కలాశాలను స్థాపించిరి. మఱియు తిలకుగారుపాఠశాలయందును గలాశాలయందునుగూడ గణితశాస్త్రమును బోధించుచుండిరి. ఇట్లు విద్యావిషయమున 10 సంవత్సరములు పాటుపడిన పిమ్మట నీవిద్యాశాలలవిషయములోఁ దమకుఁగల స్వతంత్రమును వదలిపెట్టిరి. ఏలన, దొరతనము వారివలన సహాయమునుబొందుఁవిషయములో నీయనకును దక్కినవారావురకును అభిప్రాయభేదములు కలుగుటచే నావిద్యాశాలలోఁ బనిచేయుచు

పరస్పరము కలహించుచుచుండినచో విద్యాలయములకు నష్టముకలుగు ననియెంచి యావిద్యాలయముల సంబంధమును త్యజించెను. మఱియు తిలకుగారు న్యాయశాస్త్రపరీక్షయందుత్తీర్ణులైన వెంటనే పునహానగరమందొక న్యాయశాస్త్రకలాశాల (Law College) నెలకొల్పి కొంతకాల మందుఁగూడ పనిచేయుచుండిరి.

తిలకుగారు విద్యాలయముల సంబంధమును వదలుకొనుటకుఁ బూర్వమే అగర్కార్ గారు మహారాష్ట్ర భాషలో "కేసరి" యను వార్తాపత్రికను, తిలకుగా రాంగ్లభాషలో "మరాటా" యనువార్తాపత్రికను బ్రచురింపనారంభించిరి. కాని, కొల్హాపురము (Kolhapur) మహారాజాగారిపక్షమునఁ గఠినముగ నీరెండువార్తాపత్రికలలోను వ్రాసినందున నాసంస్థానపుకార్యాభారియగు బార్వ్వ (Mr. Barve) దొరగారు ఈపత్రికాధిపతులిర్వురపై నభియోగము (క్రిమినల్ కేసు) తెచ్చినందున వీరిరువురును మూఁడుమాసములు కారాగృహవాసము చేయవలసివచ్చినది. వీరు కారాగృహమునుండి విడుదలయగుటతోడనే తిలకుగారికిని అగర్కార్ గారికిని మనస్పర్ధలు పెరిగి అగర్కార్ గారు "కేసరి" పత్రికాధిపత్యమును మానుకొని "సుధారక్" (Sudharak) అను వేఱొక పత్రికను ప్రారంభించుటచే, "కేసరి" "మరాటా" యను నీరెండుపత్రికలను తిలకుగారే నిర్వహింపవలసివచ్చినది. మతమునకును సంఘమునకును సంబంధించిన కొన్నియభిప్రాయభేదము లీయిరువురికిఁ గలుగుటచే అగర్కార్ గారు "సుధారక్" పత్రికయందును తిలకుగారు "కేసరి" పత్రికయందును వ్రాయుచు దూషించుకొనుచుండిరి. పండితుఁడగు తిలకుగారు పండితపక్షపాతియగుటచే "పూర్వాచారపరాయణుఁ"డని యీయనను అగర్కార్ గా రనేకవిధముల నాక్షేపించుచుండిరి.

తిలకుగారు "పునహాలో బాపత్ కేసు (Bapat Case) విషయ

నావీరునిపేరు గౌరవింపఁబడునట్లు చేయుట కాయన యుత్సాహముతో చేసినయుద్యమమును, పురపారిశుధ్యసంఘసభ్యుఁడు (Municipal Commissioner) గానుండి స్థానికవ్యవహారములలో నతని యనుభవభూతమగు శ్రద్ధయును (Practical interest) మఱియు నిట్టివనేకములును "కేసరి పత్రికయొక్క ఖ్యాతిని నలుదెసల వ్యాపింపఁజేసినవని వి. యమ్. జోషి, యమ్. ఏ., (V. M. Joshi, M.A.,) అనువారు వ్రాసియున్నారు.

పునహానగరమందు శివాజీపండుగనుగూర్చి యీయఁబడిన యుపన్యాసము (ది 15-6-97) గల "కేసరి" పత్రికయందుఁ బ్రచురితమగుట చేతను, జూన్ నెల 22వ తేది పునహానగరమందు రాండు, అయెర్స్టు (Rand and Ayerst) అను నిద్దరుదొరలు చంపఁబడుటచేతను, తిలకు గారిమీఁద రాజద్రోహము (Sedition) అను నేరము మోపఁబడి విచారింపఁబడెను. ఆర్గురాంగ్లేయులును ముగ్గురిండియనులును జూరర్లు (పంచాయితీదార్లు) గా నుండిరి. వీరిలో నాంగ్లేయులందఱును తిలకుగారు "దోషి" యని యభిప్రాయమిచ్చినందున తిలకుగారికి $1\frac{1}{2}$ సంవత్సరములుకఠినశిక్ష విధింపఁబడినది. ఉన్నతన్యాయస్థానము (High Court) నకును, ప్రివీకవున్సిలు (Privy Council) నకును తిలకుగారప్పీళ్లు చేసిరి గాని ప్రయోజన మగపడదయ్యె. అప్పుడు మాక్సుముల్లరు (Maxmuller) పండితులుగారు సహకారులగుటచే 6-9-1898 తిలకుగారు కారాగృహమునుండి విముక్తులైరి.

పిమ్మట చెన్నపురిలో జరిగిన దేశీయమహాజనసభ కేఁగి యచటి నుండి సింహళము (Ceylon) నకుఁబోయి మరలివచ్చిరి.

తిలకుగారి స్నేహితుఁ డగు "తాయిమహారాజ" అను జమీందారిణిగారిభర్త మరణశాసనము వ్రాయుచు తిలకుగారిని కూడ నొక ట్రస్టి (Trustee) పంచాయితీదారుగ నియమించెను. ట్రస్టీల సలహా ప్రకారము తాయిమహారాజుగారొక చిన్నవానిని శాస్త్రోక్తముగ దత్తస్వీకారమును జేసికొనిరి; కాని వెంటనే యాచిన్నవానిదత్తతను నిరాకరించి వేఱొకచిన్నవానిని దత్తతఁ జేసికొనిరి. ఈదత్తతవిషయము

నందు వ్యాజ్యము కలుగఁగా తిలకుగారిపై "తప్పుడుసాక్ష్యము" మొదలగు దోషారోపణచేయఁబడి తిలకుగారికి $1\frac{1}{2}$ సంవత్సరముల కఠినశిక్ష యొసఁగఁబడెను; కాని అపీలులో నీశిక్ష రద్దగుటయే కాక, సివిల్ వ్యాజ్యముపై ప్రీవీకవున్సిలుకుఁ జేయఁబడిన అపీలులో తిలకుగారిసాక్ష్యమునే నమ్మిరి.

ఇట్టి స్థితిలో వంగ (బంగాళా) రాష్ట్రవిభజన మేర్పడుటచే నూతనాందోళన ముద్భవించి 'స్వదేశము' 'స్వరాజ్యము' అను నవీనశక్తులు దిగంతములందు వ్యాపించుచుండెను. దేశాభిమానులలో అగ్రగణ్యులగు తిలకుగారు "స్వదేశి," (అనఁగా స్వదేశవస్తుప్రోత్సాహము విదేశవస్తుబహిష్కారము) "స్వరాజ్యము," (అనఁగా ఇండియాదేశ పరిపాలనమందు నిండియాదేశ ప్రజల కెక్కువ స్వతంత్రముండుట) అనువాని విషయములలో విశేషముగఁ బరిశ్రమచేయుచు జాతీయవిద్య (National Education) కొఱకు సమర్థవిద్యాలయమును స్థాపించి "పైసాఫండు" (Paisa Fund) అనఁగా నీదేశములో పరిశ్రామికాభివృద్ధికొఱకు యంత్రశాలలను స్థాపించుటకు వలయునిధి నిమిత్తము ప్రతిమనుష్యనొద్దనుండియు కానిచొప్పున వసూలుచేయుట నారంభించి తన్మూలమున వసూలైనద్రవ్యముతో తెలెగవ్ (Telagaon) యందు గాజుసామానులను తయారుచేయు యంత్రశాలను స్థాపించిరి.

ఇట్లు నిరంతరము దేశహితార్థము పనిచేయుచున్నను "కేసరి" "మరాటా" అనువార్తాపత్రికల కెట్టిలోపమును గలుగకుండ జరుపుచుండిరి. అయినను, తిలకుగారు రాజద్రోహవిషయముల (Sedition) ను వ్రాసినట్లు దొరతనమువారెంచి దోషారోపణముచేసినందున 1908 వ సం॥ లో 6 సంవత్సరముల శిక్షవిధింపఁబడి వారు 'బర్మా' దేశములోని మాండలే యనుపట్టణమునందలి కారాగృహమందుంచఁబడిరి. వీరు 1914 వ సం॥ రమున కారాగృహవిముక్తినొంది పునహా నగరము చేరిరి.

తిలకుగారు విద్యాధికుఁడును పండితుఁడు నని మున్నె తెలుపఁబడెను. పాశ్చాత్యదేశములందు సైతమద్భుతముగఁ గన్పడిన 'ఒరయాన్'

(Orion-మృగశీర్షనక్షత్రము) అను సుగ్రంథము నీయన ప్రథమమున వ్రాసి వేదశాస్త్రములందు తమకుగల యసామాన్యప్రజ్ఞను, విమర్శనా కౌశలమును లోకమునకు వెల్లడి చేసిరి. ఈయన 1897 వ సం॥ రములో కారాగృహమున నున్నపు డీగ్రంథమును వ్రాయుటకు వలయుసదుపా యములను దొరతనము వారు కలిగించినందున "ఆర్టిక్ హోమ్ ఇన్ ది వేదాస్" (Arctic Hom in the Vedas) అనఁగా వేదములవలనస్పష్ట మగు *నుత్తరధ్రువప్రాంతవాసము అను అత్యుత్తమగ్రంథమును వ్రాసిరి. ఈగ్రంథమువలన నప్పటివఱకు పాశ్చాత్యపండితులు చేసిన కొన్నిసిద్ధాంత ములు తలక్రిందులైనందున తిలకుగారి పాండిత్యప్రభావ మన్నిఖండము లందు నన్నిదేశములందును వ్యాపించినది. అయినను, రెండు గ్రంథ ములు నాంగ్లభాషయందు వ్రాయఁబడినందున మనదేశములో ఆంగ్ల భాషాజ్ఞానము లేనివారికి విశేషముగ తెలియవు.

కాని, 1908 వ సం॥ రములో తిలకుగారు మాండలేయందు కారాగృహవాసము చేసినపుడు తనయిష్టమువచ్చిన ఆహారము తినుట కును, తనదుస్తులను ధరించుటకును, తనకు వలయుగ్రంథసామగ్రిని దెప్పిం చుకొనుటకును దొరతనమువా రంగీకరించినందున తిలకుగారు పాశ్చాత్య తత్త్వవేత్తలగ్రంథములను హిందూమతముయొక్క పారిభాషికగ్రంథ ములను తదితరమతగ్రంథములను సమకూర్చుకొని వాని నత్యంత విమ ర్శనాదృష్టితో చదివి "గీతారహస్యము లేక కర్మయోగశాస్త్రము" అను భగవద్గీతామాహాత్మ్యమును, వానియందలి గూఢార్థములను క్రైస్తవ ముసల్మాన్ బౌద్ధాదిమతముల తత్త్వజ్ఞానమునకును గీతలయందున్న యాధిక్యతకును గలభేదములను విస్తరించుచు నొకగ్రంథమును మహా రాష్ట్రభాషయందు వ్రాసిరి. ఈగ్రంథ రాజము, హిందీ, గుజరాతీ తెనుఁగు, ద్రావిడము, కన్నడము మొదలగు దేశభాషలలో:గూడ భాషాంతరీకరింపఁబడినది.

---

*ఇందు ప్రథమమునఆర్యు లుత్తరధ్రువసమీపదేశములో నివసించి పిమ్మట దక్షి ణముగా హిందూదేశము మొదలగుదేశములందుఁ జేరిరని వేదశాస్త్రప్రమాణము తోడను యుక్తియుక్తముగను పాశ్చాత్యుల నవీనశాస్త్రానుసారముగను వ్రాయఁబడిన

1914 సంవత్సరములో తిలకుగారు చెఱసాలనుండి విడుదలయైన పిమ్మట "గీతారహస్యము" ముద్రింపఁబడినది. ఇప్పుడును దేశాభిమాన మునందెక్కువపట్టుదలగలిగి పనిచేయుచు పునహాయందలి సర్వజనిక సభ యందుగూడఁ బనిచేయుచు రాజకీయాందోళనమునందు నేరికిని వెను దీయకున్నారు. పాశ్చాత్యదేశపుస్త్రీయయ్యును హిందూమతమునందు వలెనే హిందేశము నెడలఁగూడ అనురాగముగలిగి హిందూదేశవాసు లకు స్వరాజ్యమును లభింపఁజేయుటకు శ్రీమతి అనిబిసెంటుచే పోషింపఁ బడుచున్న స్వరాజ్యాందోళనమునందు ఆమహనీయురాలికి తిలకుగారు కుడిభుజముగ నున్నారనుట అతిశయోక్తికాదు. కాని ఇటీవలసత్యాగ్రహ వ్రతప్రచారమున నాయకులకును ఆమెకును అభిప్రాయభేదము జనించి దేశీయమహాసభ తీర్మానములపై ఆమె చూపవలసిన గౌరవమును చూపక స్వరాజ్య ఆందోళనమునకు కొంత ఆటంకము కలిగించినదని చెప్పక తప్పదు.

కొందఱికి కష్టములు వాటిల్లునప్పుడు అబద్ధములాడియైన నా కష్టములను దప్పించుకొనయత్నించెదరు; కాని, తిలకుగా రట్లుగాక ఎట్టి కష్టములు వాటిల్లినను సాహసోత్సాహధైర్యాదులను మాత్రము విడ నాడుట లేదు. వీరిట్టి దీక్షాపరులగుటచే స్వరాజ్యాందోళనమునుగూర్చి కడుపూనికతోఁ బనిచేయుచు తే 1-5-16 దిన బెల్గామునందొకయుప న్యాసమును, అహమ్మదునగరమందు తే 31—5—16 దిన యొకయుప న్యాసమును, తే1-6-16 దిన నొకయుపన్యాసమును మహారాష్ట్రభాషయం దొసంగిరి. ఈ మూఁడుపన్యాసములందును 'సివిల్ సర్వెన్ట్సు' అనఁగా కలెక్టరుమొదలగు నుద్యోగస్థులనుగూర్చి కఠినవాక్యముల నుపయో గించుట మూలముగ రాజద్రోహనేరముచేసినట్లెంచి సర్కారువారు తిలకుగారిపై జామీను కేసు తెచ్చిరి. ఆకేసును విచారించిన జిల్లామేజ స్ట్రీటుగారు తిలకుగారిని దోషిగా భావించిరి; కాని, బొంబాయి హైకో ర్టువారు నిర్దోషిగనెంచి జామీనుశిక్షను తొలఁగించిరి.

తిలకుగారు కాంగ్రెసు (దేశీయమహాసభ) లో చాలకాలము నుండి పనిచేయుచున్నను 1906 వ సం॥ రములో సూరతుపట్టణములో

జాతీయవాదుల (Nationalists)కును తదితరులకునభిప్రాయభేదము లేర్పడి జాతీయవాదులు కాంగ్రెసునెడల విముఖులైరిగాని యందువలన ప్రజల యందుఁగల యైకమత్యభావమునకు భంగము కలుగునని యెంచి అనిబిసెంటుగారి సహాయమున కాంగ్రెసు పద్ధతులలో కొద్దిమార్పులు చేయించి తనపక్షమున నున్న జాతీయవాదులను 1916 వ సం॥ లక్ష్మణపురి(లక్నో) లోఁ జరిగిన కాంగ్రెసులోఁ జేర్చి కాంగ్రెసునకు వన్నె దెచ్చిరి.

---

# సెక్యూరటీ కేసు.

## సమాచారము.

1 వ దస్తావేజు (Exhibit No. I)

పునహాలోని జిల్లా మేజిస్ట్రేటుగారి కోర్టులో
జేమ్సు అడాల్ఫస్ గైడరు, డిప్యూటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ పోలీసు,
గూఢచారశాఖ (C. I. D.)

ఎదిరి

బాలగంగాధరతిలక్, బి.ఏ., యల్. యల్. బి., (సాకీను), పూనా.
శిక్షావిధానస్మృతి (Criminal Procedure Code) యొక్క
108 వ శెక్షన్ ప్రకారము సమాచారము.

పై తెలిపిన జేమ్సు అడాల్ఫస్ గైడరు అను నేనీక్రింది
సమాచారమును దాఖలుచేయుచున్నాను.

1. పైని చెప్పఁబడిన బాలగంగాధరతిలకు లోఁగడ రాజద్రోహము Sedition అను నేరముల క్రింద శిక్షలనొందియును, ఈక్రింద నుదహరించిన ప్రకారము రాజద్రోహపుసంగతులను, అనఁగా, ఇండియా దేశపు శిక్షాస్మృతియొక్క 124 A అనుసెక్షన్ ప్రకారము శిక్షార్హమగువిషయములను ప్రచురించుచు వాఙ్మూలముగ వెదజల్లుచునున్నాఁడు.

2. a. 1916 వ సంవత్సరము మే నెల తే 1 ది సాయంకాలము బెల్గాములో చరిత్ర విషయికవిమర్శనా సంఘము (Historical Resarch Association) తో సంబంధించిన సభ ముగిసినపిమ్మట;

b. 1916 వ సంవత్సరం మే నెల 31 వ తేది సాయంకాలము అహమ్మదునగరములో కపడ్ బజారు (Kapad Bazaar) లోని వర్తకులాయన కొసంగిన సమ్మానపత్రమునకు ప్రత్యుత్తరముగ కపడ్ బజారునకు వెనుకప్రక్కనున్న ఖాళీస్థలములో;

c. మరల, 1916 వ సంవత్సరము జూన్ నెల 1 వ తేది అహమ్మదునగరములో ప్రాతకపడ్ బజారులో బహిరంగస్థలమున జరిగిన ప్రజలసభలో (Mass meeting);

ఈయన్నిప్రదేశములలోను హోమ్‌రూలు (స్వరాజము) విషయములో నుపన్యాసములనిచ్చి హిస్ మేజస్టీ (చక్రవర్తి) గారియెడలగాని, బ్రిటిషుయిండియాలో శాస్త్రోక్తముగ నేర్పడినగవర్నమెంటు నెడలగాని, ద్వేషమునుగాని, నిరాదరణమునుగాని (Hatred or Contempt) కలిగించిగాని, కలిగించుటకు ప్రయత్నించిగాని, లేక అసూయోద్రేకమును కలిగించిగాని, కలిగించుటకు ప్రయత్నించిగాని యున్నాఁడు.

3. ఆయన యిట్లే ఇఁకమీఁదటకూడ చేయుచుండునని భీతికలుగుచున్నది.

4. పై 2 వ పేరాలో నుదహరించిన యుపన్యాసముల నకళ్లను ఇందుతో ఎ,బి,సి, అను అనుబంధములు (Appendix A, B, and C) గా దాఖలుచేయడమైనది.

5. విచారణవాయిదానాటికి సాక్షిని హాజరుపరచెడమగును.

ఎస్. సి. దావర్ వ్రాలు, అనివున్నది
పబ్లికు ప్రాసిక్యూటర్.

జే. ఏ. గైడరువ్రాలు
అనివున్నది.

పునహా. 1-9 వ సం జూలై నెల 22వ తేది.

## గైడరుగారి ప్రమాణపత్రిక.

2 వ దస్తావేజు (Exhibit No. II)

జేమ్సు అడాల్ఫస్ గైడరు ప్రమాణపూర్వకముగ చెప్పినది.—

ఈదినము బాలగంగాధరతిలకువిషయములో నేను దాఖలుచేసిన సమాచారము నేనునమ్మునంతవఱకు సరియైనది. నాయొక్క తాబేయుద్యోగస్థులద్వారా వచ్చిన సమాచారము కొంతవఱకును నాఆఫీసులోని రికార్డును మఱికొన్ని యాధారములును, దీని కాధారములు.

రు 50,000 ల వంటి తగుజామీను పుచ్చుకొనఁగోరుచున్నాను. ఆయన స్థితిపరుఁడు. ఆయునకు "కేసరి" ముద్రాక్షరశాలయును, గైకవాడ్ వాడయు* నున్నవి. ఆయన ఎక్కువపలుకుబడియును, ద్రవ్యవంతులగు స్నేహితులను కలవాఁడు. ప్రస్తుతము ఆయనకు జన్మదినబహుమాన మిచ్చుటకు ఆయనస్నేహితులు ఒకలక్షరూపాయిలను వసూలుచేయుచున్నారు. ఒకసంవత్సరమునకు జామీనుపుచ్చుకొనవలసినదని నేనుకోరుచున్నాను. నా కాధారము లగు మూడుపన్యాసములను వాని తర్జుమాలను దాఖలుచేసినాను.

జే. ఏ. గైడరు వ్రాలు, అని యున్నది.

నా యెదుట (నీయబడినది).

22-7-16. జి. డబ్ల్యు. హ్యేచ్ వ్రాలు, అనియున్నది.

పూనా డిస్ట్రిక్టు మేజస్ట్రేటు.

పునహా మేజస్ట్రేటు

## హ్యేచ్ గారి తీర్పు.

పునహాలోని సి. ఐ. డి. శాఖయొక్క డిప్యూటీ యిన్ స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు (Deputy Inspector General of Pol:ce, C. I. D., Poona) అయిన జె. ఏ. గైడరు (Mr. J. A. Guicer)గారు దాఖలుచేసిన సమాచారము ప్రకారము ఒకసంవత్సరమువఱకు సత్ప్రవ

* ఇది పూర్వము బరోడా గైక్వారుగారిది; ఇం దిప్పుడు శ్రీతిలకుగా రున్నారు.

ర్తకుఁడుగ నుండుటకు ఒక్కొక్కరు రు 10,000 లు చొప్పున నిద్దరు జామీనుదార్లను, రు 20,000 లకు స్వాంతపూచీఖత్తును ఎందులకీయఁగూడదో తెలుపవలసిన దని బాలగంగాధరతిలకునకు శిక్షావిధానస్మృతి (Criminal Procedure Code) 108, 112 సెక్షనుల ప్రకారము ఈకోర్టువారు తే 22-7-16 ది నోటీసు జారీచేసినారు.

ఇండియాదేశ శిక్షాస్మృతియొక్క 124 A. అను సెక్షన్ ప్రకారము శిక్షార్హమగు ప్రాచుర్యముగల రాజద్రోహవిషయములను ఇదివఱకు రాజద్రోహమునకు శిక్షల ననుభవించిన బాలగంగాధరతిలకు వాగ్రూపముగ వెనజల్లెనని సమాచారమిచ్చి అందులకు సాక్ష్యముగ మరాటీభాషలో షార్టట్ హ్యాండు రైటర్లు తయారుచేసిన తే 1-5-16, 31-5-16, 1-6-16 దీల యుపన్యాసములను వానియొక్క ఆంగ్లభాషాంతరీకరణమును గైడరుగారు దాఖలుచేసినారు.

జూలై నెల తే 28 ది వాయిదాలో తిలకుగారికి సమను జారీచేయఁబడినది; పిమ్మట డిఫెన్సు అనఁగా తిలకుగారి పక్షమున వాయిదా కోరబడినందున ఆగష్టు నెల 2 వ తేదికిని అటుతర్వాత నిరుపక్షములవారు వాయిదా కోరినందున ఆగష్టు నెల 7 వ తేదికిని వాయిదా వేయఁబడినది.

ఈసమాచారమునకు అనుగుణముగ సాక్ష్యమును వినుటయైనది. యిద్దరు రిపోర్టర్లయొక్కయు ఓరియంటల్ ట్రాన్స్లేటరు ఆఫీసు (Oriental Translator's Office) లో నొక యుద్యోగస్థునియొక్కయు సాక్ష్యమై యున్నది. తిలకు మాట్లాడఁగా తాము విని వ్రాసిన సంక్షిప్తలేఖనసంగ్రహమైన బి, డి, యఫ్, గుర్తులుగల దస్తావేజులయొక్క మరాటీవ్రాతనుగూర్చి మొదటి యిద్దరు సాక్ష్యమిచ్చినారు. దాఖలయిన యింగ్లీషుతర్జుమాలు అనఁగా సి, హెచ్, ఐ. గుర్తులుగల దస్తావేజులు బి, డి, యఫ్, గుర్తులుగల దస్తావేజులయొక్క సరియైన భాషాంతరీకరణము అని కడపటి యాతఁడు (తర్జుమాదారు) సర్టిఫై (Certify) చేయుచున్నాఁడు.

రాజద్రోహమునకుగాను తిలకదివఱకు శిక్షితుఁడై నందులకు శిక్షావిధానశాస్త్రము (Criminal Procedure Code) 511(?) సెక్ష

ప్రకారము ప్రాసిక్యూషను (గవర్నమెంటు) తరఫున సర్టిఫికెట్టు (Certificate) దాఖలుచేసినాడు. పూర్వపుశిక్ష లీరికార్డులోనికిఁ జేర్పఁగూడదని తిలకుగారి న్యాయవాది ఆక్షేపించెనుగాని, అట్టి ఆక్షేపణ అంగీకరింపఁబడ లేదు. తిలకుపక్షమున బారిష్టరు జిన్నాగారు 153 ఎ. అనుసెక్షను ప్రకారము విధింపఁబడిన రు 1000 ల జరిమానాను గవర్నమెంటువారు రద్దు పఱచిరని చెప్పిరి; గవర్నమెంటుపక్షమున బిన్నింగు అది నిజమే అనిరి.

తిలకు తన యుపన్యాసముల అంశములను అచ్చటచ్చట లోపములుగను అసంపూర్తిగను ఉన్నను మొత్తముమీఁద సామాన్యముగ సరిగానె యున్నవని కోర్టువారికి ప్రత్యుత్తర మిచ్చెను. హోమ్ రూలును సిద్ధాంతపఱచుటయు లేక రక్షించుట బోధనచేయుట (Explain) యు అది లభ్యమగు నుత్తమమార్గము నగపఱచుటయు హోమురూలు లీగులో మెంబర్లగునట్లు వారిని ప్రోత్సాహపఱచుటయు తనయుద్దేశ మని ఆయన చెప్పెను. కొద్దిమాటలలో హోమ్‌రూలు అను దానిని విపులముగ చెప్పుమనఁగా ఆయన "నాయుపన్యాసములలో చెప్పఁబడినది," అని ప్రత్యుత్తర మొసంగెను.

డిఫెన్సు (తిలకు) పక్షమున సాక్షులను విచారించలేదు. డిఫెన్సు (తిలకు) యొక్క న్యాయవాది ఆయుపన్యాసముల భాషాంతరీకరణము సరియైనదికాదని విశేషముగ వాదించలేదు. కాని, నేను ముందు చెప్పఁబోవు కొన్నిపదముల తర్జుమావిషయములో ఆయన ఆక్షేపించుచున్నాఁడు.

మొదటి యుపన్యాసము (జి. గుర్తుగల దస్తావేజులో 3 వ పుటలో 4 వ పంక్తిలో "ది" అను (నాంగ్ల)పద మనవసరమనియును; ఆపుట మధ్యనున్న "యన్‌టిటీ" (Entity) అను (నాంగ్ల) పదము "ఫారం" (Form) అని యుండవలయుననియును సూచింపఁబడెను; 5వ పుటలో 'కన్‌సీట్' (Conceit) అను (నాంగ్ల) పదమునకు మాఱుగా "ఓవర్ కాన్ఫిడెన్సు" (Over- confidence) అని యుండవలయునని డిఫెన్సు తిలకుపక్షమున సూచించినారు; 6 వ పేజీలోనున్న 'రోగ్' (rogue)అనునది 'ధూర్తు

అనుదానికి సరియగు తర్జుమా కాదని ఆక్షేపించినారు ; 7 వ పుటలో "ఎక్యూములేటెడ్" (accumulated) అని దానికి బదులు "కలెక్టు" (collect) అని చదువుదురు ; 8 వ పుటలో "అబ్‌స్ట్రక్షన్" (obstruction) అనుదానికి "హిన్‌డ్రన్సు" (hindrance) అనియును, 9 వ పుటలో "సావరిన్సు పాలిసీ" (sovereign's policy) అనుదానికి బదులు "స్టేటుపాలిసీ" (state policy) అనియును చదువుచున్నారు. 1 వ యుపన్యాసములో పూర్ణమైన సవరణల జాబితా యిదియె. ఈకోర్టువారి యభిప్రాయము ప్రకారము బొత్తుగా ప్రాముఖ్యతలేనిది చిట్టచివరదే అనఁగా చిట్టచివరసవరణయే. "సావరిన్సు పాలిసీ" (Sovereign's policy) అను అర్థమిచ్చు "రాజధోరణి" అనునది మరాటీవ్రాత (transcript) లో నగపడుచున్నది. అందులో "రాజ్యధోరణి" అని అగపడునెడల "స్టేటుపాలిసీ" (state policy) అని సరియైన తర్జుమాయగును. "రాజ", "రాజ్య" అనుపదములకు ఎట్టిభేదమును లేదని యొక సాక్షి వ్రత లేఖరియును, అట్టి భేదమున్నదని రెండవయతఁడును చెప్పిరి. ఎట్లైనను, ఉపన్యాసకుఁడు చెప్పినది బాగుగ వినఁబడకుండవచ్చు నని యెంచుట యుక్తమని కోర్టువారికి తోఁచుచున్నది. 1 వ యుపన్యాసములోని వాదమునందలి సామాన్యధోరణినిబట్టి చూడఁగా 9 వ పుట చివరభాగమందు "సావరిన్సుపాలిసీ" అనుదానికంటె 'స్టేటుపాలిసీ' అని యుండుటయే బాగుగ నున్నది. కాఁబట్టి యీవిషయములో సందేహముయొక్క లాభమును డిఫెన్సు (తిలకు) పక్షమున అంగీకరించి "స్టేటు పాలిసీ' అని చదివెదను.

రెండవ యుపన్యాసము (దస్తావేజు హెచ్, Exhibit H) లో రెండవపుటయందు 2 సవరణలను సూచించుచున్నారు. మొదటి "రూలింగ్ పవర్" (ruling power- ప్రభుత్వాధికారము) అనుదానికి బదులు "అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది స్టేటు" (administration of the state) అనఁగా రాజ్యపరిపాలనము, అనియుండవలయును దానిని ప్రాసిక్యూషన్

గవర్నమెంటు పక్షముగ న్యాయవాది యొప్పుకొనెను. రెండవది, "ఏలియన్సు (aliens అనగా పరాయిలు) అనుమాటయొక్క అర్థము విషయములో కొంతవఱకు కష్టముగుభాగముయొక్క మెఱుఁగగు (improved) తర్జుమా 2 వ సాక్షియొక్క వాఙ్మూలములో నీమెఱుఁగగుతర్జుమా కనఁబడును.

మూఁడవయుపన్యాసము (దస్తావేజు ఐ, Exhibit I) 1 వ పుట చివరనున్న "స్లేవరి", "బాండేజ్" (Slavery and Bondage) అనుపదములను డిఫెన్సు (తిలకుగారి) పక్షమున నాక్షేపించుచున్నారు (challenged), "గులాంగిరి", "దాస్యము" అనునవి మహారాష్ట్రపదములు; రెండవసాక్షియును అనుభవజ్ఞుఁడగుభాషాంతరీకరణకర్త యీపదములను సరిగానే తర్జుమా చేసినట్లు రూఢిగ చెప్పుచున్నాఁడు; డిఫెన్సుపక్షమున మొదటిదానికి "సర్విట్యూడ్" (servitude) అని యుండవలయునని రూఢిగ చెప్పుచున్నారు. "దాస్యము" అనుదానికిఁగూడ నాపదమునే యుపయోగించవలసియున్నట్లు సాక్షికి వారు సూచించినారు.

3 వ పుటలో "పశువు" అనుశబ్దమునకు "బీస్టు" (beast) అని యుండఁగూడదని ఆక్షేపించుచు, దాని స్థానమున "అనిమల్" (animal) "క్యాటిల్" (cattle) అని సూచించుచున్నారు.

ఉపన్యాసములందంతటను "గులాంగిరి" అనునది ఉన్నచోట్ల "స్లేవరి" (servitude) అని తర్జుమా చేయఁబడినది; (దీనికి) డిఫెన్సు పక్షమున "సర్విట్యూడ్" (servitude) అని యుండవలయునని యనుచున్నారు.

కోర్టువారు కనుఁగొనఁగలిగినంతవఱకు తర్జుమా విషయములలో డిఫెన్సుపక్షమున నాక్షేపింపఁబడువానియొక్క సంపూర్ణమగు జాబితా యిదియే. సామాన్యముగ నెంచఁబడురీతిగా అర్థమునకు సందేహము కలుగఁజేయునట్టిపదము లచ్చటచ్చట లోపించియున్నవి. మొత్తముమీఁద, మహారాష్ట్రభాషలో వ్రాయఁబడిన బి, డి, యఫ్ గుర్తులదస్తా

వేజీ (Exhibits B, D & F) లకు జి, హెచ్, ఐ, గుర్తులుగల దస్తావేజులు (Exhibits G, H & I) సరియైన తర్జుమాలుగానే యున్నవని నిశ్చితాభిప్రాయముల నొందుటకు ఈకోర్టువారికియెట్టి యిబ్బందియు నగపడదు. మఱియు, తిలకుగారు చెప్పినదానిని వాస్తవముగను సంపూర్ణముగను వ్రాసినట్లు చెప్పుచున్నట్టియు, వారి వృత్తియందనుభవము కలిగియున్నట్టియు క్లుప్తలేఖకుల మాటలను విశ్వసింపకుండుటకు కారణ మేమియును నాకగపడదు.

బిన్నింగుగారు (Mr. Binning) ప్రాసెక్యూషన్ (గవర్నమెంటువారి) పక్షమున అన్ని యుపన్యాసములమీఁదను ఆధారపడియున్నారు. ఆయన కాధారము లగు కొన్నిభాగములను ఆయన కనఁబఱచినాఁడు. జి, హెచ్, ఐ, గుర్తులుగల దస్తావేజుల (Ehibits G, H & I) లో అట్టిభాగములను ఎఱ్ఱరంగులో కోర్టువారు గుర్తు పెట్టినారు. హోమ్ రూలు విషయమైన చర్చయొక్క మంచిచెడుగుల (propriety) ను గూర్చి ఆక్షేపించుటలేదని ఆయన (బిన్నింగుగారు) స్పష్టముగ చెప్పుచున్నాఁడు. ఆవిషయములోఁ నేమియు చెప్పఁగూడదని (గవర్నమెంటు వారు) ఆయనకు చెప్పినారఁట. తిలకు గవర్నమెంటువారియెడల అమర్యాద (dishonest), అపవిత్రము (corrupt) లగుఉద్దేశ్యములు నారోపణచేసిన యుపన్యాసభాగములు (మాత్రమే) ఇండియాదేశపు శిక్షాస్మృతియొక్క 124 A అను సెక్షన్ క్రింద రాజద్రోహ మగునను కారణముచేత ఆయనను (అనఁగా తిలకుగారిని) శిక్షించవలసినదిగా చెప్పినాఁడు.

మేనెల తే 1 ది ఇయ్యఁబడిన యుపన్యాసమును సూక్ష్మముగ విమర్శించిచూచితిమేని (analyse) ప్రప్రథమమున ఆయన ప్రస్తుతము ఇండియాదేశములోనున్న గవర్నమెంటును రెండుభాగములుగ అనఁగా 1. "అదృశ్యమగు నాంగ్లప్రభుత్వము", 2. "ఎవరివలన అదృశ్యప్రభుత్వము పనిని జరుపుచున్నదో అట్టి దృశ్యప్రభుత్వము."—అని విభాగిం

చుట కొనర్చిన ప్రయత్న మగపడును. మొదటిదానియొక్క మార్పును కోరుటలేదని తిలకు చెప్పుచుండెనుగాని రెండవది "ఇతరులచేతులలోనికి పోవలయు" నట; మఱియు ఆయన ముందుబోధించునట్లు "మన యొక్క స్వహస్తములలోనికి" అనఁగా దేశములోని ప్రజలచేతులలోనికి; అని ఆయన తాత్పర్యము.

ఉద్యోగస్థుఁడగు ఒకసిపాయియైనను (sepoy) లేక ఒకగవర్నరునైనను తీసివేయుమని కోరుట రాజద్రోహముకాదని తన శ్రోతల (audience) కాయన చెప్పసాగెను. పిమ్మట, ఇప్పటి పరిపాలనము బాగుగ జరుగుచుండలేదను తన యభిప్రాయమును స్పష్టపఱచుచుండెను. వారనుకొన్న ఇబ్బందులు లేక, మొఱలు, (greivances).—కులకరణీవతనులనుతీసివేయుట, అటవి (సంబంధమగు) 'జూలమ్' (Zulum), మద్యపానాభివృద్ధి,తగువిద్య లేకుండుట, బెల్గాములో జూరీల (Jury)వలన విచారణ జరుగుటను తీసివేయుట, కర్నాటములో కలాశాల (College) లేకుండుట,—అను ఇబ్బందుల జాబితాను ఆయన యిచ్చుచున్నాఁడు. ఇట్లేలయుండవలయునని ఆయన అడుగుచున్నాఁడు. ఒకటే ప్రత్యుత్తరమున్నది. "వారిస్థానమున మీరే ఉద్యోగములలో నున్నయెడలకాని, వారి అధికారము ప్రజాభిప్రాయము ననుసరించవలసిన బాధ్యత కలదైన యెడలకాని ఇట్టివి తటస్థించి యుండవు"; వారు అసహాయులు (helpless) గ నున్నారనియును, వారు కలెక్టరునకు అర్జీ(మనవి)నీయుట నేమియు చేయఁజాలరనియును చెప్పుచున్నాఁడు. "మన కింతకంటె మంచిపద్ధతి కావలయును. ఇప్పటి యుద్యోగస్థులు ప్రజలచే ఎన్నుకొనఁబడనందున వారికే (అంతయు) బాగా తెలియుననుకొనెదరు,—అది వారి అతిశయము (conciet) లేక, అతినమ్మకము" (over-confidence); "మాయిష్టప్రకారము మీరు ప్రవర్తించునెడల మీ యిబ్బందు లన్నియును తొలఁగిపోవును. అని తక్కిన అధికారవర్గమువారు (bureaucrats) అనెదరు. తర్వాత జనులకును "అదృశ్యప్రభువు లేక ప్రభుత్వము" నకు

మధ్య దృశ్యప్రభుత్వము ఈదేశమందు "దేవతల" వలె నున్నట్లు చెప్పు చుండెను. "దేవునకు కోపము రాదు; కారణము లేకయే యీ దేవతలకు కోపము వచ్చును," (అనెను). వారిరక్షితుని (ward) చేతులలో వారి వ్యవహారముల నిర్వహణము నుండనీయకుండుటకు పంచాయతీదార్లు (panch) చేయు ప్రయత్నమును ఒక యుదాహరణముగ నిచ్చుచున్నాఁడు. రక్షితుఁడు సగము పిచ్చివాఁడనియును, అతనికి దురభ్యాసము లున్నవనియును అనెదరు. తుదకు వారు న్యాయస్థానమునకువెళ్లి అతనిని పిచ్చివాఁడని స్థిరపఱచెదరు. "ఇట్టివి కొన్ని యిచట తటస్థించ నారంభించినవి" (అనెను).

అంతట, ముగ్గురు దొంగలయొక్క కథ ప్రారంభమగును. సర్ ఆర్. భండార్కర్‌గారు కవున్సిలు (Council) లో యూనివర్సిటీ బిల్లు (University Bill) విశ్వవిద్యాలయపు చిత్తులచట్టము విషయములో నుపన్యసించునపుడు—సుప్రసిద్ధుఁడును, గౌరవనీయుఁడు నగుగోఖ్లేగారి వంటివారినికూడ చేర్చి—తన ప్రతికక్షులను కథలోని ముగ్గురు దొంగలకుఁ బోల్చిన అంశమును ప్రమాణముగా (ఉదాహరణముగా, or by quoting) గైకొని యీకథకు డిపెన్సు (defence) పక్షమున జిన్నాగారు కొంతమర్యాదను కల్పించచూచెను. కాని, ఒకకథ ననేక విధములుగ చెప్పవచ్చును; దానిఫలితార్థ మనేకవిధములుగ నుండ వచ్చును. "హోమ్‌రూలును విశ్వసింపని (advocate) ఇండియనులకును కథలోని దొంగలకును గలపోలికను తనశ్రోతలకు (audience) అగపఱచుటయును వారికి హక్కుగల ఆస్థియైన స్వరాజ్యమును తొలఁగింప ప్రయత్నించువారి మోసములవిషయములో జాగ్రత్తగ నుండునట్లు వారికి హెచ్చరిక చేయుటయును ఆయన ఆశయ మైనట్లు కనఁబడుచున్నది.

అటుతర్వాత ఆయన తగియుండుట (or సమర్థత, fitness) ను గూర్చి చర్చించుచున్నాఁడు. 60 సంవత్సరముల వయస్సుగల మహ్లుత్ దా

ర్లపై అధికారము చలాయించు (lords over) నట్లు ఆయన సూచిం చెడునట్టియు ఇంగ్లండునుండివచ్చునట్టియు అనుభవములేని పిన్నవయ స్కులనుగూర్చి (తిలకుపక్షమున జిన్నాగారి యొప్పుదల ప్రకారము) దూష్యమైనట్లొప్పుకొను కొన్ని ప్రసంగముల ఆయన చేయుచున్నాడు (indulges).

ఈ (క్రింది) మాటతో నీచర్చ ఆయన ముగింపుచేయుచున్నాఁ డు; "మీరెంతకాలము మాకు బోధించెదరు?....దీని కేమైన నంత మున్నదా? లేక తుదవఱకు ఈవిధముగ మీక్రింద బానిసలవలె పని చేయవలెనా?" ఆయన (యింకను) ఇట్లు చెప్పుచున్నాఁడు:—"ఈయు ద్యోగస్థులు ప్రజలవిద్యపై నధికారము గలిగియున్నారు; వారి నభివృద్ధి లోనికి తెచ్చుట వీరిపని అయియున్నది; వారి విధి యొకవైపున (or విధ ముగ) నున్నది, వారు మఱియొకవైపున (or విధమున) ప్రయత్నములు చేసెదరు. వారెన్నివిధములుగ ప్రయత్నించినను ఈజనులు పనికి తగి యుండుట దుర్లభ మని వారనెదరు. అదృశ్యప్రభుత్వము ఎదుట నీతు మాపణలు చెప్పుట ఒకవిధముగ వారి స్వలాభసిద్ధికొఱకగుపనియని నాయభిప్రాయము."

స్వదేశసంస్థానమగు మైసూరులో నెమ్మదిగ (smooth) పరిపాల నము జరుగుటనుగూర్చి చెప్పినపిదప యిట్లనుచున్నాఁడు. "ఇండియ నులు పరిపాలనముచేయుటకు తగరని చెప్పుటకుఉద్దేశ్యము వారినెల్ల పుడు బానిసత్వమునం దుంచుటయును, బానిసలవలె వారిచేత పనిచే యుంచుటయును, వృద్ధికానున్నవారి బుద్ధిసామర్థ్యములను ఆపుటయునై యున్నది."—ఆయన శ్రోత లిట్టిభావములను విని, అహ్లాదము (cheers) నగుపఱచుచు లజ్జాకరమని (shame) అఱచిరి.

తర్వాతిభాగములో (next paragraph) 9 వ పుటలో ప్రజల మేలునెంచని పరిపాలనమయిన ఈ స్టిం డియా కంపెనీవారియొక్క ద్రవ్యార్జన, లేక వర్తక ధోరణి (trading policy) నిగూర్చి చెప్పు

చున్నాఁడు. 1859 సంII రములో విక్టోరియా రాజ్ఞిగారు పరిపాలనమును తనచేతిలోనికి తీసికొనెను ; కాని, నవుకర్లయేర్పాట్లు ఎప్పటివలెనే (or పూర్వమువలెనే,) యుండెను. కంపెనీయొక్క డైరెక్టరు (direct or)పోయి ఆయనస్థానమున రాజకీయకార్యదర్శి (State Secretary) వచ్చెను. 'ఇండియాలో సొంతద్రవ్యమును వ్యయపఱచవలసినదియు, ఎట్టిపన్నుల (taxes) విధించవలసినదియును నిర్ధారణచేయునదియితఁడేకాని, గవర్నరుజనరల్ కాదు. ఇది 'వర్తకధోరణిమాత్రమే' అని తిలకుగారిట్లనుచున్నారు; "రాణిగారి ప్రభుత్వము పరిపాలనము గైకొనినను, వారుప్రకటనను (Proclamation) జారీచేసినను, రాజధోరణి (లేక, రాజ్యధోరణి) ప్రకటన కాధారముకాదు. 'రాజధోరణి' వర్తక సంఘ ధోరణి ననుసరించియేయున్నది; రాజ్యపరిపాలనము కంపెనీ (సంఘపు) ధోరణి ననుసరించియే యున్నది. మఱియు నీమధ్యకాలములో ప్రకటనయొక్క ప్రయోజనము లేకున్నది, (హాసము, ఆహ్లాదము)..."

ఆతర్వాత, అధికారవర్గము (bureaucracy) రాజకీయకార్యదర్శి, గవర్నరుజనరల్, ఇండియాలో జనులకు హెచ్చుఅధికారములను ఉద్యోగములను ఇచ్చెదమని ఊఱడించుచున్నారు (cajoiling); అంతట విద్యాధికారశాఖలలో తాబే (or కొద్ది) నవుకర్లందఱును ఇండియనులే అయినను వారి నోళ్లను (mouths) కట్టుటకును వారిబుద్ధిని అపుటకును వారిపై నొక సాహేబు (or ఆంగ్లేయుఉద్యోగి)ను యుంచినారను ఆక్షేపణీయమగు సంగతులు వెడలినవి.

మఱికొంతసేపటికి (a little late) రాజకీయకార్యదర్శి అవసరములేదనుచు ఆయనను అల్లునితోపోల్చి శేషించినదిమట్టిముద్ద (result of a cob), అని సూచించెను. కొన్ని పంక్తులక్రింద నీవాక్యమున్నది. "దేశజను లందఱికిని సుఖముబ్బవలయును, ఇప్పుడున్న వేలకొలఁదికష్టములుతొలఁగవలయును; గనుక, ప్రప్రథమున యీపరిపాలనాపద్ధతిమా

ర్చవలసినదని మరలనే ననెనను." వారికి స్వరాజ్య మియ్యనేని, వారికష్ట ములునశించునని శ్రోతల (audience) కు చెప్పెను. అందులకు ఉపరివ్య యము(నకుద్రవ్యము) కావలసినయెడల అట్టిది బుద్ధిపూర్వకముగ నీయఁ బడును, కాని వారికది మనస్తాపమును కలిగించదు. అంతట, (నీక్రింది కోపముఖ్యమగువాక్యము వచ్చుచున్నది ; "మనమీ ద్వారముగుండ నడచుచుండఁగా, ఈద్వారముగుండ నడవకూడ దనియును, ఆద్వారము గుండనడువదగుననియును, విద్యాధికులు (లేకశాస్త్రజ్ఞులు) అనువరాయి వారు మనకు చెప్పుదురు; కాని, యెవరైననువచ్చి అచట నిలువంబడి దానిగుండ వెళ్లవలదని చెప్ప నారంభించు నెడల అప్పుడు మన మతనిని గెంటివేసి బయటికి వెళ్లవచ్చును. స్వరాజ్యముయొక్క స్థితియు నట్టిదియే, మనకున్నది అధికారవర్గముయొక్క అభ్యంతరమే."

"ఈద్వారము" అనఁగా పార్లమెంటుయొక్క ద్వారమనియును. వాక్యములో కొంత లోపించినదనియునుకూడ జిన్నాగారు సూచించు చున్నారు. అంతట కలెక్టరునకు రు 2500 లు (జీతము)ఇచ్చి, అతివ్య యము (extra agency) చేయుటనుగూర్చి చెప్పుచున్నాఁడు. శీతో ష్ణస్థితి మొదలగు కష్టములవలన వా రింతపెద్దజీతము కోరుచున్నయెడల "వారి నిచటి కెవరురమ్మనిరి? మన మడుగలేదే" అని తిలకు ప్రశ్నోత్త రముల నిచ్చుచున్నాఁడు.

కొన్నిపంక్తులు పైకివెళ్లి ఆయన హోంరూలు అందోళనమును వృద్ధిపఱచునిమిత్త మీవిషయమును (ప్రజలయెదుట) నుంచఁబూనినా నని శ్రోతలకు చెప్పుచున్నాఁడు.

బెల్గాములో 1916 సం॥ మేనెల 1 వ తారీఖున జరిగిన 18 వ రాష్ట్రీయసభలో అన్నివిధములగు మనుష్యులుగల సభవారి (or శ్రోత లకు—audience) ఇయ్యఁబడినఁ ప్రథమోపన్యాస మట్లుముగిసినది.

ఈ యుపన్యాసవిషయములో డి పెన్సు (తిలకుపక్షము వా రేమని చెప్పెదరు ? 1 వ యుపన్యాసములోని విమర్శనము ఒకవిధమగు పరిపాల

కులనుగూర్చిన విమర్శనమనియును, బ్రిటిషుఇండియాలో ఏర్పడిన గవర్న మెంటు అనఁగా "ఏముఖ్యవిధమగు పరిపాలకులకును భిన్నమగు రాజకీయపద్ధతి ప్రకారము అమలులోనున్న బ్రిటిషు ప్రభుత్వమును, దాని ప్రతినిధులు," అని 22 బొంబాయి 135 పుటలో న్యాయమూర్తి స్ట్రాచీ (Mr. Justice Strachey)గారి అర్థమున కనర్వయించినదనియును, కోర్టువారితో జిన్నాగారు చెప్పినారు.

దీనిని నిరాకరించుటకు పైన కనబరచిన వాక్యములు లేక, భాగములు (quotations) తగినన్ని హేతువుల నిచ్చుచున్నందున కోర్టువారాసూచనను నిరాకరించుట కెట్టి సంశయమును లేదు.

1858-సం॥పు చట్టము* దానిరద్దునిమిత్తముకాని, సవరణనిమిత్తము కాని, శాస్త్రోక్తముగ అసంతృప్తి (Disapprobation) గనఁబఱచఁదగిన చట్టముమాత్రమై యున్నదని జిన్నాగారు మఱొకరీతిని కేసు వాదించుచున్నారు. తిలకుగారు దానిని మార్పించదలఁచినయెడల ఆచట్టమువలన నేర్పడిన పద్ధతి యేవిధముగా చెడ్డదగునో లోపములు కలదగునో తెలుపవలయును. ఆయన పార్లమెంటుద్వారా శాస్త్రీయ పద్ధతిని మార్పుచేయించునట్లు చెప్పుచున్నాఁడు; (అట్లగుచో) ఆయన ఆపద్ధతిని విమర్శించి దానియందలి తప్పులను వెలిబుచ్చవచ్చును; లేనియెడల దానిని మార్పించుటకు ఆయన కవకాశముండదు.

ఇండియాదేశపు శిక్షాస్మృతియొక్క 124 A అను సెక్షన్‌లో పడకుండునట్లు ఆయన విమర్శన ముండవలయుననునదియే దీనికి సులభమగు ప్రత్యుత్తరము. ఆసెక్షన్ అనేకములగు రిపోర్టుఅయిన కేసులలో (reported cases) లేక తీర్పులలో, విశదపఱచఁబడి వ్యాఖ్యానము చేయఁబడినది. 22వ బొంబాయితీర్పులో తిలకుయొక్క ప్రథమ విచారణయందు శాస్త్రము సంపూర్తిగ చర్చింపఁబడినట్లు ఒప్పుకోనఁబడు

* అనఁగా దేనిబట్టి ఇండియాలోని గవర్నమెంటు ఏర్పఱుపఁబడెనో, అట్టి చట్టము. ఆచట్టము రద్దుచేయఁబడి 1915 సం॥పు చట్టములో చేర్పఁబడినది.

ఆమీఁదజరగిన ఆందోళనమువలన 1919 సం॥ న మరొకచట్టము ఏర్పాటైనది.

చున్నది. 137 పుటలో అసూయ (disaffection) అసంతృప్తి (dis-approbation) అనువానిభేదములను న్యాయమూర్తి స్ట్రాచీగారు తెలిపినారు. ఇండియాలో శాస్త్రీయముగ నేర్పడిన గవర్నమెంటు అను దాని నిర్వచనము 8నబొంబాయి (తీర్పు) 438 పుటలో నున్నది. ఇది 22 బొంబాయి (తీర్పు) యొక్క 135 పుటలోని నిర్వచనము విపులముగ చేయుచున్నది. నేనీధర్మశాస్త్రమును విశేషముగ చర్చింపఁ బూనను ; అది యిప్పుడు బాగుగా తెలిసియే యున్నది. న్యాయమూర్తి స్ట్రాచీగారి మాటలప్రకారము అసూయ (disaffection) అనఁగా "ప్రేమ (affection) లేకుండుట, లేక వైషమ్యము...." "గవర్నమెంటువారి పనినిగాని చట్టము (measure) నుకాని ఒకఁడు విమర్శింప నగును, లేక, వ్యాఖ్యానము చేయనగును.... అట్టిచట్టముల (measures) యెడల దృఢమగు అయిష్టము (condemnation)ను కనపఱచనగును; అతఁడట్లు కఠినముగను నిర్హేతుకముగను, మూర్ఖత్వముగను (perversely) అక్రమముగను కూడ చేయ నొప్పును....కాని, అంతకుమించి చట్టముల (measures)ను వ్యాఖ్యానము చేయుట యందుఁగాని, మఱొకవిధముగఁగాని, గవర్నమెంటు నెడల నసహ్యమును, నిరాదరణమును కలుగునట్లు చేయు నెడల"....ఎట్లనగా "దానికి (అనఁగా గవర్నమెంటునకు) జను లనుభవించు ప్రతివిధమగు చెడుగు, దురదృష్టముల నారోపించునట్లుగాని, లేక, దానియొక్క పరాయిపుట్టుక (foreign orgin) లేక, స్వభావమునుగూర్చి విరుద్ధముగ చెప్పునట్లుగాని, లేక, దానికి దురుద్దేశముల నారోపించునట్లుగాని, లేక, ప్రజలక్షేమమున కది విరుద్ధముగను, లేక అశ్రద్ధగ నుండినట్లును"— (చెప్పినయెడల) యీసెక్షను ప్రకారము దోషియగుచున్నాఁడు.

బెల్గాము ఉపన్యాసములోనుండి పైని పేర్కొనిన భాగముల (quotations made above) లో ఒకమనుష్యుఁడు చేయరానట్టి నాలుగంశములలో మూఁడంశములు (samples) ఉన్నవి.

కాఁబట్టి, బ్రిటిషుఇండియాలో శాస్త్రీయముగ నేర్పడిన గవర్నమెంటు నెడల అసహ్యమును నిరాదరణమును గలుగఁజేయునట్టి మాటలను 1916 సం॥ రము మే నెల 1వ తేది బెల్గాములో బి. జి. తిలకు ఇచ్చిన యుపన్యాసములో ఉపయోగించినట్లును అట్టి గవర్నమెంటు నెడల అనూయోద్రేకమును కలిగించుటకు ప్రయత్నించెననియును, అందువలన ఇండియాదేశపు శిక్షాస్మృతియొక్క 124 అను సెక్షన్ ప్రకారము శిక్షింపఁబడదగిన విషయములను వెదజల్లినాఁడనియును తీర్మానించుటకు ఈకోర్టు కేమియు సందేహము లేదు.

అహమ్మదునగరులోఁ దరిమిలా అనంతరము నీయఁబడిన రెండు ఉపన్యాసములనుగుఱించి విశేషముగాఁజెప్పుట అనావశ్యము. నిస్సందేహముగా వానిలో రాజద్రోహవిషయములు పెక్కులు (passages) ఉన్నవి. ఇచట సంగ్రహముగా నుదాహరింపఁబడును. మే నెల తే 31 దిగల యుపన్యాసము (హెచ్ గుర్తుగలదస్తావేజు) లో 2 వ పుటయందు గవర్నమెంటు పరాయిదయినట్లు వర్ణించుచు పరాయి అనుదానికి యిట్లు నిర్వచనము చెప్పుచున్నాఁడు:—"ఎవరు యీవిధిని (అనఁగా వేనివలన దేశముగొప్పదై లాభమునుపొందునో అట్టివానిని) నెఱవేర్పక స్వలాభమునకును తనజాతివారిలాభమునకును స్వదేశలాభమునకును అపేక్షించునో, అట్టివానిని పరాయివాఁడనవచ్చును;" అతఁడిట్లనుచున్నాఁడు:— "గతించిన 20 లేక 25 వ సంవత్సరములనుండి ప్రజలు తమ యిబ్బందులనుగూర్చి మొఱబెట్టుకొనుచున్నారుకాని, గవర్నమెంటు(ఆయన మరల నీవాక్యమునే నుడువుచున్నాఁడు) పరాయిది. దానికి తెలియదు.........మీరెంతమొత్తుకొన్న (clamour) ను మీరెంత అందోళనము చేసినను, మీరెన్ని కారణముల నగపఱచినను, తన రిపోర్టు (report) లో నుండి తయారు చేయఁబడి దానియెదుటనుంచఁబడిన సంఖ్యలను చూడలేనంత (దానిదృష్టి) మార్పునొందినది." "ఇంకను (ఇట్లనుచున్నాఁడు)" గవర్నమెంటుకు నొకవిధమగు మతవిధి (Religious duty) యున్నది; దాని

బోహువులపై నొకవిధమగుభార మున్నది. గవర్నమెంటు ఇట్టిభార మును తప్పించుకొను(evades) నెడల అది గవర్నమెంటేకానేరదు. అని నే ననెదను." అంతట ఆయున ఇండియాలోని గవర్నమెంటు ఉద్యోగస్థులను ఇండియాలోని సామెత ప్రకారము యజమాని తనద్రవ్యమును పుష్కలముగ ఖర్చుపెట్టునపుడు కష్టపడు (కడుపునొప్పిగలిగి) నట్టి మధ్యవర్తులు, లేక ధాన్యపుకొట్ల కావలివాండ్రతో (keepers of granaries) పోల్చుచున్నాఁడు. దురాపేక్షాపరులును, స్వార్థపరులు నగుటచే యజమానికిని, (ఆయునయొక్క) ప్రజలకును మధ్య నడ్డగించు (obtrude) నట్టి మధ్యవా రనుచు వాడుకలోనుండు సామెతలోలేని మధ్యవారినొప్పిగలకడుపును తొలఁగింపవలయునను సూచనకలుగచేసి తన శ్రోతల (audience) కు చెప్పిన సామెతకు విషము (sting) కలుగచేసినాఁడు ; (లేక విషము పోసినాఁడు).

ఆపైని మరొకచోట ఆంగ్లేయప్రభుత్వమేయుండవలయునని తన కోరికయునియు, దాని స్థానమున జర్మనులప్రభుత్వమును తా నపేక్షించ ననియు, ఈవిషయమును గమనించవలయుననియు ఆయున చెప్పినాఁడు. తిలకుయొక్క సదుద్దేశమునకును రాజభక్తికిని సాక్ష్యముగ ఈవాక్యములు నంగీకరింపవలసినదిగా జిన్నాగారు కోర్టును కోరినారు.

వేఱొకచోట, విద్యగఱపుటకు ద్రవ్యము లభింపకున్నను, అధికారవర్గమునకు జీతములు వృద్ధిచేయుటకు లభ్యమగుచున్నదని తిలకు మొఱబెట్టుచున్నాఁడు (complains). పిమ్మట అతఁ డిట్లనుచున్నాఁడు:- "వారిజీతము నెట్లు జాగ్రత్తపఱునది చూచుకొనుటయే వారి మొదటి యాలోచన (look out) గా నున్నది.

మరల, ప్రజలు తమంతట తాము పరిపాలనము చేసికొనునట్లు 50 సం॥ ములలో ప్రజలను తెలివియుతు (or విద్యావంతులుగ-educated) చేయనందున ప్రస్తుతపు గవర్నమెంటు తగినదికాదని ఆయున(స్పష్టముగ) చెప్పుచున్నాఁడు, (declares). ఇండియనులు తగ రనువిషయములో

వారిమోసమును క్రిందుమీఁదు (or తలక్రిందు shuffling) చేయుటయును వర్ణించుచున్నాఁడు. వారి యిండ్లలోనవ్వు బదులుగా సాహేబుగారి (saheb) ముఖము నెదుట నవ్వఁగల ధైర్యమును వారు కలిగియుండవలయునని తన శ్రోతలకు (audience) చెప్పుచున్నాఁడు. ఆయన తుదకిట్లు వారిని ప్రోత్సాహ పఱచుచున్నాఁడు, (Exhorts):— "మీరు బానిసలుగా నుండఁదలఁచినయెడల అట్లే యుండుఁడు. బానిసత్వమున కిష్టపడువానికి నూఱుపర్యాయములు హితోపదేశముచేసిన నేమి ప్రయోజనము? బానిసతనము (slavery) లో నుండుట కిష్టము కలవాఁడు నిరభ్యంతరముగ (freely) అట్లే యుండవచ్చును. కాని, ఇది పౌరుల స్థితి (or లక్షణము-condition) కాదు." జిన్నాగా రిట్లనుచున్నారు :— "ప్రజలను నిద్ర (lethargy) నుండి మేల్కొలుపుటయే తిలకుగారి యుద్దేశ్యము;" సందేహము లేదు. కాని, అట్లు చేయుటకు ఆయన మూఁడు ఉపన్యాసములలో 10, లేక, 12 పర్యాయములు వారు బానిసలని గాని లేక, ఆతర్జుమా నంగీకరించునెడల—దాస్యము (servitude) అనిగాని, చెప్పుచున్నప్పుడు, వారిని (ప్రజలను) ఈదురదృష్టస్థితియం దుంచినందులకు జవాబుదారి వహించినదని ఆయన చెప్పుచుండు గవర్నమెంటు నెడల అనూయ (disaffection) కలిగించుటకు ప్రయత్నించినాఁడని ఆయనపై దోషారోపణవచ్చినదని ఆయన విచారపడ (or మొఱపెట్టుకొన-complain) కూడదు.

మఱుదినమునం దాయనయిచ్చిన తృతీయోపన్యాసము(ఏ గుర్తుగల దస్తావేజు, Exhibit I) లో నుండి రెండువాక్యములు (or భాగములను, passages) నే నుదహరించెదను. మొదటిది బానిసతనపు ధోరణిని వృద్ధిపఱచినది; అది యిట్లున్నది:—"మన చేతిపనులు (or పరిశ్రమలు (industries) వృద్ధికావలయును. కాని, అది యెందులకాపఁబడినది? దాని నెవ రాపిరి? ఇందులకు కారణము మనము వెదుక నారంభించునెడల ఈ పరిశ్రమసంస్కరణము (industrial reform) ను ఈమిత్రవర్గ

యసంస్కారణము (economic reform) ను మన మాపలేదని కనపట్టును. ఏ దేశములో (nation) ఒకని సమర్థత నుపయోగించుటకును కనఁబఱచుటకును మార్గము, స్వేచ్ఛలనునవి యుండునో అచట సద్గుణము లభివృద్ధినొందును. కాని, యాపత్తును బానిసతనము, కట్టుబాటు (Bondage) లున్నపుడు ఎట్టి గుణము లభివృద్ధినొందును? యజమానుని అనుగ్రహము లేక యేమియు కానేరదు." తన శ్రోతల (audience) ను ఆయన (అనఁగా తిలకుగారు) మేల్కొల్పుటను (wake up) ప్రయత్నించుచుండెనని జిన్నాగారు మరల చెప్పుచున్నారు; తన శ్రోతలయొక్క ప్రేమను చెడఁగొట్టుటకు ప్రయత్నించుచున్నట్లును గవర్నమెంటు నెడల అసూయ, రాజద్రోహము లగునట్టి ప్రేమలేకుండుటనుగాని వైషమ్యమునుగాని కలుగచేయుచున్నట్లు పరులకుఁ దోచును, (సామాన్యన కగపడుచున్నాఁడు). మఱికొంత సేపటికి, వారు పరిపాలనమునందు మార్పు కలుగచేయనియెడల "ఇండియాలో ప్రతిమనుజుఁడును అంతకంతకు ఎక్కువగా నపుంసకుఁడు (effiminate) అగును. మన విధికృత మద్దియే. బానిసతనపు ప్రతిష్ఠాపనములు (institutions) అట్టివే;" అని చెప్పుటలో తన భావమును తిలకు స్పష్టీకరించినాఁడు.

జాతీయ (లేక దేశీయ national) సమస్య ఎట్లేర్పడిన దనుదానితో రెండవ ముఖ్యభాగము (వాక్యము, passage) ను బంధించియున్నది. "ఒక దేశములోని ప్రజలను గొడ్డు (beast) వలె భావించవలయునా, లేక, దేశములోని జనులను మనుష్యులుగ నెంచి వారిభావము, వారిస్వేచ్ఛాపేక్ష (ఇచటుస్పష్టముగ లేదు) లను ఆలోచించి నాగరకతనొందిన దేశములవారితో సమానముగ నుంచవలయునా యనునది ముఖ్యసమస్య" యై యున్నది. "గొడ్డు (beast) అనునది కఠినముగు పద మని డిఫెన్సుపక్షమున చెప్పుచున్నారు. సిద్ధముగానున్న నిఘంటువులనుచూచి సందర్భమును ఆలోచించినపిదప, ఇంగ్లీషు లేఖరి యీసందర్భమున "మూఢము గొడ్డు (brute, beast) అనుపదముల నుపయో

గించు ననియును తిలకునోటినుండి వచ్చిన "పశు" శబ్దమునకిదియే యర్థముకాని మరొకటిలేదనియును కోర్టువారునిర్ధారణ చేయుచున్నారు. ప్రభుత్వము నెడల శ్రోతలకు (audience) గల ద్వేషమును వినదీయనోపు నట్టి నింద్యములగు నితరభాగములు (or వాక్యములు, passages) ఈయుప న్యాసమందున్నవికాని, దానినుండి యింకను ఉదాహరించుట అనవ సరము.

న్యాయముగను స్వతంత్రముగను అచ్చటచ్చట స్వల్పభాగము లకు తగినట్టి ప్రాముఖ్యత ఈయకుండగను, ఈయుపన్యాసముల సారాంశ మునాలోచింపు నెడల, మన కవి యెట్టి అభిప్రాయమును కలిగించును? వానిని వినినజనుల కెట్టి యభిప్రాయము కలిగినట్లు మనము నమ్మవల యును? వారి ప్రస్తుత దుస్థితిని తెలిసికొనునిమిత్తమును (జిన్నాగారు చెప్పినట్లు) వారు మేల్కొనుటకును, వారు హోమ్‌రూలులీగులో చేరి దేశపరిపాలనావిషయములో మార్పుకలిగించుటకు ఆందోళనము జరుపు టలో తనకు సహాయముచేయునిమిత్తమును, గవర్నమెంటునెడల తన శ్రోతల (audience) కు అసూయ కలిగించవలయునని తిలకుయొక్క కోరికయని వానినుండి నాయభిప్రాయ మేర్పడుచున్నది. ఆయన మూఢు లను జనులకు (audience) ఉపన్యసించుచున్నాడు.—ఈవిషయమునే డిఫెన్సుయొక్క న్యాయవాది నొక్కి చెప్పినాడు. తాను దృఢమగు దృష్టాంతరూపముగ హేతువులను గనబఱచిననేగాని వారికి దానియం దభిరుచి కలుగదని ఆయనకు తెలిసియేయున్నది; గనుకనే, వారు బాని సలనియును, వారికష్టములు తొలగింపబడుట లేవనియును, వారి లాభమునకు విరుద్ధమగు తనస్వల్పలాభమునే గవర్నమెంటు చూచు కొనుచున్నదనియును, వారిని వారే పరిపాలింపుకొనలేరను అబద్ధపు మిషతో వారిని బానిసతనమునందే యుంచుట కెంచుచున్నదనియును, వారి కాయన చెప్పుచుండెను.

సివిల్ సర్వీసునుమాత్రమే తిలకునిందించుచున్నాడు, (attacking). గాని, గవర్నమెంటును కాదని జిన్నాగారు చేయువాదమును ఆయుపన్యా

సములను సమగ్రముగా (or జాగ్రత్తగా) చదువుచు తేఁడు వెంటనే నిర సించును, (discord). ఉపన్యాసకుఁడు (తిలకు) తెలిచుగా "బురాక్రసీ" (అధికారవర్గము) అనుమాట నాంగ్లమున నుపయోగించుచున్నాఁడు. కాని, యీవద్విశిష్టముగు గవర్నమెంటును గవర్నరుజనరల్ మొదలుకొని తుదకు పోలీసుభటునివఱకుఁగల ఇండియాలోని సకలమైన ఉద్యోగ వర్గమునుగూర్చి ఆయన చెప్పుచున్నాఁడని ఆయనవాదమం దంతటను సందర్భమును బట్టియును, ధోరణి (trend) ని బట్టియును స్పష్టముగు చున్నది.

ప్రథమమున 1897 వ సంవత్సరమందును, పిమ్మట 1908 వ సంవత్సరమందును రెండుపర్యాయములు 124 A. అను సెక్షన్ క్రింద తిలకు శిక్షింపఁబడినాఁడు. ఆయనయొక్క రెండవనేరముయొక్క కారాగృహ వాసము రెండుసంవత్సరముల క్రిందట మాత్రమే పూర్తిఅయినది. ఈవిషయమునుగూర్చి మరల తాను ప్రసంగింపతలఁచినట్లు బెల్గాములో నిచ్చిన యుపన్యాసముద్వారా బయల్పఱచెను. కాఁబట్టి ఆయన సత్ప్రవర్తకుఁడుగ నుండునిమిత్తము, నేను జూన్ నెల తే 22 ది గల యుత్తరువులో తెలిపిన ప్రకారము ఇద్దరు జామీనుదార్లతో ఆయన యొక ఖత్తు (bond) ను వ్రాయవలయునని నాకు తృప్తికరముగ తోఁచినందున, ఒకసంవత్సరమువఱకు ఆయన సత్ప్రవర్తకుఁడుగా నుండుటకుగాను, ఒక్కొకరు రు 10,000 ల చొప్పున ఇద్దరుజామీనుదార్లతో తాను రు 20,000 లకు పూచీఖత్తు ఈయవలయునని ఆజ్ఞాపించుచున్నాను.

(దస్కతు) జి. డబ్ల్యు. హాచ్,
డిస్ట్రిక్టుమేజస్ట్రేటు, పునహా.
12-8-1916.

పునహా మేజస్ట్రీటుగారి పై ఆర్డరుమీద శ్రీ తిలకుగారు 1916 సం॥ ఆగస్టు తే 23 దిని బొంబాయి హైకోర్టునకు ఆర్డరు రద్దుచేయవలెనని రివిజన్ పిటిషన్ యిచ్చిరి. తిలకుగారి తరపున బారిస్టర్లు జిన్నా, బాప్టిస్టా, ఏరుల్కర్ వారును, హైకోర్టు వకీల్లు బలేల్, మోదక్, కరన్దికార్లును వాదించిరి. 1916 సం॥ నవంబరు తే 8 దిని జిన్నాగారి వాదమును, తే 9 దిని గవర్నమెంటు అడ్వకేటు జనరల్‌గారి వాదమునువిని, గౌ॥ జస్టిస్ బాచిలర్, జస్టిస్ షా శ్రీ తిలకు నిర్దోషి అనితీర్పులుచెప్పి పునహా మేజస్ట్రీట్ ఆర్డరును రద్దుచేసిరి. వారి రెండుతీర్మానములు క్రిందతర్జుమా చేయబడియున్నవి. ఈతీర్మానములవల్ల శ్రీ తిలకుగారు స్వరాజ్య ఆందోళనము ఏ ఆటంకము లేక దేశమంతట వ్యాపింపచేయుట కవకాశము కలిగినది.

### బొంబాయి హైకోర్టుచొప్పున

## జస్టిస్ బ్యాచిలర్‌గారి తీర్పు.

పునహా డిస్ట్రిక్టు మేజస్ట్రేటు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్, శిక్షావిధానస్మృతి 108 వ సెక్షన్ క్రిందను దానితర్వాతి సెక్షన్లక్రిందను చేసిన యుత్తరవును విమర్శించ (revise) వలసినదిగా బాలగంగాధర తిలకుగారీదరఖాస్తు (లేక మనవి, application) చేసినారు. మనవిదారు (దరఖాస్తుదారు) ఒకసంవత్సరమువఱకు సత్ప్రవర్తకుఁడుగ నుండునట్లు రు 20,000 లకు పూచీఖత్తు ఈయవలయుననియు, ఒక్కొకరు రు 10,000ల చొప్పున యిద్దరుజామీనుదార్లు జామీను ఈయవలయుననియు మనవిదారును (జిల్లా మేజస్ట్రేటు) ఉత్తరవుచేసెను. ఇప్పుడు రికార్డులోనున్న మూడు ఉపన్యాసముల (speeches, వ్యాసములు) ద్వారా మనవిదారు రాజద్రోహ విషయములను వెదజల్లెనని జిల్లామేజస్ట్రేటు అభిప్రాయపడుటయే అట్టియుత్తరువునకు హేతువు. తిలకుగారీయుపన్యాసముల

ఇచ్చినట్లు ఒప్పందలయైనది. అది మహారాష్ట్రభాషలో నీయఁబడినవి; కాని వానిభాషాంతరీకరణము మాయెదుటనున్నది. ఆభాషాంతరీకరణము దాదాపుగా సరియైనదని యొప్పుకొనఁబడినది. మరాటీభాషలోనున్నదానికంటె సర్కారువారి భాషాంతరీకరణకర్త (or తర్జుమాచేసిన యతఁడు) అచ్చటచ్చట యెక్కువ కఠినపదముల నుపయోగించెనను తిలకుగారిపక్షమున చేయువాదములోని స్వల్పవిషయములవలన నెట్టిప్రయోజనము లేదని నాయభిప్రాయము. ఇండియన్ పినల్‌కోడ్ (శిక్షాస్మృతి)యొక్క 124 ఏ. అను సెక్షన్ప్రకారము శాస్త్రోక్తముగ నేర్పఱచబడిన గవర్నమెంటునెడల జనులు, అసూయాగ్రస్తులగునట్లు మనవిదారుచేసినాఁడనికాని, చేయుటకు ప్రయత్నించినాడనికాని ఋజువైనదా లేదా, అనునదియే యిందలి ముఖ్యసమస్య. ఇందులో శాస్త్రవిషయికసమస్య యేమియు లేదని నాయభిప్రాయము, కాని శాస్త్రజ్ఞుఁడైన జిల్లామేజస్ట్రేటు 22 బొంబాయి, 112 పుటలోని న్యాయమూర్తి స్ట్రాచీదొరగారి తీర్పును పొరబాటుగా "అసూయ" (disaffection) అనఁగా మంచియభిప్రాయము లేకుండుట యని యభిప్రాయపడిన లోపమును నేను కనిపెట్టవలసియున్నది. ఇట్టి పొరబాటగు తాత్పర్యము (misapprehension) శాస్త్రజ్ఞుఁడగు మేజస్ట్రేటుయొక్క తీర్పునకు ఆధారభూతమైనదో లేదో నేను చెప్పలేనుగాని, అది అట్లైయుండుట స్పష్టము. Dis అను (ఉపపదము, particle) దానితో సమాసము (లేక, సంధి) చేయఁబడి వాడుకలోనున్న సామాన్యపదములకు విరుద్ధముగా (disaffection,అసూయ)అనుపదమునకు అర్థము చేయఁబడెననుట స్పష్టమని నేనుతలంచెదను. ఉదాహరణము. Dislike (అయిష్టము.) అనునది like (యిష్టము) లేకుండుటమాత్రమే కాదు ; disgust (అసహ్యము) అనునది రుచిలేకుండుటను మాత్రమే సూచింపదు. న్యాయమూర్తి స్ట్రాచీదొరగారి నిర్వచనమును, సవరణచేసిన ఫుల్‌బెంచి (Full Bench) వలన నిది గుర్తించఁబడినది. (22 బొంబాయి, 151 పుటలోని

తీర్పును చూడనగును.) 124 A అను సెక్షనుకు వర్తించు 1 వ వ్యాఖ్యానము (Explanation). వ్యాఖ్యానమువలన నీయిబ్బంది నివారణమైనది. ఇట్టి నిర్వచనము మనయెదుట నున్నందున యీ కేసునకు సంబంధించిన శాస్త్రవిషయములో నెట్టి సందేహమును లేనట్లు నాయభిప్రాయము. తదుపరి డిఫెన్సు(తిలకు)గారి పక్షమున నొక్కి చెప్పఁబడిన రెండు ఆరంభ వాదములవిషయములో నొకమాట చెప్పవలయును. ఆయంశములలో సార మేమియు లేదని నేనభిప్రాయపడినందున వానినిగూర్చి యొక్క మాటనుమాత్రమే చెప్పెదను.

ప్రథమవాదప్రతివాదములు.

మొదటిది:—హిజ్ మేజస్టీ (రాజు) చక్రవర్తి (His Majesty King Emperor)గారికిని బ్రిటిషు (ఆంగ్లేయ) పార్లమెంటుకును విశ్వాసపూరితమగు రాజభక్తినిమాత్రమే యుపన్యాసకుఁడు (తిలకుగారు) కనఁబఱచినాఁడుగనుక ఆయన యుపన్యాసములలో పరవశత్వము, (Excitement) కాని, అసూయ (disaffection) కాని లేదని వాదించఁబడుచున్నది. బ్రిటిషుఇండియాలో శాస్త్రోక్తముగ స్థాపింపఁబడిన గవర్నమెంటునెడల అసూయను గలిగించుటయనెడు దోషారోపణకు నెంత విశ్వాసయుక్తమైనను హిజ్ మేజస్టి (చక్రవర్తి) గారికిని బ్రిటిషుపార్లమెంటునకును రాజభక్తి కనఁబఱచుట (మాత్రమే) సదుత్తరము (answer) కానేరదని 124 A అను సెక్షనుకు చదివినంతవఱకు చెప్పగలను. రెండవది.—ఇండియాలోని గవర్నమెంటును దూషించలేదనియును, సివిల్ సర్వీసు (Civil service) ను మాత్రమే వక్త (తిలకుగారు) దూషించెననియు అందువలన 124 A అను సెక్షనును భిన్నముగాలేదనుట శాస్త్రీయమనియు వాదింపఁబడుచున్నది. అది వాస్తవముగ నట్లుకాదనియే నాయభిప్రాయము. కాని, అది అట్లే అనుకొనినను, అది దోషారోపణకు (to the charge) సదుత్తరము కానేరదు; ఏలన, బ్రిటిషుఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటువారితరపు మనుష్యుల

ద్వారానే పనిచేయుచున్నది; మఱియు, దేశము స్వస్థస్థితిలో (times of peace) నున్నపుడు పరిపాలన నట్టి గవర్నమెంటుతరఫు మనుష్యులగు సివిల్ సర్వీసువారే చేయుచున్నారని యొప్పుకొనఁబడుచున్నది. కావున, నిచటవలె సివిల్ సర్వీసునంతయును మీరు విమర్శ (criticise) చేయు నెడల మీరు గవర్నమెంటు నెడల అసూయను కలిగించినను కలిగింప కున్నను, మీమాటయొక్క సహజమగు ఫలిత మట్టిదే అను వాస్తవ మునుగూర్చిన సమస్య (question of fact) అగును. వక్త తానభిమానించు (advocates) రాజకీయ సంబంధమగు మార్పులు హఠాత్తుగ (suddenly) కలుగుననికాని, కలముపోటు (stroke of pen) వలన కలుగుననికాని ఆశింపఁడు. మఱికొన్నిచోట్లలో నతఁ డట్టిభాష నుపయోగించుచున్నాఁడు.

"తమ గృహకృత్యములను తామే నెఱవేర్చుకొనునట్టి అధికారమును ప్రజల కిమ్ము. మన మీవిధమగు స్వరాజ్యము నడుగుచున్నాము. ఆంగ్లేయప్రభుత్వమును తొలఁగించవలెనని కాని, చక్రవర్తియొక్క పరిపాలనమును తొలఁగించి స్వదేశప్రభువులపరిపాలనము ఆస్థానమందు స్థాపింపవలయుననికాని యీస్వరాజ్యమున కర్థముకాదు." "వ్యాపారము, వర్తకము, మతము, సంఘమునకుసంబంధించిన కార్యములను మనము నెఱవేర్పవలయును. ఈకార్యముల నెఱవేర్చుటకుతగిన అధికారము పూర్తిగ మనచేతులలోనికివచ్చినగాని సమృద్ధి సమయములును, అదృష్టలాభైశ్వర్యోదయములను మనము చూచుట దుర్లభము. మఱియొకరినోటితో మనము నీరును త్రాగలేము; మనయంతట మనమే త్రాగవలయును. ఈయధికారమునుండి కొంతభాగమును మనము వశపఱచుకొనుట ప్రథమకర్తవ్యము. దానిలో స్వల్పభాగమును మాత్రమే తీసికొనిననుసరే; క్రొత్తరాజు అవసరము లేదు. దేనిని పోఁగొట్టుకొనుటవలన మన మనాథల (orphans) స్థితికి వచ్చుచున్నామో, అట్టి అధికారముయొక్క భాగమును మనము వశపఱచుకొనవలయును."

## తిలకుగారి సామాన్యాభిప్రాయములు.

(ఆయన) ఆశించునంశము లీపైని దెలిపిన వాక్యముల (passages) వలన స్పష్టమగుచున్నవి. రాజకీయతత్త్వము (poiltical theory) అను నీయాశలతో నాకేమియు సంబంధము లేదు; మఱియు నట్లే నేను సంతసించెదను, (లేక, తృప్తినొందెదను). నే నగపఱచిన యభిప్రాయము మనయెదుటనున్న విషయము (case) నకు సంబంధించినంతవఱకె అనియు, నీయుపన్యాసములు నేను విపులముగఁ జెప్పిన (Explained) అట్లెంత వఱకుఁ బోవునో అంతవఱకే యనియు తెలిసికొనవలయును. అన్నివిషయములలోను స్వరాజ్యము నభిమానించుట (advocate) యొప్పిదమని నేననుచుంటినని యూహింపతగదని తెల్పుచున్నాను. నేను స్వరాజ్య పదము నర్థము చేసికొన్నట్లే పలువురు (12 మంది) పలువిధములు నర్థము చేసికొనుచురుగాన, నిపుడావిషయములో నాయభిప్రాయము నిచ్చుటకు అవసరము లేనందున నే నట్టియభిప్రాయము నిచ్చుట లేదు. నే నిదివఱకే నిర్వచించినట్టి ప్రయోజనము (object) నిమిత్తమునకే నేను పైని చెప్పిన విమర్శనములు (remarks) వర్తించును. వక్త (తిలకుగారు or speaker) ఉపయోగించినభాష (or వాక్యములు)నుగూర్చియే మనమిపు డాలోచించవలయును; ఆయనకు అభిమానముకలిగినట్టియు నాయన ఆశించునట్టియు రాజకీయవిషయమగు మార్పులయొక్క పద్ధతులను ముఖ్యముగ గమనింపవలయును. ఆయనకు రాజద్రోహబుద్ధి లేనట్లు స్పష్టముగ చెప్పుచుండుటను మనము ఆలోచింపవలసియున్నది. అది అంత మాత్రముచేత దృఢముగ నిశ్చయింపఁదగినదికాదు(conclusive); కాని, తక్కిన సంగతులతో కూడ దీని నాలోచింపవలసియున్నది. ఏలన న్యాయబుద్ధి (candid) తో సకలోపన్యాసములను చదివినపిమ్మట ఆయన తనకు రాజద్రోహచింతన లేదనుట మిషయనికాని, కల్పితమనికాని నాకు తోఁచ లేదని నేను నిశ్చయముగ చెప్పుచున్నాను. అసూయ (disaffection) ను కలిగించు నుద్దేశ్యమున్నటుల బుజువుకావలయును; ప్రేమనుజూపును

తాను చేయుపనులవలన సహజముగను సామాన్యముగను (probable) కలుగు ఫలితములు తప్పక కలుగునని తాను ఉద్దేశించియే యుండు నను విధి (rule) చెప్పిన, వక్తవాడినభాష (వాక్యముల) నుండియే ఆయన యొక్క యుద్దేశ్యమును కనుఁగొనవలయును. ఈమూఁడుఉపన్యాసములలో నగపడు వాక్యములయొక్కరీతినిగూర్చియే సక్రమముగ వాద ప్రతివాదములలో (arguments) వ్యాఖ్యానములు చేయఁబడినవి. స్వయముగ ఆలోచించునెడల (in a personal sense) అనేకచోట్ల నీరీతిగా అసహ్యమైనవిగాను (offensive) అవమానకరమైనవిగాను నున్నవి. ఐనను, వానివలన వక్తయొక్క అనాగరికత (bad taste) కాని, దుష్టస్వభావము (bad temper) గాని స్పష్టపడునేగాని, శిక్షా శాస్త్రము (criminal law) ను నిరాకరించినందులకు శిక్షించుట కవి విశేషముగ పనికిరావని నాకు దోఁచుచున్నది. ప్రస్తుత మాతని యభిప్రాయము కాని,అభిమానముగాని నిషేధింపఁబడినదనువాదము అవసరము లేదు. ఉపయోగింపఁబడినభాష (వాక్యముల) లోఁగాని, వక్కాణింపఁబడిన పద్ధతులలోఁగాని వక్తను శిక్షాస్మృతి (Penal Code) క్రిందికి దెచ్చుట కేమైన నవకాశ మున్నదా యనుసంశమునుగూర్చియే మన మాలోచింపవలసియున్నది. వినువారి మనస్సులలో నీయుపన్యాసము లెట్లు ఫలితము (or అర్థము, effect) కలుగచేసిన వనుదానిననుసరించి ప్రత్యుత్తరముండును. సెక్షనులో నిర్వచింపఁబడినప్రకారము ఆఫలితము స్వాభావికముగను సామాన్యముగను (naturally and probably) దురభిప్రాయమును కలిగించునా? లేక శాస్త్రనిషిద్ధము కాని కొంత అనంగీకారమును గలిగించునా?

అసామాన్యఫలితమనూయకలిగించుటకాదు.

ఈ ప్రశ్నమునకు సదుత్తరమిచ్చుటయందు మనకు సహకారిగా మనమువినిన వాదప్రతివాదములు సహాయభూతములైనసంగతి వాస్తవములే కాని, తిలకుగారెవరిమొదుట విన్నవించిరో వారు అనఁగా అట్టి

జనులు లేకశ్రోతలు రాజకీయాంశములందు యాథస్థితిని జ్ఞప్తియం దుంచుకొనుచు వాదప్రతివాదములు మరవకుండ మొదటినుండి తుద వఱకు నెమ్మదిగను జాగ్రత్తగను ఈమూఁడుఉపన్యాసములను ఉచితరీతి గను, బూర్ణముగను జదివి, అందువలన సామాన్యముగ నెట్టిఫలిత మేర్పడునో తీర్మానించుటయే కోర్టువారి ముఖ్యోద్దేశమగుటచేత అట్టి వాదప్రతివాదము లవశ్యము కొన్ని (యుపన్యాస) భాగముల (passages) కు మాత్రమే సంబంధించినవని జ్ఞాపకముంచుకొనవలయును. ఒక మాఱుగాక పలుమార్లీయుపన్యాసములను జదివితిని; ప్రాసిక్యూషన్ వారు (or గవర్నమెంటువారు) యుక్తముగ నాక్షేపించినభాగముల టుండ, మొత్తముమీఁద అసూయ యనఁగా, వైషమ్యము లేక శత్రు త్వము కలుగజేయుట వాని (యుపన్యాసములు) స్వభావమైనట్టియును సామాన్యమైనట్టియును ఫలితము కానేరదనియును, కాని "ప్రజలు" అని అనుకొనునట్టుగాని పిలుచుకొనునట్టుగా వారిచేతులకు రాజకీయా ధికారములు నీయ (or బదలాయించ) నందులకు గవర్నమెంటువారియె డల అసూయను కలిగించు ఫలితముమాత్ర మున్నదనియు నామనసు నకు దృఢముగ దోఁచుచున్నది. సారాంశమేమన (conclusion is): అచ్చులో 34 పుటలుగల మూఁడుఉపన్యాసములయొక్క మొత్తపు భావమునుగూర్చిమాత్రమే నేనాశ్రయించెదను (I can only appeal). ఐనను, ఈతీర్పునందు వానిని విపులముగ నేను వ్రాయజాలను. నాతీర్పు వీయొక్క ప్రధానమగుభాగము (లేకవాక్యము) మీఁద నాధారపడి యుండకున్నను, వాని సామాన్యఫలితముమీఁదనే నాధారపడియుండి నను, నేను కదాచిత్తుగా నాప్రధానభాగమును సూచించెదను. తనశ్రోత లకు (audience) తా నభిమానపురస్సరమున జెప్పిన "స్వరాజ్యము" అనుపదముయొక్క అర్థమెద్దియో తెలుపుటకుగాను నేను ముఖ్యమైన భాగములు (వాక్యముల) నాలోచించెదను. ఇట్లాయన చెప్పెను; "కాని, ఇతరులచేఁ జేయఁబడిన యేర్పాటు ఎంత సమంజసముగ

నున్నను ఇట్టి యేర్పాటులను జేయు అధికారము నపేక్షించునతఁడు వీనినెల్లప్పు డంగీకరించుట తటస్థింపదు. ఇదియే స్వరాజ్యసూత్రము. మీకలెక్టరును మీరెన్నుకొనుఅధికారము మాకుండెనేని అతఁడు (అనఁగా మీరెన్నుకొనినఅతఁడు) ఇప్పటి కలెక్టరుకంటె నెక్కువపనిచేయునని అనుకొనతగదు. ఒకవేళ, అతఁడంతపని చేయకపోవచ్చును; మీఁదు మిక్కిలి అతఁడు తక్కువగాకూడ చేయవచ్చును. ఇందులకు నేనొప్పుకొనెదను. సంగ్రహముగ చెప్పునదేమనఁగా, వ్యవహారములను చక్కఁబెట్టుకొను అధికారము మనచేతులలో నుండవలయునని కోరుటయే స్వరాజ్యమును కాంక్షించుట. మీరు ఇప్పటినుండి ప్రయత్నము చేసినను అయిదుసంవత్సరములలో 25 సంవత్సరములలో ఈఫలితమును మీరు పొందజాలరు. ”

సివిల్‌సర్వీసుఎడల ద్వేషమును కలుగఁజేయ నవసరము లేదనికాని ఎవరితరఫున నమ్మకముగ సివిల్‌సర్వీసు పనిచేయుచున్నదో అట్టి (శాస్త్రోక్తవిధానమున) ఏర్పడిన గవర్నమెంటుఎడల ద్వేషమును కలిగింప నవసరము లేదనికాని కనఁబఱచుట కీభాగము ముఖ్యమైనది. సామాన్యస్థితికి (moderation) తగినభాష (వాక్యముల) నుపయోగించుటవలనను, గవర్నమెంటువారియెడల ద్వేషమును స్వభావముగఁ గలుగనీయనిపదముల నుపయోగించుటవలనను, మీ రద్దానిని తొలగించ (avoid) వచ్చును. ఇది వాస్తవముగు చిన్నప్రశ్నయని నాకు తోఁచుచున్నది. ఉపన్యాసములను తానంతట వానినే యాలోచించునెడల వానిని పూర్ణముగఁ జదువవలయును. గవర్నమెంటువారిపక్షమునగాని మనవిదారుపక్షమునగాని యేదియును తీసికొనిరాకయును, అచ్చటచ్చట నుపయోగించిన మాటలకంటెను భాగములకంటెను మొత్తముయొక్క సామాన్యఫలితమందే దృష్టినుంచి వానిని సక్రమముగ నన్వయించవలయును. అట్టి సక్రమాన్వయప్రకార మీయుపన్యాసములు 124 A అను సెక్షనుకు విరోధములుగ నున్నవా లేదా, అనునదియే ముఖ్యప్రశ్నము.

అభిమానము—తానంతట అది శాస్త్రాతిక్రమణము కాదు.

ప్రథమమున ఇపుడు ఉపన్యాసకునియొక్క యాశయమును (aim) గూర్చి ఆలోచించు నెడల, ఆయన "స్వరాజ్య"మని వర్ణించిన (describe) దానినిగూర్చి వాదించుటలో ఇండియనుల (హిందూ దేశపు జనుల) కు రాజకీయాధికారములో ఎక్కువగను క్రమముగ నెక్కువయగు నట్టియును భాగము లభించుటయును; ఇండియాలోని జనులయొక్క గాని జాతులయొక్కగాని అధికారములోనికి దేశముయొక్క పరిపాలనమును లోఁబడఁజేయుటయందు ఆయన యుద్దేశము. అట్లభిమానించుట దానంతట అది శాస్త్రమునకు విరుద్ధము కాదని నాయభిప్రాయము. ఆవిషయములో అడ్వకేటుజనరల్ (Advocate General) ఒకమాటనైనను జెప్పలేదు. శాస్త్రవిరుద్ధ మనునది దానియం దేమైన నున్నదాయని, తెలుసుకొనుటయే న్యాయాధిపతి (Judge) నైన నాపనియై యున్నది. నేను చెప్పిన పర్యవసానము లభించుటకుగాను (ఆయన) అభిమానించిన పద్ధతులను పరీక్షించునిమిత్తము వక్తయొక్క సామాన్య దృక్పథము (general view)ను తెల్పుటకై యీక్రింది 5 (Exhibits) భాగములను తెలుపుచున్నాను.

"ఆంగ్లేయప్రజల ప్రభుత్వముక్రిందనేఆంగ్లేయజాతియొక్కతనిఖీ క్రిందనే ఆంగ్లేయులసహాయముతోడనే వారి సానుభూతి (sympathy) ద్వారాగాని, వారి ఆశ (anxious) తోకూడిన జాగ్రత్తద్వారాగాని, వారికిఁగల గొప్పభావములద్వారాగాని, మనము మన మేలును సంపాదించుకొనవలయుననుట నిర్వివాదాంశము. ఈవిధముగా ఈపరిపాలనములో మంచి నిర్వాహకత్వమును కోరవలయును. అని ప్రస్తుతశాసనమునందు సవరణచేయువలసియుండును. అది పార్లమెంటుద్వారా జరుగును. మన మిత్రులద్వారా కోరము. ఈకోరిక నెఱవేఱుటకు మనము శ్రమించి (పరాసుల) దేశమునకు అర్జీలను పంపుకొన నక్కఱ లేదు. అక్కడ మిత్రమండలియుండునుగాన మనము వారిని ప్రార్థింపనవసరము లేదు. ఆంగ్లే

యులకును ఆంగ్లేయపార్లమెంటునకును మనవిచేసికొనవలయును. ఐరోపాఖండములో ప్రస్తుతము జరుగుచున్న సంగ్రామమువలన బ్రిటిషుసామ్రాజ్యములో నున్న అన్నిభాగములు నేకీభవించిననేగాని తాను పొందవలసిన బలమును సామ్రాజ్యము పొందనేరదని ఆలోచన ప్రారంభమైనది. వారివలసప్రదేశములును దొరల నివాసప్రదేశములును అగు ఆస్ట్రేలియా, కనడా, న్యూజిలండు దేశస్థుల సహాయాపేక్షయందు తామున్నామను జ్ఞానము వారి కిప్పు డుదయించినట్లుగా సంభవించినది. ఈజ్ఞానమునుండి మీరు లాభమును పొందఁదలఁచినయెడల కొన్నిహక్కులను సంపాదించుటకు మీకుకూడ సమయము కలిగియున్నది. కత్తి నుపయోగించి యీహక్కులను పొందవలసినదని ఎవరును మీతో చెప్పరు. ఈదినమున ప్రజలమనస్సు (nation's mind) మార్పును పొందినది. ఇంగ్లండునకు హిందూదేశము కొంత సాహాయ్యము చేయఁగలదు. హిందూదేశము సుఖముగా నున్నయెడల ఇంగ్లండు నొకవిధమగు ఖ్యాతియు బలమును ఘనతనుకూడ పొందును. ఈజ్ఞానమున కింగ్లాండు మేల్కొంచినది; యుద్ధము ముగిసినపిమ్మట తుదకు కొన్నివిషయములలోనైనను పరిపాలనము మాఱవలసియుండును. ఈహక్కులను సంపాదించుటకు అశాస్త్రీయకార్యములను చేయవలసినదిగా మీకు నేను చెప్పను. శాస్త్రీయమగు మార్గమున్నది."

శాస్త్రీయమగు ఆక్షేపణలులేవు.

నేను పైనియుదహరించిన (యుపన్యాస) భాగములలో వక్తయొక్క ముసాయిదా (draft) సామాన్యముగ నుదాహరణపూర్వమై యున్నది. (Exemplification). దానిలో అశాస్త్రీయమేమియు లేదు సరికదా, శాస్త్రీయమైనట్టియు కట్టుబాట్లుకలిగినట్టియు (constitutional) పద్ధతులు నవలంబించుట మూలమున రాజకీయసంబంధమగు మార్పులు లభించవలయు ననువాదన సుస్పష్టముగ నున్నది. కావున, నుపయోగింపఁబడిన విశేషవాదప్రతివాదములనుచర్చించుచు ఈతీర్పును

పెంచ నవసరము లేదు. ఈవాదప్రతివాదము లన్నియును శాస్త్రీయములగు నాక్షేపణములు లేకున్న వను నాయభిప్రాయమును దెలిపినచాలును. అట్టి వాదప్రతివాదములలో నీక్రిందిది యున్నది; "ఎట్టి పితూరియు లేకుండ స్వదేశసంస్థానమును ఇండియా దేశపు పరిపాలకులు పాలించుచున్నారు. బ్రిటిషుఇండియాలో బ్రిటిషుఉద్యోగస్థులకు నత్యధికముగా జీతము లియ్యబడుచున్నవి. ఇండియులును చర్చించుటకుమాత్రము స్వతంత్రము కలిగియున్నను, బొక్కసముపైనగాని, ధోరణినిగూర్చిగాని తగిన యధికారము కలిగియుండ లేదు. ప్రస్తుతపు ఉద్యోగస్థులు వాస్తవముగ ఇతరజాతివారు సమర్థులును పాటుపడువారైనప్పటికి ప్రజల అవసరములను వారు సరిగా కనుఁగొనఁజాలరు."

ఇదంతయు రాజకీయసంబంధములో తెలివితక్కువగా నుండవచ్చును. అట్టిదానితో నాకు పని లేదని మరల చెప్పుచున్నాను; కాని, అది 124 A అను సెక్షనుకు వైరుధ్యము లేని సక్రమమగు రాజకీయ విమర్శయని నాయభిప్రాయము. ఐనను, ఈమూఁడుపన్యాసముల సముదాయము నీవాదప్రతివాదము లగుచున్నవి; మఱియు, నేర (selected) బడిన యేభాగముకంటెను విశేషించి వాని సామాన్యధోరణి (tenor) పర్యవసానములవలన విచారింపవలయుననియే మునివిదారు యొక్క యాశయము (intent); మునివిదారుపక్షమున న్యాయముగ చెప్పటయందు ఈభాగములన్నియు దూషణలు కావనికూడ చెప్పవలసియున్నది. తే 31-5-16 దిగల యుపన్యాసములో నొకచోట ఆయనయిట్లు చెప్పుచున్నాఁడు.

"గవర్నమెంటునుగూర్చియు ఈ దేశములో గవర్నమెంటువారు చేసిన లౌకికాభివద్ధిని (material improvements) గూర్చియుచెప్పుచో ఈపనులు చేయ లేదని నేనుచెప్పను. చేసినపనులు చాలవని నేను చెప్పచున్నాను. కొన్నిపనులుచేసినారు; చక్కఁగాకూడ చేసినారు. పూర్వపు ప్రభుత్వమువారు చేసినపనులకంటె బ్రిటిషుగవర్నమెంటువారు ఎక్కు

వగను బాగుగను చేసియున్నారు. ఇది వారికి గౌరవమేను. అది (బ్రిటిషు గవర్నమెంటు) చేయునిపనులను చేయవలసినదిగా మనము చెప్పవలసియున్నది. ''

ఇది యింతటితో ఆగినయెడల గవర్నమెంటువారికి కేసు (case) ఏమియును లేకుండెడిదియేకాని, మీరు అదృష్టవశముచే ఈవిషయముల నింతటితో నాపకయున్నారు. రెండుమూఁడుభాగములు అవి యున్న విధముగా సమర్థించుట (justification) కవకాశము లేకుండుట నిస్సంశయము; తిలకుగారి శాస్త్రజ్ఞుఁడగు న్యాయవాదికూడ సమర్థించుటకు తగినంతగాని జయప్రదముగగాని ప్రయత్నించుటలేదు. ఆభాగము లష్లే యొంటరిగ నుండినయెడలగాని, లేక, అవి యుపన్యాసకుని (వక్తయొక్క) సామాన్యమనోగతమును వెలువరించినట్లు నేనెంచిన యెడల గాని, నేను మేజస్ట్రేటుయొక్క యుత్తరువును ఖాయ పఱచవలసియుండునదియే. ఈతీర్పులో నేరమగు (offensive) భాగములను మరల చర్చించి వాని కెక్కుడు ప్రాశస్త్యమును కలుగచేయుటకు నాకుద్దేశము లేదు. మొదటి యుపన్యాసములో నున్నట్టియును ఇండియనులను బానిసలుగగాని దాసులుగ (Servitude) గాని యుండుటనుగూర్చి తెలిపెడు నొకభాగ మున్నదని చెప్పినయెడల నద్దానిని తగినట్లు గుర్తింపనగును. రెండవయుపన్యాసమందు, "దానిలాభమునకై ముఖ్యముగ చూచుకొను పరాయి ప్రభుత్వము'' అని గవర్నమెంటును వర్ణించెడి మఱియొకభాగమున్నది. శాస్త్రజ్ఞుఁడగు జిల్లా మేజస్ట్రేటుయొక్క యుత్తరువును బలపఱచగల కారణము లున్నవని యీభాగములనుబట్టిమాత్రమే నిర్ణయింపవచ్చునా యనునదియును, ఈ కేసులో నిజముగా కష్టమని నా అభిప్రాయము. ఈ కష్టమైన ప్రశ్నవిషయములో నేను సాధ్యమైనంతవఱకు బాగుఁగా ఆలోచించియును, ఉపన్యాసములయొక్క మొత్తమగు ధోరణినిబట్టియును మనవిదారుపక్షమునసే నిర్ధరించవలయునని నాఅభిప్రాయము. నేనట్టి మాటకు ఈభాగములు (passages) సమర్థనీయము లని నాతాత్పర్యము

కాదుగాని, అవి ప్రస్తుతవాదసందర్భమునుబట్టి వానిలో నగపడు నాక్షేపణలు కొంతవఱకు తగ్గుచున్నవి; మఱియు నుపన్యాసముల మొత్తము మీఁదనుండు సామాన్యఫలితమును అవి నిర్ణయించునని నే నెంచెదను. 124 A అను సెక్షనుయొక్క 2-వ, 3-వ వ్యాఖ్యానములలో నిర్వచింపఁబడిన యుచితవిమర్శనముయొక్క హద్దులను మించినట్లు మొత్తము మీఁదనుండు ఫలితమువలన తేలలేదని నాయభిప్రాయము. ఈకారణములవలన నీయాజ్ఞను స్థిరపఱచి విమర్శింపఁబడుచున్నయుత్తరువును రద్దుపఱచవలయునని నాఅభిప్రాయము.

---

## జస్టిస్ షా గారి తీర్పు

పునహా జిల్లామేజస్ట్రీటుచేసిన యుత్తరువును విమర్శించుట కీఅర్జీ దాఖలుఅయినది. మనవిదారుపైన క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ (శిక్షావిధానశాస్త్రము) యొక్క 108-వ సెక్షను ప్రకారము జరుపఁబడిన చర్య విషయములో నీయుత్తరువు చేయఁబడినది. మనవిదారొక సంవత్సరకాలమువఱకు సత్ప్రవర్తకుఁడుగ నుండుటకు మనవిదారు (స్వయముగ) రు 20,000 లకు పూచీఖత్తు నీయవలయు ననియు, నొక్కొక్కరు రు 10,000 చొప్పున నిద్దరు జామీనుదారులు జామీనీయవలయుననియు అది యాజ్ఞాపించుచున్నది.

మనవిదారుపై క్రిమినల్ప్రొసీజర్ కోడ్ 108-వ సెక్షను ప్రకారమువచ్చిన సమాచార (information) మేమన, బెల్గాము (Belgaum) లో తే 1-5-16 ది యందు అహమ్మదునగరునందు తే 31-5-16, ది 1-6-16 దులయందును "స్వరాజ్యము" లేక, "హోము రూలు" అనువిషయమును గూర్చి ఇండియాదేశశిక్షాస్మృతి (Indian Peual code) యొక్క 124 A అను సెక్షన్ క్రింద శిక్షార్హమగు మూఁడు ఉపన్యాసముల నిచ్చుట మూలముగ రాజద్రోహ విషయములను వాగూపముగ బ్రచురించి వెదజల్లినాఁడనియే.

దేనియొక్క ప్రాచుర్యము ఇండియాదేశ శిక్షాస్మృతియొక్క 124 A అను సెక్షన్ ప్రకారము శిక్షార్హమగునో అట్టి సంగతులీయుపన్యాసములం దిమిడియున్నవను దృఢమగు నభిప్రాయమును జిల్లామేజస్ట్రేటు కలిగి ఆయభిప్రాయానుకూలముగ ఇపుడాలోచింపఁబడు నుత్తరవును చేసినాఁడు.

ఆరోపింపఁబడిన లేక మొఱపెట్టఁబడిన (Complained of) విషయముయొక్క ప్రాచుర్యము ఇండియాదేశ శిక్షాస్మృతియొక్క 124 A సెక్షను క్రింద శిక్షార్హమగునా అను ముఖ్యప్రశ్నమునే యీదరఖాస్తు మీఁదతీర్మానించవలసియున్నది. "స్వరాజ్యము" లేక "హోమురూలు" అను ఉపన్యాసములలోని ప్రధానాంశమునకు గవర్నమెంటు వారి పక్షమున నాక్షేపింపఁబడ లేదనియును, ఈయుపన్యాసములలో స్వరాజ్యమనుశబ్దము నిందార్హమగు నర్థము (Offensine sense) లో నుపయోగింపఁబడినట్లు కూడ సూచింపఁబడలేదనియును, మున్ముందుగ చెప్పవలసియున్నది. బ్రిటిషుఇండియాలో శాస్త్రీయముగ నేర్పఱపఁబడిన గవర్నమెంటునకు గౌరవరహితమగునట్టియు, అపవిత్రమగునట్టియు, ఉద్దేశములను (dishonest and corrupt motives) ఉపన్యాసములలో పలుచోట్లలో నారోపణచేసిన ఆక్షేపముల (remarks) వలన మనవిదారు రాజద్రోహ సంగతులను వెదజల్లినాఁడని క్రిందికోర్టు న్యాయసభలో శాస్త్రజ్ఞుఁడగు అడ్వకేటు జనరల్ వాదించినాఁడు.

124 A అనుసెక్షన్‌లోనున్న "అసూయ (disaffection) అను శబ్దమునకు "ప్రేమలేకుండుటయే" అని క్రిందికోర్టువారి యభిప్రాయము సరియైనది కాదని వాదింపఁ బడుచున్నది. న్యాయమూర్తి స్ట్రాచీ (Justice Strachey) గారి మాటలను శాస్త్రజ్ఞుఁడగు జిల్లామేజస్ట్రేటు ప్రమాణముగ లేక, కారికగా తీసుకొన్నట్లు తోఁచుచున్నది. రాణీచక్రవర్తిని × బాలగంగాధరతిలకు; ఇండియన్ లా రిపోర్టు, 22 బొంబాయి 151, అను తీర్పులో ప్రధానన్యాయమూర్తి ఫరాన్ (Farran, C. J.)

గారును, న్యాయమూర్తి క్యాండీ (Candy. J) గారును, న్యాయమూర్తి స్ట్రాచీ (Strachey. J.) గారునుగల ఫుల్ బెంచి (Full bench) వారు చేసినసూచనల (Observations) వలనను, రాణి చక్రవర్తిని × నారాయణ (ఇం. లా. రి. 22 బొంబాయి 152) అను తీర్పులవలనను, "అసూయ (disaffection)" అనుదానికి "ప్రేమలేకుండుట" అని అర్థముకాదని స్పష్టమగుచున్నది. ఈ కేసులు తీర్మానింపఁబడినపుడములులోనున్న సెక్షన్ 1898 వ సంవత్సరములో రద్దుచేయఁబడి దానిస్థానమందిప్పటి 124 A అనుసెక్షన్ ఏర్పఱచఁబడినది. సెక్షనుయొక్క అర్థసంబంధములో "అసూయ" (disaffection) అనునది "ప్రేమలేకుండుట" అని అర్థము ఈయఁజాలదని సెక్షన్ యొక్క ప్రథమ వ్యాఖ్యానమువలన తెలియు చున్నది. చక్రవర్తి × భాస్కర (రి బొంబాయిలారిపోర్టు 432) అను తీర్పులో న్యాయమూర్తి బ్యాటి (Batty J.) గారు కనఁబఱచిన విషయములో నే నాయనతో నేకీభవించుచున్నాను. శాస్త్రజ్ఞుఁడగు అడ్వకేటుజనరల్ (Advocate General) మఱొక విధముగ వాదించుటలేదు. ఈ కేసులో ఈయంశమేమియు ప్రయోజనకారి కాదు.

"బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పఱచఁబడిన గవర్నమెంటు" అనువాక్యముయొక్క అర్థమునుగురించి కొంత వాద ప్రతివాదము జరిగినది. ఈ విషయమై తిలకుయొక్క కేసులోని న్యాయమూర్తి స్ట్రాచీగారును భాస్కరుని కేసులోని న్యాయమూర్తి బ్యాటీగారును కనఁబఱచినవిషయములు పైన నుదహరింపఁబడినవి.

శాస్త్రోక్తముగ నేర్పఱచఁబడిన గవర్నమెంటు ఇప్పుడు 1915 సం॥ రపు ఇండియాగవర్నమెంటు శాసనముగ (V and VI George V, Chapter 61) క్రోడీకరింపఁబడినట్టి (cosolidated) ఇండియా గవర్నమెంటుతో సంబంధించిన చట్టములవలన నేర్పఱచఁబడిన పలువిధములగు గవర్నమెంటులని యీవాక్యముయొక్క అర్థమైనట్లు ఈ కేసునిమిత్త

ము చెప్పిన చాలు నని తోఁచుచున్నది. మఱియు బ్రిటిషు ఇండియా లోని యేభాగమందైనను నిర్వాహకప్రభుత్వముగ పరిపాలించుటకు శాస్త్రోక్తముగు నధికారముగల యేమనుష్యు నైనను లేక యేమనుష్యుల నైనను ఈవాక్యము తెలుపుచున్నది ఉపన్యాసములలో "అధికారవర్గము" (bureaucracy) అని సామాన్యముగ వర్ణింపఁబడిన ఇండియన్ సివిల్ సర్వీసు మీఁద చేయఁబడిన విమర్శన మంతయు ఏసందర్భమునను "బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు" పైన విమర్శనముగ భావింపఁదగదని గౌరవనీయులగు జిన్నా (Jinnah) గారు వాదించినారు. ఈ వాదనను నేనంగీకరింపఁజాలను, సెక్షనుయొక్క అర్థముప్రకారము బ్రిటిషుఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు క్రిందనుండు పలువిధములగు ఉద్యోగములు (services) గవర్నమెంటుయొక్క భాగము కాకపోవచ్చును; మఱియు, ఏసర్వీసు మీఁదనైనను చేయఁబడిన విమర్శనము (Criticism) బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు యొక్క విమర్శన మంతగా కాకుండవచ్చును కాని, 124 A అనుసెక్షను నిషేధించ నుద్దేశించిన మనోవికారములు (feelings) పలువిధమార్గములద్వారా గవర్నమెంటునకు విరుద్ధముగ పరవశము చేయఁబడవచ్చును. దాని ఆగవర్నమెంటుయొక్క యేసర్వీసు (service) నైనను అక్రమముగ ఖండించుటచేత గవర్నమెంటునెడల అట్టిమనోవికారములను (feelings) పరవశమగునట్లు చేయుటసాధ్యమగుననినాకుతోఁచుచున్నది. "బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగనేర్పడిన గవర్నమెంటు" ఎడల అసహ్యము (hatred) నిరాదరణము (contempt) లేక అనూయ (disaffection) అను మనోవికారములు నుద్రేకింపఁజేయుటకు ఏముఖ్యమగు విషయములోనైనను యేసర్వీసుయొక్క ఖండనమైనను చాలునా అనునది విమర్శయొక్క స్వభావమును బట్టియును పరిపాలనలో సర్వీసు (service) యొక్క ప్రాధాన్యతను లేకపదవిని (position) బట్టియును, ఆవిషయమునకు సంబంధించిన

తక్కినస్థితిగతులనుబట్టియు నుండును. అది దాని సంగతిసందర్భములను బట్టి ప్రతియంశములోను (లేక, ప్రతికేసులోను) నిర్ధరింపఁబడవలసిన వాస్తవసంబంధ మగుప్రశ్న (question of fact) అయి యుండును; కాని, శాస్త్రసంబంధమగు విషయముగ "బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు" క్రింది యొకముఖ్యమగుసర్వీసుయొక్క ఖండనము 124 A అను సెక్షనువలన నిషేధింపఁబడినట్టి గవర్నమెంటు నెడల ఏవిధమగు మనోవికారముల నుద్దేశించుటకు యెప్పటికిని చాలద నుటకు వీలులేదు.

ఈయుపన్యాసములలో ప్రచురపఱచఁబడిన అంశములు 124 A అను సెక్షనుప్రకారము శిక్షార్హములగునా యను విషయము ఆలోచించెదను. హిజ్ మేజస్టీ (His Majesty) గారియెడలగాని, బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు నెడలగాని యుపన్యాసకుఁడు (or వక్త) అసహ్యమునుగాని నిరాదరణ (contempt) నుగాని కలుగచేయకూడదనియు, లేక,కలుగచేయుటకు ప్రయత్నించకూడదనియు, లేక, అసూయోద్రేకమును కలుగచేయఁగూడదనియు, లేక, కలుగచేయుటకుఁ బ్రయత్నింపకూడదనియు స్పష్టమైనది. సెక్షనుయొక్క 2-వ, 3-వ వ్యాఖ్యానముల (Explanations) క్రిందవచ్చు టీక (or వ్యాఖ్యానము, commentary) విషయములో సైతము ఈముఖ్యమగు పద్ధతిని (షరతును, condition) గమనింపవలయును. ఉపన్యాసములందంతట నుపన్యాసకుఁడు హిజ్ మేజస్టీ (చక్రవర్తి) గారియెడల రాజభక్తినే వెలిబుచ్చె ననువిషయమై యీకేసులో జిన్నా (Jinnah) గారు గట్టిగ నొక్కిచెప్పిరి. కాని, యింతమాత్రమున అతనికిఁ బ్రయోజన ముండదు. హిజ్ మేజస్టి (చక్రవర్తి) గారియెడల నతఁ డసూయోద్రేకమును కలిగించినట్లతనిపై దోషారోపణము కాలేదు. బ్రిటిషుఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు నెడల అసహ్యమును (hatred) గాని, లేక, నిరాదరణమునుగాని కలిగించుటకైనను, లేక, అసూయోద్రేక

మును కలిగించుటకైనను, ఆయన ప్రయత్నించినాఁడని గవర్నమెంటు వారి కేసుఅయినందున, ఆయన హిజ్ మేజస్టీ (చక్రవర్తి)గారియెడల రాజభక్తి నగపఱచెననుట యీదోషారోపమునకు తగు ప్రత్యుత్తరము కాదు.

ఉపన్యాసకుని యుద్దేశము

విచారణలో నున్నయుపన్యాసములు మరాటీ (భాష) లో వ్రాయఁబడి కడుదీర్ఘముగ నున్నవి. ఈయుపన్యాసముల నిచ్చుటలో నుపన్యాసకుని యుద్దేశ మెద్దియో నిశ్చయించుట అవసరము. ముఖ్యముగ నుపయోగింపఁబడినభాష (or వాక్యముల) నుండి ఉద్దేశమును గ్రహింపవలయును; మఱియు నుపన్యాసములను చదివినపిమ్మట నీయుపన్యాస శ్రోతల (to whom they were addressed) మనస్సులందు సహేతుకముగను, స్వభావముగను, సామాన్యముగను (probable) ఆయుపన్యాసముల ఫలితము గవర్నమెంటునెడల అసహ్యము, నిరాదరణము, లేక, అన్యాయాసంబంధమగు మనోవికారములు (feelings) కలుగుటయే యైనచో మనవిదారుని కేసు ఓడిపోవలయును (must fail).

ఉపన్యాసముల ఫలితము

కాఁబట్టి, ఎవరినిమిత్తమై ఆయుపన్యాసము లీయఁబడినవో వారిమనస్సులందు అన్నియుపన్యాసములయొక్క సకారణమగునట్టియు, స్వభావసిద్ధమైనట్టియు, సామాన్యమైనట్టియు (probable) ఫలితమును నిర్ణయింపవలయు ననునదియే (ముఖ్య) సమస్య. నాయంతట నే నీయుపన్యాసములను జదివినాను. ఇరుపక్షముల వానినిగూర్చి వాదప్రతివాదములు జరిగి వానిలో కొన్నిభాగములు (or వాక్యములు, passages) ఉదాహరింపఁబడినవి (referred to).ఆభాగములనుగూర్చి ప్రత్యేకముగా (or విరళముగ, in detail) యోచించుట అవసరమని తోఁచదు. ఆయుపన్యాసములను మొత్తముగను "న్యాయమైనట్టియునుఁ స్వతంత్రమైనట్టియును, విశాలమైనట్టియును (in a fair, free and

literal spirit) "బుద్ధితోడను" చదువవలయును. వానిని ఆలోచించుట లో" ఇచట నొక ఆక్షేపణీయమగు వాక్యమునుగాని, అచట కఠినమగు పదమునుగాని" ఎవరైనను "అనుమానించకూడదు." "స్వేచ్ఛతోఁగూడిన బుద్ధితో" వానిని ఆలోచింపవలయునుగాని, "హ్రస్వమగు (or సూక్ష్మమగు, narrow) విమర్శనాదృష్టితో" ఆలోచింపఁగూడదు. మనపిదారునెడల "స్వతంత్రమైనట్టియును, ధైర్యముతోఁగూడినట్టి, మానుషమైనట్టియు (manly) బుద్ధితో" విషయమును ఆలోచింపవలయును. (ఆర్. బరన్సు, 16 కేసు, పుట 362 ను చూడనగును.) ప్రస్తుతపు కేసులో, ఇండియాకు హోమ్ రూలు పక్షమున ప్రజాభిప్రాయమునుకలుగఁజేయుట యును, శ్రోతలు (hearers) హోమ్‌రూలులీగులో చేరునట్లు ప్రోత్సాహపఱచుటయును మనపిదారుయొక్క ముఖ్యాశయ మైనట్లు ఉపన్యాసములలోని పలుభాగముల (or వాక్యముల, passages) వలన తెల్లమగుచున్నది. ఆయన యుద్దేశములు నెఱవేఱుటకై నిష్కపటమగు శాస్త్రీయపద్ధతులకంటె భిన్నమగుపద్ధతుల నేమియు ఆయన ఆమోదించలేదనికూడ నుపన్యాసములవలన స్పష్టమగుచున్నది. ఇట్టిసందర్భములలో, ఉపన్యాసములయొక్క సామాన్యఫలితము (general effect) నిర్ణయించుటలో ఆక్షేపణకరమగు భాగముల కెక్కుడు ప్రాముఖ్యత నీయకుండ జాగ్రత్త తీసికొనవలయునని స్పష్ట మగుచున్నది. నిస్సందేహముగ, మూఁడు ఉపన్యాసములయందు ఆక్షేపణీయమగు భాగములు (or వాక్యములు, passages) ఉన్నవి. ముఖ్యముగ, బానిసత్వపుస్థితి (condition of slavery) కిని ప్రభుత్వముయొక్క విదేశస్వభావము (alien character) నకును, సంబంధించిన యూహలు (inferences) అసమంజసమును అక్రమమునై యున్నవి. ఐనను, శ్రోతలయొక్క మనస్సులందు కలుగు అభిప్రాయ మట్లుండునుగాన, ఉపన్యాసములమొత్తముమీఁద కలుగు ఫలితమునే ఆలోచింపవలయునను వాదముయొక్క లాభమునకు మనపిదారుడు అర్హుఁడై యున్నాఁడని నాకుతోఁచుచున్నది. ఈయుప

న్యాసముల ఫలితములను పలువురు పలువిధములుగ వారివారి మనస్సునకుఁ దోఁచినట్లు ఎంచవచ్చును (might estimate). ఇట్టి సందర్భములలో ఒకవైపు మనవిదారుపక్షమునను, ఒకవైపు గవర్నమెంటువారి పక్షమునను ఉపన్యాసముల భాగములను (or వాక్యములను, passages) నాశక్తిలోపము లేకుండ యోచించితిని. ఉపన్యాసములను మొత్తముగ నాలోచించునెడల అవి యెవరినిమిత్తమియ్యఁబడినవో వారి మనస్సులలో "బ్రిటిషు ఇండియాలో శాస్త్రోక్తముగ నేర్పడిన గవర్నమెంటు" నెడల అసహ్యముకాని, నిరాదరణకాని, అసూయకాని కలుగఁజేయు ఫలితము ఆయుపన్యాసములందు స్వాభావికముగను, సామాన్యముగను (probable) ఉన్నదని నేను చెప్పఁజాలకున్నాను. కాఁబట్టి, మనవిదారువలన వెదజల్లబడిన విషయములు (matter) శిక్షావిధానశాస్త్రము (Criminal Procedure Code) యొక్క 108 (a) అను సెక్షను ప్రకారము రాజద్రోహ మగునని నమ్ముటకు నేను ఉద్యుక్తుఁడనుకాను. వానంతట అవిమాత్రమే నిలిచినయెడల భాగములు మాత్రము నిందితునకు (accused) వ్యతిరేకముగ నెంచబడుటకు యుక్తముగ నున్నదను సంగతిని నేను కనిపెట్టకపోలేదు; కాని, వ్యాపకముగ నీయఁబడిన దీర్ఘోపన్యాసములలో నట్టివానిఫలితము (effect) వేఱగుఅంశము. మనవిదారుని శిక్షార్హమగు నుద్దేశము (criminal intent) స్థిరపడనికారణమున ఆవిషయముల (or ఉపన్యాసములు, matters) ప్రాచుర్యము 124 A అను సెక్షను ప్రకారము శిక్షార్హము కాకున్నను, శిక్షావిధానశాస్త్రము (Criminal Procedure Code) 108 వ సెక్షను ప్రకారము కోర్టువారట్టియుత్తరువును చేయవచ్చుననియు, ఆసెక్షనువలన నుద్దేశింపఁబడిన యుత్తరువును చేయుటకిది తగిన కేసుఅనియును నొక్కి చెప్పుచు అడ్వకేటుజనరల్ గారాయుత్తరువును నిలుపఁ బ్రయత్నించెను. శీతల్ ప్రసాద్ x రాజచక్రవర్తి,(ఇండియన్ లా రిపోర్టు 43 కలకత్తా591) అను తీర్పును ఆయన ఆధారము చేసికొనెను. కాని వెదజల్లబడిన అంశ

ములు 108 (b) సెక్షన్ ప్రకారము రాజద్రోహమని కనఁబఱచవలయు నని నాకుతోఁచుచున్నది. సెక్షనుయొక్క పదములు (or మాటలు, words) స్పష్టముగా నున్నవి. వానిప్రకారము నడుచుకొనవలయును. ఇట్లు కను గొనుటచేత (this view) శిక్షావిధానశాస్త్రముయొక్క 108 వ సెక్షను అనవసరమగునని నేనెంచను. 124 A అను సెక్షన్ ప్రకారము ప్రాసిక్యూ షనుచేయుటకంటె కొన్ని కేసులలో నీసెక్షను ఉపరి (additional) పరి హారము కలుగఁజేయుటకు యుక్తముగ నున్నదని తోఁచుచున్నది.

కాఁబట్టి శాస్త్రజ్ఞుఁడగు నాసోదరుఁడు (బ్యాచిలర్ జడ్జి) చేయఁ దలఁచిన యుత్తరువుతో నేనేకీభవించుచున్నాను.

జస్టిస్, షా.

పైతీర్పులు చెప్పఁబడినపిమ్మట తిలకుగారు పూఁచీఖత్తులను (Bonds) అదివఱకే వ్రాసియిచ్చెననియు, న్యాయమూర్తులు (Their Lordships) ఆఖత్తులను రద్దుపఱచనియెడల అవి అమలులోనుండుననియు న్యాయ మూర్తులతో మనవిచేసి వానిని రద్దుపఱచునట్లు ఉత్తరువును దయచేయ వలసినదిగా కోరెను.

హైకోర్టువా రాఖత్తులను రద్దుపఱచినామని యుత్తరువు చేసిరి.

శ్రీ తిలకుగారిపక్షమున గౌరవనీయుఁడగు బారిస్టర్లు జిన్నాగారును, బాప్టిస్టాగారును, బఖేల్ (Bakhale) గారును (వకీళ్లుగా) పనిచేసిరని ముందే చెప్పియున్నాను.

గవర్నమెంటువారి పక్షమున, అడ్వకేటుజనరల్ గారును, బిన్నిం గు, స్ట్రాంగుమన్ (Messrs. Binning, Strangman) గార్లును, పట్ వర్ధన్ గారును, గవర్నమెంటుప్లీడరుగారును (వకీళ్లుగా) పనిచేసిరి.

---

తే 1-5-1916 ది (Belgaum) బెల్గాములో లోకమాన్య

## శ్రీ బాలగంగాధరతిలకుగారి యుపన్యాసము.

నేఁడు నన్నుపన్యసింపవలయునని కోరినపుడు, ఏవిషయమునై నే నుపన్యసింపవలసినదియు నాకు తెలియలేదు. ఏముఖ్యవిషయమునుగూర్చి

యును నేనుపూర్తిగ ఆలోచించి సిద్ధముచేసికొనిరాలేదు. నేనుకాన్ఫరెన్సు (సభ) నిమిత్తమువచ్చితిని. గతించిన రెండు లేక నాలుగుదినములనుండి చర్చింపఁబడుచున్న విషయములను గూర్చియును 1915 సంవత్సరం డిసంబరుమాసములో సమావేశమైన 31-వ దేశీయమహాసభకు పూర్వమిచట స్థాపింపఁబడిన ఆంగ్లసామ్రాజ్యస్థ స్వరాజ్య సంఘము (Home Rule League) యొక్క యుద్దేశములనుగూర్చియు నేనుముచ్చటించుట(కొన్నిమాటలాడుట) అనుచితముకాదనియెంచి నేనీదిన మావిషయమై యుపన్యసింపఁబూనినాఁడను.

"స్వరాజ్యము" అన నేమి? ఈవిషయమైచాలమంది పొరబాటగుఅభిప్రాయము కలిగియున్నారు. ఇది కొందఱకు బొత్తుగా తెలియనే తెలియదు. కొందఱు తెలిసికొని అపార్థముచెప్పుదురు. కొందఱకు దానియం దిష్టములేదు. ఇట్లు అనేకవిధములవా రున్నారు. కావున అన్నిటిలో నీక్రిందివిషయములను ముచ్చటించుటకంటె ఎట్టి ముఖ్యమగుచర్చను నేనుజరుపుటకు నేఁడుపూనుకొనవలెను? "స్వరాజ్యము!" అన నేమి? మన మెందులకు దాని నపేక్షించెదము? మన మద్దానికి తగియున్నామా లేదా? మన మెవరికి విన్నవింప (demand) వలసియుంటిమో వారిని స్వరాజ్యమునుగూర్చి మన మెట్లుకోరవలయును? మనము చేయవలసినపనిని మన మేయేమార్గమున ఏపద్ధతులమీఁద జరుపవలయును? నేను చెప్పఁబూనినయీసామాన్యవచనములు నాప్రయత్నముచేతను, సమర్థతచేతను చెప్పునవికావు. స్వరాజ్యోద్దేశము పురాతనమైనది. స్వరాజ్య మనునప్పుడు "స్వ" అనుదానికి వ్యతిరేకమగు రాజ్యమున్నదనియు, అప్పుడే యీయుద్దేశ మంకురించెననియు గన్పట్టుచున్నది; ఇదిస్పష్టము. ఈస్థితి సంభవించినపుడు స్వరాజ్యాపేక్ష తలంపునకువచ్చును; అందునిమిత్తము ప్రయత్నములుజరుగును. మీరిప్పుడట్టి యవస్థలోనున్నారు. మిమ్ముపరిపాలించుచున్నవారి మతమును జాతియు దేశమునుకూడ వేఱుగానున్నది. ఆంగ్లేయుల ప్రభుత్వము మంచిదా?

చెడ్డదా? అనుఅంశము వేఱు. స్వపరిపాలన, యితరపరిపాలన అనునవి వేఱు. ప్రప్రథమమునందే యీరెంటివిషయమున తారుమారు (లేక, గందరగోళము)పడవద్దు. మనవారా? పరాయివారా? అనుప్రశ్నవచ్చిన ప్పుడు పరాయివారే అని అనవలయును. మంచిచెడ్డలను ఆలోచించు నప్పుడు మంచిదనిగాని, చెడ్డదనిగాని చెప్పవలయును. "చెడ్డది" అను నెడల అందులో నెట్టిమంచిమార్పు (improvement)జరుగవలయును? ఈ అంశము వేఱు. "మంచిది" అనునెడల పూర్వపరిపాలనలలో లేని యేమంచివిషయము లిందుగలవో ఆలోచింపవలయును. ఇవి వివిధ ములుగఁ గన్పట్టుఅంశములు. గనుకనే, ప్రథమమున స్వరాజ్యాపేక్ష దృఢముగఁ గలుగుటకు కారణమెద్ది? .... ....(మూలములో ఈవా క్యముఅసంపూర్తిగనున్నది.)....పూర్వముమనహిందూదేశములోఅనేక రాజ్యములుండెడివి.—కొన్నిప్రదేశములలో మహమ్మదీయుల పరిపాలన, కొన్నిచోట్లలో రాజపుత్రుల పరిపాలన, కొన్నిప్రాంతములలో హిందూ పరిపాలన, కొన్నిచోట్లలో మహారాష్ట్రపరిపాలన ఉండెను.—ఇట్టిస్వరా జ్యములు మంచివా, చెడ్డవా? అనునది వేఱొక అంశమని మరలజ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను. ఇది తర్వాత ఆలోచింతము. అవన్నియు నుత్పన్నము లైనందున హిందూదేశమంతటను ఏకముగ ఆంగ్లప్రభుత్వము స్థాపితమై నది. అవి యెట్లుత్పన్నములైనవో వానిని మనమిపుడు ఆలోచింపనవసర ము లేదు; అవి చెడిపోయినవిధమును ఆలోచింపనవసరము లేదు. నే నావి షయమై ప్రస్తాపింపఁబూనలేదు. కాని, ప్రస్తుతపు పరిపాలనావిధానాను కూలముగ సమర్థులగుకొందఱు ఇంగ్లాండులో విద్యనభ్యసించి కలాశా లలలోఁజదివి హిందూదేశమునకువచ్చి రాజకీయపరిపాలనమును జరుపు చున్నారు. "చక్రవర్తి" అనునది నామమాత్రమే. "రాజ" అను శబ్దము మనోగోచరమైనవెంటనే అట్టి మానసిక పదార్థమునకు రూపా మారోపించితిమేని, ఇప్పటిచక్రవర్తికన్పడును. భావము అదృశ్యపదా ర్థము. ఇట్టి అదృశ్యపదార్థమునకు రూపమును కల్పించునెడల రాజా, లేక

(చక్రవర్తి) వ్యక్తీకరించును. కాని, పరిపాలనను చక్రవర్తి(స్వయముగ) జరపఁడు. స్వరాజ్యసమస్య చక్రవర్తికిగాని అదృశ్యభావమునకుగాని వర్తించదు. ప్రథమమున నే దీనిగమనింపవలయును. ఏదేశములోనైనను రాజు, పరిపాలనజరుపునుద్యోగస్థులు యుండి అచట కొంతయధికారము చలాయింపించవలెను. అరాజక దేశములస్థితి వేఱు ; అట్టిదేశములు (Nations, జాతులు) వృద్ధినొందవు. గృహమందు గృహకృత్యములను నెఱవేర్చుట కొకరుండవలెను. గనుక ఇంటివారు లేనప్పుడు నమ్మకస్థుఁడగుపరాయివాఁడు (trustee) అట్టిపనులు నెఱవేర్చుటకు నియమింపఁబడునుకదా.—అట్లే రాజ్యస్థితియునుండును. ప్రతిదేశమందును పరిపాలనజరపుటకు కొన్నివిధులును కొందఱుజనులు నుండవలయును. ఈ రెండువిషయములు అనఁగా ఈవిధానములనుగూర్చియు అట్టివారినిఁగూర్చియు విపులముగ విమర్శింపవలయును. నిన్నటిదినము అధ్యక్షుఁడు (అనఁగా రాష్ట్రీయసభాధ్యక్షుఁడు శ్రీగణేశకపర్డీ) చెప్పినరీతిగా 'రాజు' శబ్దభావమును (కూడ) విమర్శింపవలయును.రాజుండవలయును,రాజకీయ పరిపాలనమునుండవలెను. ఈరెండువిషయములును చారిత్రకములగు యథార్థములు. నియతిహీనమైనట్టియు, అరాజకమైనట్టియు,(అనఁగా పై విచారణచేయు నధికారవర్గము లేనట్టియు) దేశస్థితినిఁగూర్చి మహాభారత మిట్లు నుడువుచున్నది."అట్టిప్రదేశములయందు బుద్ధిమంతుఁడు వసింపఁజనదు. అట్టిచోట్ల ప్రాణహాని,ధనహాని,ఇండ్లదోపిడి, గృహదహనములు ఈమొదలగునవి యేక్షణమందు జరుగునదియు తెలియదు." దొరతనముండవలయును. ప్రాచీనకృతయుగములో ఎట్లుజరిగినది నేను విశేషముగ చెప్పను. అప్పటివారికి రాజుతో అవసరములేదు. పరస్పరశ్రేయముల నెఱింగియే కార్యముల నెఱవేర్చుకొనిరి. ఒకప్పుడు రాజులేని స్థితికూడ నుండెనని మన పురాణములవలనఁ దెలియుచున్నది. చరిత్రాత్మకకాలమందట్టిస్థితి యుండెనా యని ఆలోచించినయెడల అట్టి స్థితి చరిత్రదృష్టము కాదని తెలియుచున్నది. ఏదో ఒకవిధమగు అధికారి

యుండకతప్పదు ఒకచోట ప్రతిక్షణము ప్రజలుకుండుకూడి అధికారము చలాయించుట సాధ్యము కాదు. అందుచేత, రాజాధికారమెల్లప్పుడును రెండుభాగములుగ విభజింపఁబడినది.—అందులో మొదటిది (advisory body) ఆలోచనసభ, రెండవది (executive body) పరిపాలనసభ. ఇప్పుడు హిందూదేశములో పుట్టిన స్వరాజ్యసమస్య అట్టిఅదృశ్యభావమును గూర్చినది కాదు. మనపై అధికారము చలాయించవలసినవారినిగూర్చిగాని, యెవరి నాయకత్వము, ఆజ్ఞ, మార్గదర్శకత్వము (guidance) క్రింద ఆ అధికారము చలాయింపఁబడవలసియున్నదో, అనుదానినిగూర్చిగాని యీసమస్య సంబంధించదు. ఆంగ్లేయులయొక్క పరిపాలనకు లోబడియుండు, ఆంగ్లేయులవిచారణకు (supervision) లోఁబడియుండు, ఆంగ్లేయుల సహాయము, సానుభూతి, నిశ్చలదీక్ష (anxious care) వారియందున్న గొప్పభావములు లోనగువానిద్వారా మనమేలును మనము లభింపఁజేసికొనవలయు ననునది నిర్వివాదాంశము. దీనింగూర్చి నేనుచెప్పునది యేమియు లేదు. (ఆహ్లాదము cheers). ఇదే మొదటిపని, ఈరెంటిని తారుమారుచేసి, (comfound) (ఒకదానిని మఱొకటిగాభావించి) భ్రమ (comfusion) పడవలదు. ఈరెండును వేఱువేఱు. మన మిప్పు డసహాయస్థితియందుండుటచేత మనము చేయునది యితరులసహాయముననే చేయవలయును. వారి రక్షణముక్రింద మనమేలును మనముసంపాదింపవలయు ననుటకు సందేహము లేదు. అట్లుకానియెడల మీాస్వాతంత్ర్యము నశింపక యేయుండును. కావున, బ్రిటిషుసామ్రాజ్యముయొక్కయు, ఆంగ్లేయప్రభుత్వముయొక్కయు సహాయమే మనభాగ్యోదయమునకు ముఖ్యకారణమని మన మంగీకరించినయెడల ఇందుకొందఱకుగన్పడు విస్మయాస్పదమగు విషయము పూర్ణముగ అంతర్ధాన మగును. అనఁగా ఇందు రాజద్రోహము (sedition) ఏమియును లేదు. కాఁబట్టి, ఆంగ్లేయప్రభుత్వసహాయము లేకయే ఆంగ్లేయప్రభుత్వము అనుదానికి బధ

లుగా అదృశ్యమగు ఆంగ్లేయ ప్రభుత్వము అనుచో నేమియు తప్పుండదు.—ఈయదృశ్యమగు ఆంగ్లేయ ప్రభుత్వసహాయముతో, వారిసహాకారముతో, మీభాగ్యోదయమును కలిగించుకొనినచో మీకు కోరతగినదింకేమియున్నది. (ఇట్లు) యీరెండవ ప్రశ్న కలుగుచున్నది. నేను పైన సూచించిన భేదమునందే దీనికి ఉత్తరము (జవాబు) న్నది. ప్రభుత్వము అదృశ్యముగ నున్నను, అయ్యది దృశ్యమగుట కారంభించినపుడు, ఆరాజ్యముయొక్క నిర్వాహకత్వము, దానిహస్తముల మూలముగను, దానిచర్యల మూలముగను నెఱవేర్పబడును. ఈదృశ్యస్థితికిని అదృశ్య ప్రభుత్వమునకును భేదము ఎట్లనిన, మాయకును పరబ్రహ్మమునకును భేదమున్నట్లే. ఈ "దృశ్య", "అదృశ్య" అనుపదములను వేదాంతము నుండి గ్రహించినాఁడను. నామరూపరహితమైన పరబ్రహ్మమునకును, మాయకులోఁబడుట కారంభించునప్పుడు రూపస్వీకారమునొందు పరబ్రహ్మమునకును భేదముకలదు, కావున, మాయవలనఁ గలిగిన వ్యవహారములు మార్పుజెందుట నిశ్చయము. మాయయొక్క నైసర్గికచిహ్నమేమి? అది ప్రతిక్షణమందు మార్పుజెందుటయే. ఒక ప్రభుత్వము (అనఁగా) అదృశ్యప్రభుత్వము నిలుచును. దృశ్యప్రభుత్వము ప్రతిక్షణమందును మార్పునొందును. ప్రస్తుతము ఆలోచనలోనకువచ్చిన స్వరాజ్యపదము దృశ్యప్రభుత్వమునకే అన్వయించును. అదృశ్యప్రభుత్వ మొకటి స్థిరీకరించి ప్రతిక్షణమును మార్పుఁజెందుఁ దృశ్యప్రభుత్వమునందు ఎట్టిమార్పును కలుగఁజేసినయెడల మనప్రజాసమూహమునకెట్లు ఫలదాయకమవును? ఇదియే స్వరాజ్యసమస్య. దీనిని స్వరాజ్యసమస్య యనుటవలన ....(మూలములో తేటగా లేదు) ....ఈక్రింది ప్రశ్నకలుగుచున్నది. "మన హిందూదేశమందు ప్రస్తుతమమలులోనున్న పరిపాలనాపద్ధతి యెవరిచేతుల యందుండవలయును? అదృశ్యప్రభుత్వము—ఆంగ్లేయప్రభుత్వము—మాఱవలయునని మనము కోరము. ఈఅదృశ్యప్రభుత్వము ఏదృశ్యరూపముయొక్క హస్తములద్వారా పనిజరుపుకొనుచున్నదో అట్టిహస్తముల

లోపరిపాలన ఉండకూడదనియును, కొందఱి ఇతరులహస్తములోని చేరవలయుననియును, మనము నొక్కిచెప్పుదుము. ఈపరిపాలన మితరులచేత లేక, మఱొకరిసహాయమున లేక, మఱియొకదృశ్యరూపమున జరుగునెడల ఇప్పుడు జరుగువారిపరిపాలనకంటె ఎక్కువలాభకారిగ నుండుననునమ్మకముతో ఈ 'స్వరాజ్యము' అను నాందోళనము నడచుచున్నది. మఱొక దృష్టాంతమువలయునెడల, ఇంగ్లాండులో చక్రవర్తిగారున్నారననచ్చును. రాజు ఎట్టితప్పును చేయడని ఆంగ్లేయులయొక్క ఒకచట్టములోనున్నది. (ఈమార్పులు మూలములో నాంగ్లభాషయందున్నవి.) రాజుగారెప్పుడును తప్పిదమును లేక నేరమును చేయరు. ఏలనఁగా, ఒకమంత్రిపోయి వారితో (రాజుగారితో) ఏవిషయమునైనను చెప్పినప్పుడుమాత్రమే రాజుగారికి తెలియునట్లు రాజుగారి అధికారమునకు హద్దుఏర్పరచబడినది. ముఖ్యమంత్రిగారు తనస్వంతపూచీమీఁదనే పనిచేయును. ఆంగ్లేయుల చరిత్రమునుచదివినవా రనేకులుందురు. అట్లు కాకుండుట వాస్తవము కాదు.—దానియొక్క ముఖ్యసూత్రము (principle) ఇదియే. ఈసూత్రము ఆంగ్లేయులచరిత్రమునుండి యేర్పడినందున రాజద్రోహనేరముల సంఖ్య తగ్గుట కారంభించినవి. ఐన నిచటమాత్రమువారు రాజద్రోహపు కేసుల (cases of sedition) ను దాఖలు చేయుచున్నారు. పరిపాలనము చేయువారు వేఱు; రాజుగారు వేఱు. రాజుమాత్ర మొక్కఁడేకాని, మంత్రి అయిదుసంవత్సరములకొకసారి మాఱుచుండును. అప్పుడు మంత్రి మాఱవలసినదిగా యెవరైనను చర్చించునెడల అది రాజద్రోహమని యెవరు అనరు. ఆంగ్లేయజనులకనులముందర ప్రతిదిన మిట్టిపనులు జరుగుచున్నవి. రాజుగారి మంత్రివర్గము (circle of ministers) అయిదు సంవత్సరములకు పిమ్మట నుద్యోగమును మానెదరు; రెండుసంవత్సరములు తరువాత నుద్యోగమును మానెదరు. వారిలో వారు తమ ఇష్టమువచ్చినట్లు పోరాడవచ్చును. రాజుగారికట్టిదానితో (పోరుతో) ఏమి సంబంధము? ఆయన, నామరూపములులేని పరబ్రహ్మము (వంటి

వాఁడు). ఇందువలన (పోరుటవలన) ఆయన కెట్టియిబ్బందియును లేదు. కాఁబట్టి ఇప్పుడు హిందూదేశమున జరుగుచున్న స్వరాజ్యాందోళనము మంత్రివర్గముయొక్క మార్పును గురించినదై యున్నది. హిందూదేశము నెవరు పరిపాలనచేయుచున్నారు ? చక్రవర్తిగారువచ్చి అట్టిపనిని చేయుచున్నారా? గొప్పసమయమందు దేవునివలె ఆయననుఁజూ రేగింపవచ్చును. ఆయనయెడల మనము మనరాజభక్తిని వెలిపఱచవలయును ; ఇదియే వారివిధి అయినను, పరిపాలన మెవరివలన జరుగుచున్నది ? అది యిప్పుడు నవుకర్లు సేవకులుగ నున్నవారిద్వారా అనఁగా రాజకీయకార్యదర్శి లేక, స్టేటుసెక్రెటరి, రాజప్రతినిధి లేక, వైస్రాయ్ (Viceroy) గవర్నరు, ఆయనక్రింద కలెక్టరు,(పటేల్ గ్రామయజమాని, Patel) ఆఖరునపోలీసు భటుఁడు (Police sepoy) అనువారిద్వారా జరుపఁబడుచున్నది. ఒక పోలీసుభటుని బదలాయించి మఱొకపోలీసుభటుని ఏర్పాటుచేయవలసినదనినయెడల అది రాజద్రోహమగునా ? ఇచటికి వచ్చిన ఒకకలెక్టరును అక్కఱలేదనియును మఱొకకలెక్టరు కావలయుననియును కోరునెడల అది రాజద్రోహమగునా? "ఈరాజకీయకార్యదర్శి అక్కఱలేదు; మఱొకని నీయుము" అనిన అది రాజద్రోహమగునా? దీనిని రాజద్రోహమని యెవరు అనరు. పోలీసుభటునకు వర్తించుమాత్రమే రాజకీయకార్యదర్శికికూడ వర్తించును. ఏప్రభువు రాజునకు రాజకీయకార్యదర్శి మంత్రిగను నవుకరిగ నున్నాఁడో మనముకూడ అట్టిరాజునకు లోఁబడిన ప్రజలమే. అట్లగుటచే, " రాజకీయకార్యదర్శి అక్కఱలేదు. రాజప్రతినిధి అక్కఱలేదు; బంగాళాదేశములో ఫుల్లరు (or Sir Bamfylde Fuller) దొరగారక్కఱలేదు. ప్రస్తుతము కాకున్నను ఇంతకుపూర్వము గవర్నర్లవిషయములో ఇట్టితీర్మానములు జరిగినవి," అని యెవరైన అడిగి అందులకు కారణములం దెలుపఁబూనినచో, అట్లను వానికి తలతిరిగినదనియును అతఁడు చెప్పెడికారణములు సరియైనవికావనియును, తగినవికావనియును మీారనెదరు. కాని, చరిత్రను

బట్టి చూచినయెడల అతఁడు చెప్పునది రాజద్రోహ మగునని తేలదు. (ఆహ్లాదము, cheers). మనముకోరునది రెండవతరగతిది. అదిస్వరాజ్యము నకు సంబంధించినది. నేను చెప్పునది బాగుగ యోచింపుడు. ఇప్పుడు పరిపాలనము చక్కఁగ జరుగుచున్నదని మీరెంచు నెడల నేను చెప్పున దేమియులేదు. ఇప్పుడు జరుగుచుండు దేశీయమహాజనసభలలోను కాన్ఫరెన్సు సభలలోను మీరువచ్చి "మాగ్రామకరణము మాన్య మును తీసివేసెను. ఆటవికశాఖవారు మామీఁదబలము దౌర్జన్య మును ప్రయోగించినారు, మత్తుపదార్థశాఖ (అబ్కారి డిపార్టుమెంటు) వారివలన త్రాగుడువృద్ధి అయినది, మాకు అవసరముగా కావలసి యున్నవిద్యను మాకిచ్చుట లేదు" అని మీరనెదరు. దీనికంతకు మూల కారణ మెద్ది? ఇట్లు చెప్పినంతమాత్రమున ప్రయోజనమేమి? మీకు విద్య యేలలభింపదు? మనము కోరని లేక, మనకక్కఱలేని చోట్ల మత్తుపదార్థశాఖవారి దుకాణము లేల తెఱవఁబడియున్నవి? ఆటవికశాఖ (Forest Department)లో రక్షితమైన అడవులు రిజర్వ్‌డ్ ఫారెస్టులు (reserved forests) ను గూర్చియును, ఈవిధమగునడవినిఁ గూర్చియును ఆవిధమగు నడవినిఁగూర్చియును, విధులు రూల్సు (rules) ఏర్పరుపఁబడి నవి. అవి యెందుల కేర్పరుపఁబడినవి? ప్రస్తుతము, ఇట్టి విషయమగు జాబితాలమీఁద జాబితాలు అనేకములు దేశీయమహాజనసభ యెదుట పెట్టఁబడినవి. మీయిష్టమునకు వ్యతిరేకముగ జూరీని (Jury) తీసి వేసిరి? ఇంతవఱకు కర్నాటములో నొకకలాశాల, కాలేజి నైనను పెట్ట లేదు? ఈ ప్రశ్నలకన్నిటికి నొకజవాబుకంటె వేఱులేదు. ప్రస్తుతము మన మిట్లనుకొనుచున్నాము: "కళాశాల, కాలేజి లేదా? అధికారము కలిగియున్నట్టి కలెక్టరుకుగాని గవర్నరుకుగాని అర్జీని (పిటిషన్,petition) పంపుదము." ఇట్టి అధికారము మీచేతులలోనికి వచ్చినయెడలగాని, లేక, వారిస్థానమున మీరే యుద్యోగములం దున్నయెడలగాని, లేక, వారి అధికారము ప్రజాభిప్రాయము ననుసరించవలసిన బాధ్యతకలదై.

యున్న యెడలను కాని, ఇట్టివి లోపములు తటస్థించి యుండవు. పైవాని కింతకంటె ప్రత్యుత్తరము లేదు. మీచేతులలో అధికారము లేనందున నిట్టివి (లోపములు) సంభవించుచున్నవి. ఇట్టి యేర్పాటులన్నియు నెవరి నిమిత్తము చేయఁబడవలసియున్నవో, అట్టి మీకు యిట్టి విషయములను నిర్ణయించు నధికార మీయఁబడలేదు. కాఁబట్టి మన మడుగవలసినది పసిపిల్లలడుగునట్టిదిగ నుండును. పసిపిల్లకు ఆఁకలియైనప్పు డేడ్చును; ఆఁకలియని చెప్పఁజాలదు. అంతట ఆశిశు వాఁకలిచే నేడ్చుచుండెనో, లేక, కడుపునొప్పిచే నేడ్చుచుండెనో తల్లి కనుఁగొనవలయును. కొన్ని సార్లు ఔషధములు పనికిరానివయ్యెను. ప్రస్తుతము మనస్థితియునట్టి దైనది.

ప్రప్రథమమున మీకేమి కావలసియున్నదో మీయిబ్బందు లెట్టివో మీ రెఱుంగరు. మీరు తెలిసికొన్నప్పుడు మీరు నోటితో మాట లాడ నారంభించితిరి; కాని, మీ మాటలచొప్పున కార్యములు నెఱ వేఱుటకు మీచేతులలో అధికారము లేదు. ఇట్టి స్థితిలో నిపు డేమిసంభ వించినది.? మీరు చేయవలసినదంతయు, మీరు కోరునదంతయు— మీయింటిలో బావిని త్రవ్వుకొనదలఁచిన యెడల—కలెక్టరుకు అర్జీని పంపుకొనవలయు. అడవిలో పెద్దపులిని మీరు చంపఁదలఁచిన యెడల కలెక్టరునకర్జీ నిచ్చుకొనవలయును. పశువులకు పచ్చికదొరకదు; అడవి నుండి కట్టెలమోపులు దొరకవు, గడ్డికోసుకొనుట కనుజ్ఞనొందవల యును—కలెక్టరుకు అర్జీయిచ్చుకోవలయును. అనఁగా ఇదియంతయు నసహాయుని లేక దిక్కుమాలినవాని (helpless man) స్థితినిఁ బోలి యున్నది. ఈపద్ధతి మన కవసరము లేదు—మనకింతకంటె మంచిపద్ధతి కావలయును. అదియే స్వరాజ్యము; అదియే హోమ్‌రూల్ (Home Rule).

ప్రథమమున ఈసమస్యలు రావు. పిల్లవాఁడు పసివాఁడుగనున్న పుడు వానికేమియు తెలియదు; పెద్దవాఁడైనప్పుడు (వాఁడీసంగతుల

యందు పెద్దవాఁడై నప్పుడు) వాఁడీసంగతుల నెఱుంగును; అంతట కొంతవఱకైనను తనయభిప్రాయము ప్రకారము తనగృహకృత్యములను నెఱవేర్చుకొనుట మంచిదని యెంచనారంభించును.—ఇట్లే, ఒకదేశస్థుల సముదాయము, లేక నొకజాతివారు (nation) అది (అనఁగా నాజాతి) దీని నాలోచింపఁగలిగినప్పుడు, దీని నాలోచించుటకు సామర్థ్యము కలిగినప్పుడు, ఈసమస్య బయలుదేరును. కాని యిచటి ప్రస్తుతపు స్థితినిఁబట్టి పైఅభిప్రాయమును (thought) మనముమానివేయవలయును.

ఇఁక అదృశ్యప్రభుత్వమును గూర్చినసంగతిని వదులుదము. దృశ్యప్రభుత్వహద్దులోనికివచ్చి యాలోచించు నెడల నిట్టియేర్పాటులను జేయునట్టియును, పరిపాలనమును జరుపునట్టియును అధికారులు ఇంగ్లాండులో కొన్నివిధుల (rules) అనుసరించియును న్యాయశాస్త్రమునననుసరించియును ఏర్పరుపఁబడిరనియు, వారిపరిపాలనాధోరణిని (policy) గూర్చి అట్టి న్యాయశాస్త్రానుసారముగ విధు లేర్పఱచఁబడుచున్నవనియు, మనకు గోచరమగును. ఈవిధులు (rules) మంచివి కావచ్చును, చెడ్డవి కావచ్చును. అవి మంచివే కావచ్చును, సక్రమముగ నేర్పఱుపఁబడి విధ్యుక్తముగ నుండవచ్చును. అవి(అట్లు)కావని నేననను కాని, ఇతరులచే చేయఁబడిన యేర్పాటు లెంతసమంజసముగ నున్నను ఇట్టియేర్పాటులను చేయు అధికారము నపేక్షించునతఁడు వీనినెల్లప్పుడు అంగీకరించుట తటస్థించదు.ఇదియే స్వరాజ్యసూత్రము. మీకలెక్టరునుమీరెన్నుకొను నధికారము మీ కుండెనేని అతఁడు (అనఁగా మీరెన్నుకొను నతఁడు( ఇప్పటి కలెక్టరుకంటె నెక్కువపనిచేయునని అనుకొనఁదగదు. ఒకవేళ అతఁ డంతపని చేయకపోవచ్చును; మీఁదు మిక్కిలి అతఁడు తక్కువగా కూడ చేయవచ్చును. ఇందులకు నేనొప్పుకొనెదను. కాని, వీనికిని వానికిని భేద మిదియే: ఇతనిని మన మెన్నుకొంటిమి, మనవాఁడు, మనల మెప్పించువిధమును అతఁడు బాగుగా గుర్తెఱుఁగును; అయినను, రెండ

నవాఁడిట్లు తర్కించుకొనును. "మనము మంచిదనుకొనినవి యితరులకు కూడా మంచివిగా కనఁబడవలయును. మన మితరులవలన తెలిసికొనవలసిన దేమున్నది? మన మితరులకు చెవియొగ్గి వినవలసిన దేమున్నది? నేను విద్యాధికుఁడను. నా కింతజీతము వచ్చుచున్నది. నేనధికసమర్థుఁడను. ఇతరుల కుపకారమగుపనుల నేలచేయుదును?" "నీకింత అహంకారమున్నదిగనుక..." అనునదియే దీనికి ప్రత్యుత్తరము. (హాసము, laughter) ఒకటేమార్గమున్నది;....(మూలములో నీవాక్యము సరిగా లేదు)... దీని కొకవిధి (rule) లేదు. కడుపుకాలినవాఁడు దాని అనుభవము నెఱుంగఁడు. దానికి కారణ మిదియే; మఱొక కారణము లేదు. కావున, మన దేశములో నుత్పన్నమైనకష్టముల నన్నిటిని ఆలోచించునెడల, ఇప్పుడమలులోనున్న విధానము (system) మన కక్కఱ లేదని తోఁచును. మనకు రాజక్కఱ లేదనికాదు, ఆంగ్లేయప్రభుత్వ మక్కఱ లేదని కాదు; చక్రవర్తి అక్కఱ లేదనియును కాదు. అమలులోనున్న రాజ్యాంగ పద్ధతిలో నొకముఖ్యమగు మార్పును కోరుచున్నాము. అట్టిమార్పు కలిగినయెడల ఆంగ్లరాజ్యమున కెట్టి యపాయమును కలుగనేరదని నా మట్టుకు నేననుకొనెదను. మనకు వ్యతిరేకమగు దృష్టిగలవారు అట్లను కొనెద రనుటకు కారణముకలదు. ఏలనగా, వా రట్లనుచున్నారు. (ఆహ్లాదము, cheers). అందువలన, పైవిధముగ చలాయింపఁబడుచున్న ఆంగ్ల ప్రభుత్వములో నెట్టిమార్పులు జరుగవలయునో అనుఅంశమునుగూర్చి యిపుడనేకులుతమమనస్సులలో(minds)ఆలోచించుచున్నారు. మనము చిన్నకోరికలు (demands) కోరెదము, అనఁగా, ఘోడెగవ్ (Ghodegoan) అనుగ్రామములోని సారాయిదుకాణమును తీసివేయుమనెదము; దానిదీసివేయకూడదని వారనెదరు. అయిపోయినది(done). ఉప్పుమీఁద పన్నుతగ్గించుమనఁగా, ఉప్పుపన్నువలనవచ్చు ఆదాయము తగ్గునని వా రనెదరు. ఈపన్నుతగ్గునెడల, అక్కడనెట్లు జరుగగలదు? కాని, యీయేర్పాట్లను చేయునతఁడే యీపనులను చేయువలయును. నాగృహకృత్యములను నేను (స్వయముగ) జరుపుకొనుఅధికారమునుగోరి

నప్పుడు "మీాకు వచ్చుచున్న ఆదాయమును నాకీయవలసినది; దానిని ఖర్చుపెట్టవలదు" అని నేను అనను. మనంతట మనమే వ్యయపఱచవలయును; మనముకూడ ద్రవ్యమును వసూలుచేయవలయును; ఇట్టి ద్వివిధమగు పూచి (జవాబుదారి) మనకుండవలయును. అంతట మనమేమి జేయవలసియుండునో చూతము. ప్రస్తుతపువివాద మిట్టిది. అధికారవర్గము (bureaucracy) వారియిష్టము వచ్చినట్లు జరుపవలెననెదరు, మాాయిబ్బందులన్నియు తొలఁగిపోవునట్లు మాాయిష్టప్రకారము పనిచేయవలసినదని మన మనెదము.

ఒకచిన్నవాఁడు మూార్ఖత్వమున దనకు నిరువదిరూపాయిలటోపిని (cap) కొనిపెట్టవలసినదని తనతండ్రిని అడుగునని మన మెఱుంగుదుము. (కాని) అతనితండ్రిస్థానమందె అతఁడు (చిన్నవాఁడు) ఉండినయెడల ఆటోపినిమిత్త మిరువదిరూప్యముల నతఁడు వ్యయపఱచుననుట సందియము. తండ్రి ఒప్పుకొనఁడు, (లేక, వలనుకాదనును) కాని, చిన్నవాఁడపుడేడ్చును. చిన్నవాఁ డట్లేలనేడ్చును ? ఏలనన ; అతని కావిషయము తెలియదు; అతని కాయధికారము లేదు. కావున, అట్టి పరిపాలన ఈహిందూదేశమందు అమలులోనికిఁ దెచ్చుటదేశమునకు లాభకరము. దీని నీదినముననే మనము కోరుచున్నాము. మన కిది లభించినయెడల దక్కినవి తనంతట నవియే మనవశగత మగును. మనము కోరు లెక్కలేనికోరికలకు నిదియేమూాలము, ఈబీగము మనకుఁ లభించినపుడు మన మొకతలుపు నేగాక, 5 లేక, 10 తలుపులను వెంటనే తెఱవగలము. ప్రస్తుతపుసమస్య యిట్టిది. ఈసమస్యవైపునకు నందఱి దృష్టిని మరల్పవలయుననియే యిచట ఈమధ్య ఆంగ్లసామ్రాజ్యస్థస్వరాజ్యసంఘము (హోమ్ రూల్ లీగ్) స్థాపింపఁబడినది. ఇది కొందఱకు విచారకరముగనుండును. ఒక్కొక్కఁడును విచారపడును ; చిన్నవాఁడు మైనరుగనున్నకాలమందు తండ్రి చనిపోవునపుడు పంచాయితీనేర్పాటు చేయునని యిచట కొలఁదికాలముక్రిందట అనిరి. పంచాయితి యేర్పా

హైనతోడనే నా ఆస్తినంతయు రక్షింపఁ (తనిఖీచేయు) బూనును. ఇట్టి యే వ్యాపారమువలన కూడా కొంతలాభములు కలుగును. ఇది యొప్పుకొనునది యే, తర్వాత చిన్నవాఁడు కొంచెము పెద్దవాఁడు కానారంభించినపుడు ఇందులో కొంతలోపమున్నదని కనుఁగొనును, (తెలిసుకొనును) "నేను చక్కఁబెట్టుకొను నధికారము (or నా పనులు నేను నెఱవేర్చుకొను అధికారము) నేను సంపాదించుకొనవలయును. తర్వాత నేనింతకంటె నెక్కుడుగ నిర్వహించెదను." అతనికి దీనియందు దృఢవిశ్వాసము కలదు. అతఁడీవిధముగ వాస్తవముగా నిర్వహించుననికాదు. తఱచుగా దుర్మార్గుఁడయిన యెడల (prodigal) అతని తండ్రి ద్రవ్యము నతఁడు పాడు (దుర్వినియోగము) చేయును; కాని, అతఁడు పైరీతిగ అనుకొనును. ఈ యుద్దఱిమధ్య పోటి (opposition) లేకుండుటకుగాను, అతనికి (చిన్నవానికి) 21 సంవత్సరములవయస్సు పూర్తియైన వెంటనే నమ్మకమగు పెద్ద మనుష్యుఁడు (లేక, ట్రస్టీ, Trustee) తన యధికారమును (తనిఖీ, supervision) వదలుకొని, ఆ స్తిని ఆచిన్నవానికొప్పగించవలయునని న్యాయశాస్త్రమందు హద్దుఏర్పఱచఁబడినది. ఇది ప్రత్యక్షవిషయము. ఇది దేశములోని ఒకజనసముదాయమునకుకూడ వర్తించును (applies also to the nation) దేశములోనిజనసముదాయము (Nation) లోని ప్రజలు విద్యావంతులై తమవ్యవహారములనుతమంతటతామే నెఱవేర్ప గలుగుటను తెలిసికొనప్రారంభించినపుడు, తమపక్షమున నితరులు నిర్వహించుచున్న వ్యవహారములను తామే (స్వయముగ) నిర్వహించు కొనఁగోరుట సహజము. కాని, రాజకీయవ్యవహారములలో పై(నుదహరింపఁబడిన) 21 సంవత్సరములనుగూర్చిన శాస్త్రము లేకుండుటయే, యీచరిత్రములో లేక, రాజకీయవ్యవహారములలోని చిత్రము. ఒక దేశప్రజాతతిని మీరు నూఱుసంవత్సరములలో విద్యావంతులుగ చేసినపిమ్మట, దానిపరిపాలనమును దాని (ప్రజాతతియొక్క) హస్తగతము చేయవలయు ననుచు న్యాయశాస్త్రము వినమెటులైన నూహించినను,

దాని నములులోనికిఁ దెచ్చుట సాధ్యముకాదు. ప్రజలు తమంతట తామే దీని నములులోనికి తెప్పించవలయును. అట్లు చేయుటకు వారికి వాక్కు గలదు. కావున, నిచటఁగూడ నట్టిదేదైన నేర్పాటుండవలయును. పూర్వము కొద్దిగ నట్టియేర్పాటుండెను. అట్టి యేర్పాటిపుడు లేదు. మన కోరికలు (demands), మనకున్న యిక్కట్టులు, మన మపేక్షించు సర్దుబాట్లు (the wants which we feel) సంపాదనలో మనకుఁ గన్పట్టు లోపములు (inconveniences); వీనిమూలములు (కారణములు) ఇందున్నవి. పైవిధముగ నామూలకారణమునుగూర్చి విచారించినపిమ్మట ప్రతిపాదింపఁబడు పరిహారము (remedy) ఆంగ్లసామ్రాజ్యస్థస్వరాజ్యము (Home Rule, దానిపేరే స్వరాజ్యము. క్లుప్తముగా చెప్పునెడ, మన వ్యవహారముల నిర్వాహకత్వము మనవా స్తములనుండవలయునని కోరుటయే స్వరాజ్యమునుకోరుట. ప్రస్తుతము పలువురు దీనికూడ నాక్షేపించెదరు. విషయమును తేటపఱచుటకై సూత్రమే నిర్వచించినాను. ప్రతికక్షులు సర్వదా దీనికపార్థముచెప్పుదురు (misrepresent). నేను చెప్పిన హేతుభూతవాదములో (logical reasoning) లోప మేమియు నుండనియెడల, దాని కపార్థము చెప్పిననే గాని, లోపము లెట్లు తటస్థించును ? కావున, దీనిలో లోపమెద్దియైన కనఁబఱచగోరువారిందేదియో కొన్నివాక్యములకు నపార్థముచెప్పి, "ఇది అట్లున్నది; అది ఇట్లున్నది" అని తప్పులు పట్టెదరు. కాఁబట్టి, మన మెప్పుడు నపేక్షించని (demand) విషయములను మన కారోపించుటయును, మనలను నిందించుటయును, ప్రజలముందఱ మనల నొకవిధముగ హేళనముచేయుటయును, బుద్ధిమంతుని పని కాదు. నేనింతకంటె నేమిచెప్పఁగలను ? (ఆహ్లాదము, cheers). కనుక, మీకెవరికైన నట్టిపొరబాటైన యభిప్రాయము (misconception) ఉన్నయెడల, దానిని పోఁగొట్టుకొనవచ్చును. తుదకు నేను చెప్పునది సందర్భానుసారముగ consistent) సరిగానున్నదా అనిమాత్రము గమనింపుఁడు. ఇది తర్క-

శాస్త్రానుసారముగ నున్నది. అది చరిత్ర కనుకూలముగ నున్నది. రాజు అనఁగ అదృశ్యప్రభువు, లేక అదృశ్య ప్రభుత్వమని చెప్పితిని. ఇందేమియు నేరము లేదు. (మూలములో నిదిస్పష్టముగ లేదు.) మధ్య దేవతలున్నారు. అనేకపర్యాయములు దేవునకు కోపము రాదు; కారణము లేకయే యీ దేవతలకు కోపమువచ్చును. వారివిషయములో కొంత యొడంబడిక (settlement) జరుగవలయును. కాఁబట్టి, అట్టిపొరబా టభిప్రాయము మొద్దిదైన కలిగినయెడల అట్టిదానినితొలఁగించవలయును. నేనిది యిందు నిమిత్తము చెప్పితిని. ఇపుడు దానిస్వభావమును మీకు చెప్పెదను. దీనికి ముందుకూడ మనమట్టిపరిపాలనము జరుపుటకు తగియున్నామో లేదో అనుప్రశ్నను ఇంచుక ఆలోచింతము.

ఇంతకు పూర్వము పంచాయితినిగూర్చియు, వారిరక్షితుని (ward) గూర్చియు నుదాహరణము నిచ్చితిని. చిన్నవాఁడు పెద్దవాఁడగుచున్న కొలఁది యితరచేతులకు వ్యవహారనిర్వాహకత్వము పోఁగూడదనియెంచు వారు అనఁగా పంచాయితీవారు అతని తలతిరుగనారంభించినదని సామాన్యముగ నివేదింతురు (report); అతఁడు పిచ్చివాఁడు కాఁడుగాని, సగమున్మాదస్థితి (half-mad) యందున్నట్లగుపడుచున్నాఁడని మఱియొకఁడు చెప్పును. ఇంకను సంవత్సరద్వయము అయినను నిర్వాహకత్వము తన చేతులలో నుండవలయునని కోరుటయే యిందులకు కారణము. “వాస్తవమే, మీరధికారము నతని కీయవచ్చును; కాని, అతఁడు దుర్వ్యసనాసక్తుఁడని (bad habits) మీకు తెలియునా?” అని మూఁడవవాఁడనును. వీరతని విషయమై 5 లేక, 10 విషయములు (or లోపములు, or చాడీలు) చెప్పెదరు. ఇందుచే నేమిప్రయోజనము కలుగును? అంత ఈవివాదము న్యాయసభ కెక్కి అతఁడు పిచ్చివాఁడని తీర్మానింపఁబడును. ఇట్టివే కొన్ని యిచట నారంభించసాగివి. ప్రజలచేతులలో నధికారమిచ్చుట పరిపాలనయొక్క అత్యుత్తమధర్మము (best principle). దీని నెవరును కాదనరు. ఏలననఁగా, ఇచటనున్న యుద్యోగస్థుల దేశములో

నట్లే జరుగుచున్నది. వా రక్కడికి మరల వెళ్లినప్పు డాధర్మమునే కోరుదురు. కావున, నీచారిత్రమైన ధర్మము చెడ్డదని యెవరును అనరు. ఇంకేమిటిది చెడ్డది (or పనికిరానిది)? హిందూదేశీయు లీదినమున స్వరాజ్యము నకుఁ దగరనివారు స్పష్టముగఁ జెప్పుదురు: (హాసము, laughter). పంచతంత్రములోని ముగ్గురుదొంగల కథలోని దొంగలరీతిగా మనలో కొందఱున్నారు; ఆకథ యిట్లున్నది.

ఒకగ్రామస్థుఁ డొకగొఱ్ఱెనుమోచికొని పోవుచుండెను. నీనెత్తిమీఁద నొకయాఁడుమేక (she goat) యున్నది" అని ఒకదొంగ అనెను. "నీతలపైఁ నొకకుక్కయున్నది" అని రెండవ (దొంగ) వాఁడనెను. మూఁడవవాఁడు వేఱువిధముగ అనెను. అంత వాఁ డాగొఱ్ఱెను పాఱవైచెను (విడిచిపెట్టెను). దొంగలుదానిని హరించిరి. మనస్థితియు నట్లేయున్నది. ఇది మనుష్యస్వభావమునకు సంబంధించినది. వారిని పోలువారు మనలో కొందఱు *మనుష్యులున్నారు. మనమెందులకునుతగము? యోగ్యత (Fitness) మనయం దుదయింపజేయఁబడలేదు. మనవారు (అనఁగా మనతలిదండ్రులు) అట్లుచేసియుండలేదు. మనకుకూడ నట్టి అధికారములు లేవు. కాని, పరిపాలనాసభలో మీ కట్టియధికారమును దొరతనమువా రిచ్చినారు; సభ (కౌన్సిలు)లో సింహాగారును, చౌబలుగారు నున్నారు. ఇతరచోట్లనున్న పరిపాలనాసభ (Executive Council)లలోకూడ నెన్నుకొనఁబడిన (selected) వా రున్నారు. వీరిని ఉద్యోగమునకు ఏరి (selected) నప్పుడు "మేము తగము, మాకీయుద్యోగము నీయవలదు" అని యెవరైన అనిరా (లేకవ్రాసిరా)? అట్లెవరు అనలేదు (ఆహ్లాదము, cheers). మనసభ (మీటింగు) కువచ్చి అట్లనిన ఏమిప్రయోజనము? అధికారవర్గము (Bureaucracy) వారికీగొప్ప యధికారమునిచ్చినపిమ్మట వారు నిలవఁబడి "మాకవి యక్కఱలేదు. మేమందులకు తగము—బ్రాహ్మణులుమాత్రమేవచ్చి మాయిం

---

* ఈ అభిప్రాయముగలవారిని 'మితవాదులు' అనిచెప్పవచ్చును.

ష్టలో శ్రాద్ధములు పెట్టినయెడలను, 'మేమాపని చేయజాలము,'' అని అను
నెడల, వీరు నిజము మాటలాడుచున్నారని నేనెంచెదను. ఆయనకుఁగాని
యీయనకుఁగాని యేదో యొకపనివిషయములో నిష్టములేదను హేతు
వుచేత అట్టి ఆక్షేపణలను వెలువరించుచు తమ అసమర్థస్వభావమును
బయల్పఱచెదరని నేననుకొనియెదను. (ఆహ్లాదము, cheers). మనమేల
తగము? మనకు ముక్కు లేదా, కండ్లు లేవా, చెవులు లేవా, మెదడు (or
బుద్ధి) లేదా? మనము వ్రాయలేమా? మనము పుస్తకములను చదువలేదా?
మనము గుఱ్ఱము నెక్కి సవారి చేయలేమా? మనమెందులకు తగము? షేక్స్
పియరు* యొక్క యొకనాటకములో నొకయూధుఁడడిగినట్లు "మన కేమి
లేకున్నది?" అని నేనడిగెదను. 'మీరు పనిచేయలేరు.' మనకది యియ్యఁ
బడనియెడల మనమెప్పుడాపనిని చేయుదుము? (ఆహ్లాదము). మనకు పని
నిచ్చినప్పుడు మనము పనిచేయకుండుట యెన్నఁడైన సంభవించెనా?
'మేము తగము, మాకీయవద్దు' అని అప్పుడెవరును అనలేదు. వారిని మీరు
నియమించుచున్నారు; మీరు వారిచేత పనిచేయించుచున్నారు; పిమ్మట
నది దొరతనము (or సర్కారు) వారి తీర్మానములో ప్రచురపఱచఁబడు
చున్నది. (ఈమాటలు మూలములో నాంగ్లముననున్నవి — "అతఁడు తన
విధులను నెఱవేర్చినాఁడు-మున్నగునది.) "పైగా ఇందులకు ప్రత్యా
మ్నాయముగ (బదులు or వ్యతిరేకము) ఇట్లనుగ కలసియున్నది. "ఇం
గ్లాండునుండి 21 సంవత్సరముల వయసుగల క్రొత్త (చిన్న) వాని మీరు
తెచ్చెదరు. అతఁడేమిచేయఁగలుగును? అతని కేమైనననుభవమున్నదా?"
అతఁడు వచ్చినవెంటనే అసిస్టంటుకలెక్టరై 60 సంవత్సరములు వయసు
గలమమ్లతదారు †(Mamlatdar,or) 21 సంవత్సరముల కలెక్టరెక్కడ?
(మూలములో స్పష్టముగ లేదు. ఆహ్లాదము, cheers). 60 సంవత్సరముల
వయస్సుగల డిప్యూటికలెక్టరెక్కడ? ఈ 60 సంవత్సరములకు విలువ లేదా?

---

* ఆంగ్లమున నాటకములు వ్రాసిన గొప్పకవి.

† డిప్యూటికలెక్టరునకు పైయధికారి.

21 సంవత్సరములవయస్సుగలవాఁడువచ్చి మీాకుబోధింపనారంభించును. సామాన్యముగ అతఁడు 60 సంవత్సరముల వయస్సుగల మున్షీదారును తనయెదుట నిలుచుండునట్లుచేయును. అతనికి (మున్షీదారునకు) కూర్చుండుటకుఁగుర్చియైన నీయఁడు; ఆనిర్భాగ్యుఁడు (poor man) తన రు. 150 లేక, రు 200, లేక రు 400లను సంపాదించుకొనవలయును గనుక చేతులుజోడించుకొని నిలువఁబడును. (ఆశ్చర్యము). సాహేబు (అనఁగా అధికారి) అనుభవము నెట్లు సంపాదింపవలయును? ఎట్లు తగినవాఁడుకావలయును? అతనిపని (బండి) యెట్లు సాగవలెను? దీని నెవరైన నాలోచించినారా? హిందూదేశస్థులు స్వరాజ్యమున కనర్హులగుటయు, వారిరాజ్యములను సరియగుస్థితిలో నుంచుకొన జాలకుండుటయు నిజమైనయెడల పూర్వకాలమందు హిందువులును మహమ్మదీయులును ఈదేశమందు రాజ్యము లేలకుండెడివారే. పూర్వ మీాదేశమున మనరాజ్యములుండినవి; పరిపాలనాధురీణు లుండిరి. ఈదేశ మున కాంగ్లేయులు రాకపూర్వము కొంతవఱకైనను నెమ్మదియుండి యుండుటయు,ఎచటనైన తొందరలు (నెమ్మదికిభంగము, disordesr) యుండియుండుటయు నిందులకు నిదర్శనము. ఒకరినొకరు చంపలేదు. ఇట్టి నెమ్మది యుండినందున జను లధికారయోగ్యులు కారని యెట్లననగును? ప్రస్తుతము, కళలు (sciences) అభివృద్ధి నొందుచున్నవి. జ్ఞానము (knowledge) పెంపగుచున్నది. అనుభవ మొకచోట జేరుచున్నది. కావున, మునుపటికంటె నిపుడు మనకు స్వతంత్ర మెక్కువకావలయును. మనకు ఎక్కువయోగ్యతయు కలుగవలయును. కాని, దీనికి భిన్నముగా మనము తగ్గుటు; పూర్వకాలములలో నిది యెట్లుండినను, ఇట్టిసంగతి (allegation) యిప్పుడు శుద్ధఅబద్ధమై యున్నది. ఇచ్చుటకు వీలులేదని చెప్పుట అంతకంటె బాగుండును. నేను చెప్పిన దేమనఁగా మాకు "యోగ్యతలేదు" అనుమాటలను నర్తింపఁజేయకుఁడు. తుదకు, మాకు దాని నిశ్చయముగ ఈయరని తెలియును; మా కదిలభించును. కాని,

మీకేదేలభింపదు? మేమందులకుతగమని సూచనగాచెప్పిదరు. "మీకు బోధించుటకే మేమిచటికి వచ్చినారము" (అనెదరు); ఇది యొప్పిదమే (this is admitted) కాని, యెంతకాలము మీరు బోధించెదరు? (హాసము, laughter); ఒకతరమువఱకా, రెండు తరములవఱకా, మూఁడుతరములవఱకా? దీనికంతము లేదా? లేక, తుదవఱకు బానిసల వలె మీక్రిందపనిచేయువలయునా? (ఆహ్లాదము). ఏదో యొకహద్దు నేర్పఱచుఁడు, మీరు మాకుబోధింపవచ్చితిరి. మేమింటియొద్ద నొక బాలునినిమిత్త మొకయుపాధ్యాయుని ఏర్పఱచుకొనునపుడు పదిసంవత్స రములలోనా, 20 సంవత్సరములలోనా, లేక 30 సంవత్సరములలోనా యెన్ని సంవత్సరములలో బోధించెదరని ఆయన నడిగెదము. రెండు మాసములలో, 4 మాసములలో (మూలములో నీవాక్యమసంపూర్తి గనున్నది) అని యేర్పాటుచేసికొందుము. కాని, బాలుఁడాఱుమాస ములలో పూర్తిగా నేర్చుకొనుదానికి, మాకోరికకు భిన్నముగా అతఁడు ఉపాధ్యాయుఁడు ఒకసంవత్సరముపట్టు ననునెడల, నీవు పనికిరావు, వెళ్లుము; మేము మఱొకయుపాధ్యాయుని నియమింతుము అని మనము చెప్పుదుము. (ఆహ్లాదము.) పిమ్మట నీరీతిగా జనులపై — అందఱిపై (మూలమున నీవాక్యమసంపూర్తిగ నుండి యీక్రింది 6 పంక్తులు స్పష్టముకాకున్నవి.) ఈయధికారులు జనులచదువుపై నధికా రము గలిగి వారినభివృద్ధిలోనికిఁ దెచ్చుబాధ్యత (or విధి, duty) గలిగి యున్నారు. ఈవిధి (or బాధ్యత) యొకతట్టున నుండ వారు మఱియొక తట్టున బ్రయత్నించెదరు. వారెన్నిప్రయత్నములు చేసినను ఈపని కీప్రజలు తగియుండుట దుస్సాధ్యమని వారనెదరు. ఇట్టికుమాపణ లను అదృశ్యప్రభుత్వము నెదటనుంచుట (or చెప్పుట) ఒకని స్వవాంఛ (interests, జాగ్రత్త) నిమిత్తమగు వ్యాపారమని నేను తలంచెదను. ఇందు కొంతస్వలాభాపేక్ష (self interest) యుండునని యెవ్వరైన అభిప్రాయపడునెడల అది తప్పిదము కాదు. అది అట్లేలనుండవలయును?

వారును నీవంటిమనుష్యులే. నీవంటిబుద్ధిమంతులే. వారిని మీరు నవుకరిలోనుంచి వారివలన పనిగొనుచున్నారు; మీరు వారియెడల తక్కువ జాగ్రత్తగా నున్నారనికాదు. ఖాల్సారాష్ట్రమం దేమిజరుగుచున్నది? నిర్వాహకత్వమున (management) కెట్టి యభ్యంతరమును లేదు. మైసూరునం దభ్యంతరము కలుగుచున్నదా? పని నెవరుచేయుచున్నారు? మైసూరురాజు హిందువు, మంత్రి హిందువు. ప్రజలు హిందువులు, క్రింది అనఁగాదిన్నతరగతి యుద్యోగస్థులును హిందువులు. మీకు మైసూరువంటి గొప్పరాజ్యముయొక్క పరిపాలనమును జరుపుచున్నారు, కాని మైసూరు వెలుపలి రెండుజిల్లాలలోని ప్రజలు సైతము ఆవిధముగ పరిపాలన జరపలేరఁట; (హాసము, ఆహ్లాదము, laughter and cheers). మైసూరు రాజ్యములో 6 జిల్లాలున్నవి. కనుక ఆయు జిల్లాలు తగియున్నవనియు 8 జిల్లాలు తగవనియు అనునట్లున్నది. నిస్సందేహముగ మనము తగియున్నారము (ఆహ్లాదము, cheers) కాని, మీరేదో యొకకారణముచేత నొప్పుకొనవచ్చును, ఒప్పుకొనక పోవచ్చును. సరియే. మనము తగియున్నామనుకొనుట కేమియాధారము (or ప్రమాణము authority) ఉన్నది? నే నొక స్వదేశరాజ్యము నగపఱచెదను. (అనఁగా ప్రమాణముగ గ్రహించెదను). నే నింకొక సంగతిని చెప్పెదను. 10 సంవత్సరములు మీరు దూరముగనుండునెడల అదిజరుగగలుగునో లేదో చూడఁగలరు. (ఆహ్లాదము, హాసము cheers, laughter) అది జరుగనియెడల మమ్మును మీయధికారములో (లేక స్వాధీనములో (control) 10 సంవత్సరము లుంచుఁడు (ఆహ్లాదము). అట్లు చేయుటకు మీకు స్వతంత్రము కలదు. దీనినికూడ చేయరు. అందువలననే, హిందూదేశస్థులు పరిపాలన చేయుటకు తగరని చెప్పుటకు వారెల్లప్పుడును బానిసలుగ నుండవలయుననియును, బానిసలవలె వారిచేత పనిపాటులు చేయింపవలయుననియును, వారి బుద్ధిసామర్థ్యములు పెంపొందుమార్గముల నాపవలయుననియు ముఖ్యోద్దేశ్యములు (లేక ముఖ్యకారణములు

objects). (ఆహ్లాదము, cheers, shame, 'లజ్జాకరము') స్వరాజ్యము లేదు; స్వరాజ్యము లేదు. అనఁగా నేమి? మన మెద్ది కోరుచున్నాము? "ఆంగ్లేయ ప్రభుత్వమును వెడలగొట్టవలసినది" అని మన మందుమా? కాని, చక్రవర్తికి దానితో నేమిపనియున్నది అని నే నడిగెదను. సివిల్ ఉద్యోగస్థుఁడు (civil servant) పరిపాలించినను మన బెల్విసాహేబు (Belwi Sahab) పరిపాలించినను చక్రవర్తిగారి కేమైన నష్టమగునా? (ఆహ్లాదము). ప్రభుత్వ (rule) మట్లే జరుగుచుండును. చక్రవర్తియు అట్లే యుండును. భేద మేమనఁగా ఆయనతోనున్న తెల్ల నవుకరుకు బదులు నల్లనవుకరు ఏర్పడును. (ఆహ్లాదము). అయిన ఈయెదిరింపు (opposition) ఎవరివలన కలుగును? అధికారములో నున్నవారి వలన ఈయెదిరింపు కలుగుచున్నది. అది చక్రవర్తియొద్దనుండి రాదు. చక్రవర్తిగారి దృష్టిలో దీనియందు అరాజకముగాని, రాజభక్తిలేకుండుటగాని రాజద్రోహముగాని లేదు. "రాజద్రోహము" అన అర్థమేమి? రాజు సేవగించుట, 'రాజు' అనఁగా పోలీసుసిపాయి (or పోలీసుభటుఁడు) అను అర్థమగునా? (హాసము). నే నిదివఱకిట్టి భేదమును గమనింపవలసినదిగ చెప్పియున్నాను. కానియెడల, తేపు "ఈరక్షకభటుని, పోలీసుసిపాయిని తీసివేయుము" అనినచో రాజద్రోహ మగునా? రక్షకభటుల నమ్మక మట్టిదే. (హాసము). ఈవిధముననే, కొంచెము పైకిపోయినయెడల మన మపేక్షించునది (demand) సరియైనదనియు, క్రమమైనదనియు, న్యాయమైనదనియు, మనుష్యస్వభావమున కనుకూలమైనదనియు తోఁచును. ఇతరదేశీయులు (nations) నట్లే చేసిరి. మనదేశమునమాత్రమే అది జరుగలేదు. స్వరాజ్యము, స్వరాజ్యము,—అన నేమి? ఆంగ్లేయుల ప్రభుత్వమక్కఱలేదని కాదు. మొదటనే పొరబాటున్నది. దానిలో ఎవరికో కొంతయుద్దేశ్యము (object) ఉన్నది. మిమ్మును మోసపుచ్చుటవలన లాభమునొందఁగోరువా రిట్టివాదమును (argument) బయల్పఱచెదరు. వాని నేమియు లక్ష్యపెట్టవద్దు.

"మీరితరమనుష్యులవంటి మనుష్యులని మీరెంచునెడల, వారు ఇంగ్లాండునకు వెళ్లినపుడు వారి తెలివియును (intellect) వారును అచట పరీక్షింపఁబడుదురు. అందులో మన శ్రేష్ఠత్వము గన్పట్టును. అంత కంటె నేమగును? మీబుద్ధిమంచిది కావచ్చును, కాని, మీయందు సత్ప్రవర్తన (character), ధైర్యము, తదితరగుణములును వానిస్వభావము నుండవు. స్వభావాభావము (absence of nature) నొకగడియవఱకొప్పుకొనెదను. కాని, దానిని సంపాదించుట సాధ్యము కాదననొప్పను. (హాసము). నవుకరియందు మాత్రమే తమ జీవితమును (life) వినియోగపఱచిన వారిస్వభావమట్టిదెట్లగును? అతఁడు 25 సంవత్సరములు గుమాస్తాగా (clerk) పనిచేసి (సాహేబు) అధికారి గారి యుత్తర్వులను కాగితము (or కవరు) మీఁదవ్రాసి దానిపై సాహేబుగారిచేత చేవ్రాలు చేయించి 25, 40 సంవత్సరములకు పిమ్మట అలవాటు (habit, or అభ్యాసము) పడినాఁడనినను, అప్పటికిని ప్రథమమున పనిచేయుట అతనికి కష్టముగఁ దోఁచును; (మూలమున నిది స్పష్టముగ లేదు.) ఇది కాదనరాదు. కాని, అట్టిమనుష్యులే పద్ధతిప్రకారము పనిచేయుచున్నారో అట్టిపద్ధతి యదృశ్యమగునపుడు తర్వాతి తరము వారు (next generation) అయినను తగియుండుదురనుటకు వీలులేదు. కాఁబట్టి, మనము స్వరాజ్యార్హులమని నాయభిప్రాయము. మన మెద్ది కావలయునని కోరుదుమో, మనము దేని నపేక్షించెదమో అనుఅంశములను క్లుప్తముగ చెప్పి నాయుపన్యాసమును పూర్తిచేసెదను.

హిందూదేశపరిపాలన మెట్టిదో మీ రెఱుంగుదురు. కాని, మీ రెఱుఁగవలసిన దేమనఁగా నదియొక ముఖ్యమైన న్యాయశాస్త్రము ననుసరించి జరుగుచున్నదను విషయము. దాని విధులు (rules) నిర్ణీతములై యున్నవి. రాజకీయకార్యదర్శి స్టేటు సెక్రెటరిగారి అధికారము లేవి? గవర్నర్ జనరల్, రాజప్రతినిధిగారి యధికారము లెవ్వి? పద్ధతి (system) మూఁడుభాగములుగనున్నది. రాజకీయకార్యదర్శి యింగ్లాం

దునం దున్నాడు. గవర్నరుజనరల్ హిందూదేశమంచుఢిల్లిలోనున్నాఁడు. ఆయనక్రింద రాజధాని, రాష్ట్రము (Presidency) కొక గవర్న రున్నాఁడు. ఆయనక్రిందివారిని ప్రస్తుతము మానెదము, (or వేరొ-నము (omit). కాని ప్రధానపద్ధతి పైమూఁడువిధములుగ నున్నది. మన మొకొ-కరినిగూర్చి యాలోచింప నారంభించునెడల, రాజకీయకార్య దర్శి నెవరు నియమించుచున్నారు? మనము కాదు. కంపెనీ సంఘపు ప్రభుత్వధోరణి (policy) అనుసరించి యీయేర్పాటు జరిగినది. ఈదేశ ములో ఈస్టిండియాకంపెనీవారు రాజ్యముచేయునప్పుడు అన్నిపనులును వర్తకన్యాయము (commercial principle) అనుసరించి జరుగుచుండె డివి. కంపెనియొక్క భాగస్థులకు అధికలాభ మెట్లుకలుగు ననుసంశము నకే దృష్టియంతయు త్రిప్పఁబడినది. ఇప్పటి రాజకీయకార్యదర్శిస్థాన మందు కంపెనీయొక్క నిర్వాహకు లుండిరి. రాజ్యమునంతయు పరిపా లించుటకు, గుత్త, (కంట్రాక్టు contract) కీయఁబడినదని మీరు రన వచ్చును. పేష్వాలు రాజ్యముచేసినపుడు మమ్లత్‌దారు నుద్యోగములు గుత్తకీయఁబడినవి. అప్పటి రాజకీయశాస్త్రము ననుసరించి యీ హిందూదేశపరిపాలనము ఈస్టిండియా కంపెనీవారు చేసినవర్తకము వలె నున్నది. సాధ్యమైనంత లాభమును వారు రాబట్టుకొనుచుండిరి. కంపెనీయొక్క నిర్వాహకులు (directors) ఇంగ్లాండులో నుండవలసి వచ్చినది. నిర్వాహకులకు (directors) అనఁగా భాగస్థులకు (share-holders) లాభము నీయవలయునను నంశమునందే దృష్టిని నిలిపిరి. ఇక్కడ గవర్నరుజనరల్‌గారికిక్రిందివిధముగ నుత్తరము వచ్చెడిది; "మాకీసంవత్సర మింతలాభమును చెల్లింపవలయును. వసూలుచేసి మాకు పంపవలసినది." పరిపాలన మిట్టిదిగ నుండెను. ప్రజలక్షేమమునుగూర్చి ఆలోచింపఁబడలేదు. పాలవాఁడు వాని ఆవు రీతిగనుండెను. ఆవులు పాలీయకపోయినయెడల చాఁడుకుండనిండుగా నీరుపోసితీసికొనిరమ్మనును. ఆవిధముగనే హిందూదేశపరిపాలనము జరిగినది. తర్వాత, కొంతచర్చ జరిగిన పిదప అట్టిపరిపాలనము మంచిదికాదని తెలిసినది.

విక్టోరియాచక్రవర్తిని పార్లమెంటు (మహాజనసభ) పరిపాలనమును తమచేతులలోనికి తీసికొనినప్పుడు, ఈవర్తకపద్ధతిని వా రంగీకరింపలేదు. వారు దానినిగైకొనిరి,—ఇదియొకభాగము. పార్లమెంటువలన ఈ పరిపాలనము గైకొనఁబడినపు డుండినట్టి వర్తకధోరణి (policy) ననుసరించియే నిర్వాహకులు (directors) ఇంగ్లాండులో నుండుటయును, వారి నౌకర్లు ఇక్కడ నుండుటయును కలిగెనో ఆవిధానమున కనుకూలముగనే యీపరిపాలనాపద్ధతి యేర్పాటయినది. నిర్వాహకులస్థానమందు రాజకీయకార్యదర్శియును వారి (నిర్వాహకుల) గవర్నరుస్థానమందు గవర్నరుజనరలును యేర్పడిరి. ఇట్లైనదేమి? ప్రభువు-(పార్లమెంటు)—పరిపాలనమును వారిస్వాధీనమునకుంచికొనిరి, కాని, నవుకర్ల నేర్పఱుచు నధికారము (Establishmenst of employees) అంతకుపూర్వమున్నస్థితియందే యున్నది. ఇది ౧౮౫౮ సంవత్సరములో సిపాయీలకలహానంతరము (after the Mutiny) జరిగినది. నాఁటి నుండి నేటివఱకు కంపెనీవారిధోరణి (policy) ప్రకారమేర్పడినవిధులు, విధానముల ననుసరించియే హిందూదేశపరిపాలనము జరుగుచున్నది. అది నిజముగా రాజుగారియెదుటకుఁ వెళ్లనున్నయెడల....(ఈవాక్యము మూలములో పూర్తిగలేదు.) రాజున్నందునకంపెనీయొక్క యీస్వభావమంతరించియుండవలసినది. ఆయనరాజు, మన మాయనయొక్క ప్రజలము; ప్రజలక్షేమమునకై రాజ్యముచేయుట ఆయనవిధి. (Duty). ఆవిధిలోచేరతగున్యాయశాస్త్రీయమగు—విధుల ననుసరించి యొకయేర్పాటు జరుగవలయును. కాని, యేర్పాటీవిధముగ జరిగినది—నిర్వాహకులు పోయి వారిస్థానమందు రాజకీయకార్యదర్శి యేర్పడినాఁడు. హిందూదేశమం దెంతసొమ్ము వ్యయపడవలయునో యెట్టిపన్నులను విధింపవలయునో యెవరు నిర్ణయింపవలయును? రాజకీయకార్యదర్శి. గవర్నరుజనరల్‌గారిచేతులలో అట్టియధికారములేదు. ఆయనయే ముఖ్యోద్యోగి; గవర్నరులు ఆయనక్రిందివారు. ఆయన నౌకరు. ఆయనక్రింద నితర

నవుకర్లున్నారు. రాజకీయకార్యదర్శియొక్క అంగీకారముతోడను, ఆయనయొక్క ఆలోచనతోడను, సలహాతోడను, పరిపాలనమంతయు జరగవలసియున్నది. ఇప్పటిపద్ధతి (policy) యిట్టిదే, అంతటితో నేమియైనది? (or ఏమిసంభవించినది, what happened then?). క్రమముగా మూలములో నీవాక్యము పూర్తిగా లేదు.) ఇదివర్తకపద్ధతి (commercial policy) మాత్రమే. పరిపాలనము చక్రవర్తిగారి రాజ్యముయొక్క చేతికి పోయినను, వారు గొప్పప్రకటనము (great Proclamation) ను ప్రకటించినను రాజధోరణి (sovereign's policy) (మాత్రము) ఆప్రకటనము ననుసరింపలేదు, రాజధోరణి (sovereign's policy) పద్ధతికంపెనీయొక్క వర్తకపద్ధతి ననుసరించియున్నది; కంపెనీపద్ధతి ననుసరించి రాజ్యపరిపాలనయున్నది. ఈలోపుగ (చక్రవర్తినిగారి) ప్రకటనము (proclamation) యొక్క ప్రయోజనమేమియు లేదు. (హాసము, ఆహ్లాదము). ఏర్పాటట్టిదిగ నున్నది. అప్పుడు మనజను లది తెలిసికొనలేదు. ఇప్పుడున్నంతఅధికముగ విద్యాభివృద్ధి అప్పుడున్నయెడల, రాజ్యభారమును చక్రవర్తిని స్వీకరించినందున ప్రభువునకును ప్రజలకును సంబంధించినంతవఱకు ప్రజాక్షేమముకొఱకే రాజ్యపరిపాలనము జరుగవలయు నని జనులు వాదించియుందురని నేననుకొనెదను.

కంపెనివారు తమ (కంపెనివారి) స్వలాభము నిమిత్తమేర్పాటు చేసియుండిరనియును ఆవిధానము:—(ఆయేర్పాటు)—నందు మార్పు జరగవలయుననియు మనవారు చెప్పియుందురు. చాలసంవత్సరములవఱకు జను లీవిధముగ వాదించిరి. సంగ్రహముగచెప్పుచో ఇపుడు జీవించియున్నట్టియును, ఈయేర్పాటును పరిశీలించినట్టియును, దానిలోని లోపములను కనఁబఱచినట్టియును శ్రీ దాదాభాయినౌరోజిగారు (ఆహ్లాదము) ఈపని నారంభించిరి. ఆయన ఏవిధముగ నారంభించెను? "కంపెనీవారి పద్ధతి (system) కిని ఈ ప్రస్తుతపు పద్ధతికి భేదమేమి? అదేమియు మనకగపడదు. కంపెనీవారిపద్ధతిప్రకారము విధులు (rules) ఏర్పడినవి.

వానివలన ప్రజల కేమైన లాభముకలుగుట కవకాశమున్నదా ? " అని ఆయన అనెను. అంతట శాసననిర్మాణసభ లేర్పడినవి. వానివలన మన లను గవర్నరుజనరలుగారు నియమించవలసినచ్చెను. ప్రథమమున మెం బర్లను (members, ప్రతినిధులను) జనులెన్నుకొనుటకు లేదు. క్రమ ముగా మీవారు మ్యునిసిపాలిటీ, పురపారిశుధ్యసంఘములో మెంబర్లు ప్రతినిధులుగ నెన్నుకొనఁబడి శాసననిర్మాణసభలోని కెన్నుకొనఁ బడిరి. కాని ఇప్పటికిని బీగములు సర్కారువారి చేతులలోనే యున్నవి. శాసనసభలో చర్చింపవచ్చును. చర్చించుటకు మీకు పూర్ణమగు స్వాతంత్ర్యమున్నది. ఈదేశములో ద్రవ్యమును వ్యయప ఱచుటకు మీరు చర్చింపవచ్చును. అట్లు వ్యయపఱచవచ్చునో లేదో మనము స్థిరపఱచవచ్చును. మీవాక్కును మీమనసును సాధ్యమైనంత కష్టపెట్టుటకు మీకేమియు నాక్షేపములేదు. రాత్రియంతయు మేలు కొని మీయుపన్యాసములను సిద్ధముచేయుఁడు. వార్తాపత్రికలో నచ్చు వేయుటకంటె మేము "బొంబాయి గవర్నమెంటు గెజెట్"లో ప్రచు రించెదము. ఇదియేభేదము. ఇందువలన ప్రయోజనము, లాభము ఏమియులేదు. లాభించునను ఆశ కనఁబడును. 'ఆశ (hope) కాలము ననుసరించియుండవలయు'నని మహాభారతములో నొకశ్లోక మున్నది. మీకట్టియోగ్యత కలిగినప్పుడు మీకు హక్కు, అధికారము లీయఁబ డును. మేముహిందూదేశములో నుండుటకు మాకిష్టములేదు. మీరు తగియున్నప్పుడు, మోపు (bundle) ను మీస్వాధీనపఱచి ఆంగ్లేయ ధూమనౌక(స్టీమరు,English steamer) మీఁద నింగ్లండునకేఁగెదము. (అహ్లాదము). అట్టికాలనియతి (time limit) యేర్పడవలయును." మేము రెండుసంవత్సరములలో నిచ్చెదము ;" "మేము పదిసంవత్సరములలో నిచ్చెదము" విమ్మట నట్టి తరుణము తటస్థించెను. "కాలనిర్ణయముతో కొన్ని అభ్యంతరములను చేర్పవలయును" (coupled). పదిసంవత్సరము లనిచెప్పిరి. ఇట్టి దినములు గడచినవి; విసుగుపుట్టించినవి. వానిని

15 సంవత్సరములు మనము చేయవలసివచ్చెను. "ఆశయును, కాలమును, ఒకఅభ్యంతరముతో జతపఱచవలయును" (coupled). అట్టి అభ్యంతరము తటస్థించెను. మీయుంతట మీరే అట్టిదానిని అభ్యంతరమును కలిగించితిరి. మేము కలిగించినదికాదు. మేము మంచికాలమును నిరీక్షించుచుంటిమి. దానితో నొకక్షమాపణను జేర్పవలయును. క్షమాపణవచ్చినది. అదికూడ నెటుల వచ్చినది? అది క్షమాపణ గనుక దానివిషయములో నేమియు అనఁగూడదు. దానికి ప్రత్యేక మొకకారణమునగుపఱచవలయును. ఇది యొకవిధముగు రాజ్యధోరణి (policy). ఇచ్చుటకు మీకిష్టము లేనపుడు మీరెట్లుమాటలాడుదురు? నీతినిఁగూర్చియు రాజకీయవ్యవహారముల (or రాజనీతి, politics) ను గూర్చియు వ్రాయబడిన ఆధునికగ్రంథములలో నిట్టిది వ్రాయఁబడె ననుటకు వలనుకాదు. ప్రాతపురాణముమాత్రమే సాగినది (only the old tradition continued). ఇట్లు అధికారవర్గముతో (bureaucracy) మనలనూఱడించుచున్నారు, (cajoling ఊరించు). గతించిన 5 లేక, 50 సంవత్సరములు రాజకీయకార్యదర్శియును గవర్నరుజనరలును ఈవిధముగ మనల నూఱడించు (or మోసపుచ్చు cajoling) చున్నారు. మనలను తేల్చివేసిరి (kept us afloat); మీరు కొంచెము గడబిడచేయనారంభించినవెంటనే, 5 గురుసభ్యులున్నారఁట; రేపు వారి నాలుగురుగ చేయుదురట. వారిసంఖ్యను అయిదిటినుండి ఆఱింటికి హెచ్చించిన మనకేమి ప్రయోజనము (or లాభము, benefit)? మనలో నొకరచట కొన్నిరోజులు కాలము వ్యర్థపుచ్చుటమాత్రమే యగును. (ఆహ్లాదము) ఇంతకంటె నేమియుప్రయోజనము లేదు. ఆఱింటికి మీరాక్షేపించునెడల (if you object six) వారి నెనమండ్రుగ చేయుదు మనెదరు. అవసరమైన మన 10 ని 12 కి హెచ్చించవచ్చును. (హాసము, ఆహ్లాదము). ఈవిషయ మీవిధముగ ఫయిసలు (ముగింపు, dispose of) చేయకూడదని ప్రజ లిదివఱకే నమ్ముచున్నారు. మీయధికారము

లెంతగొప్పవయునను,మాకుమీకీయనున్న అధికారములు (or హక్కులు, rights) అన్నిటిని మాకు సంపూర్ణముగ (absolutely) ఇచ్చి వేయుడు. విద్యాధికారశాఖను (educational department) ఆలోచించు నెడల పెక్కండ్రు తాబేదారినవుకర్లు (subordinate servants) మన లోనివారే అయియున్నారు. మొదట (లేక అగ్రమున, head) నొక ఆంగ్లేయుడగు అధికారి యున్నాడు. అతని నేల అచటనుంచినారు? వారివాక్కును వారి తెలివి (లేక బుద్ధిని) నిర్బంధించు నిమిత్తమే. 20 సంవత్సరములు నవుకరిచేసిన నిర్భాగ్యుడు సైతము ఆంగ్లేయోద్యోగిలేనిది పనిజరుగదని ఆరంభించును. అట్టివారిని తరిఫీయుతు (or తయారు prepare) చేయవలయును. బహిరంగము కాకున్నను ప్రస్తుతపు పరిపాలనావిధానముయొక్క రహస్యోద్దేశము (inward object) ఇదియే. వీనిలోనే భేదములను చూడనగును.

ఇచట నీస్థలముపై నొకయుద్యానము (or తోట)ను సిద్ధము చేయుమని తోటమాలితో చెప్పినప్పుడు, పుష్పఘటములు (or పూవు లకుండలు, flower pots) కావలయునని చెప్పును. అట్లుపీక శాఖవారి (Forest Department) యాజమాన్యముక్రింద పెద్దయడవులను తయారుచేయించునపుడు కుండ లవసరముండవు విత్తనముల బస్తాలను తెచ్చి కుమ్మరించెదరు. ఎక్కడబట్టిన నక్కడ చెట్లు చాల పెరుగును. కొన్ని పెద్దవిగను, కొన్నిచిన్నవిగను పెరుగును. ప్రస్తుతపు ఏర్పాటట్లున్నది. ఈయేర్పాటువలననే మనచెట్లు పెరుగకున్నవి. ఇంతేకాదు కుండలలో నాటినచెట్లు (మొక్కలు) అందముగ గనుపట్టునట్లును, వాని పుష్పములను చేతితో గోయుటకు వీలగునట్లును జాగ్రత్తపుచ్చుకొందురు. అట్టి అందమగుచెట్లు పెరుగునట్లే అతనికి విద్య అబ్బును. (ఇది మూలములో తేటగలేదు). ఈవిధముగనే అతనిం గనిపెట్టి (treated) అతనివలన పనిగొనియెదరు. (or పనిచేయించెదరు). అంతట 25 లేక, 30 సంవత్సరములు జరిగినపిమ్మట "నేనీపనికి నిజముగ పనికిరాను" అని అత

డనుకొనును. ఈపద్ధతి మనకు పనికిరాదు, ఆంగ్లేయప్రభుత్వముమనకు కావలయును. ఈప్రభుత్వమునీడను (ఛత్రముక్రింద) మనము నిలువ వలయును. కాని, అల్లునివలె నేర్పడిన రాజకీయకార్యదర్శి మనకక్కఱ లేదు. (ఆహ్లాదము). తుదకు, ఆయన సభలోని మనుష్యుల (or సభ్యుల) నైనను మనమెన్నుకొనవలయును. చేయువలసిన సంస్కారణములలో నిది యే మొదటిది. అవ్విధమునసే హిందూదేశముయొక్క ద్రవ్యము నెవరు ఖర్చు పెట్టవలయునో, అంతేఁ ఔంతద్రవ్యమును వసూలుచేయవలయునో, అతడెన్నిపన్నుల విధింపవలయునో అనువిషయములు మనయభిప్రాయ ప్రకారము తీర్మానింపఁబడవలయును. (ఆహ్లాదము). ఆపన్నులుండఁగూడ దని మన మనెదము. "వ్యయపఱచుటకు (or ఖర్చులకు ద్రవ్య మేది?" అని వారనెదరు, అది తర్వాత నాలోచింతము. మనయొద్ద నుండుద్రవ్య మునుబట్టి ఖర్చుపెట్టవలయుననియును ఖర్చుఅయినదానినిబట్టి ద్రవ్య మును వసూలుచేయవలయుననియును, మన మెఱుంగుదుము. మనకిది తెలియును. ఎట్టియేర్పాటు జరుగవలయునో పిమ్మట చూడవచ్చును.

ఈ (పైనిచెప్పిన) యధికారములు ప్రజలచేతులలో మంచివారిచే తులలో అనఁగా, ప్రజలచే నెన్నుకొనఁబడినవారిచేతులలోనుండవలయు ననునది హోమురూలు (స్వరాజ్యము) యొక్క రెండవసూత్రము. ప్రస్తు తమంత గొప్పయుద్ధము ఐరోపా దేశమందు జరుగుచున్నది. యుద్ధమున కెంతద్రవ్యమును వినియోగపఱచ(or ఖర్చు) పెట్టవలసినదియు చక్రవర్తి గారు తీర్మానించరు. ఆస్క్విత్ మంత్రిగారు తీర్మానింతురు. ఆస్క్విత్ గారు చేయుపనిలో లోపము లున్నయెడల నదిపార్లమెంటునకు చేరును (అనఁగ పార్లమెంటువారు విచారింతురు;) ఆస్క్విత్ దొరగారు తప్పు చేసినయెడల ఆయనఆపదవిని (ఉద్యోగమును) వదలుకొనవలయును. ఆయన తనయుద్యోగమును మానుకొనునెడల అదిరాజద్రోహమగునా? ఏర్పాటులలో భేదమున్నది. పద్ధతుల(organisation) లో భేదమున్నది. విధానము (system) లలో భేదమున్నది. విధానమందట్టిమార్పు కావల

యునని కోరుచున్నాము. ప్రభుత్వము పడిపోవును, ప్రభుత్వము నశించును—ఇట్టియూహలు మనకు బొత్తుగా లాతివి (foreign) అనఁగా (సహజమైనవి కావు). అవి మనహద్దులలోనికి, మనసమీపమునకు మన దృష్టికి (view) రానేరవు. మనము దానిని అభిలషింపము. మన ప్రజలకు సుఖము లభించుటకును, ఇప్పుడున్న వేలకొలఁది లోపములు (complaints) తొలఁగిపోవుటకును ఈపరిపాలనావిధానము మాఱవలయును అని నేను మరల నుడువుచున్నాఁడను. "గుఱ్ఱమెందువలన నిలుచున్నది? తమలపాకు లెందుచే కుళ్లినవి? రొట్టె దేనిచే కాల లేదు?" అని మహారాష్ట్రభాషలో నొకసామెత యున్నది. "తిరుగకుండుటవలన, ఆకులను తిరగ వేయనందున, రొట్టెను తిరగ వేయనందున" "గుఱ్ఱమును త్రిప్పినయెడల నది నిలబడకుండునది" అనునదొకటియే దానికి ప్రత్యుత్తరము. దానికిమూల మేమన, మన చేతులలో అధికారము లేనందున నే యని తెలియఁదగును.

అడవులనుగూర్చిన లోపములును మత్తుపదార్థములనుగూర్చిన లోపములును, కులకరణివతనులనుగూర్చిన లోపములును కలిగియున్నవి. స్వల్పముగ మాటలను మార్చి చెప్పునెడల—మనకు "స్వరాజ్యము" లేనందున కలిగినవి. (ఆహ్లాదము). మనకు స్వరాజ్యము లభింపవలయుననునదియే దానిమూలము. అంతట మన మొకరియిష్టప్రకారము ఆడ (dance) నక్కఱలేదు. స్వరాజ్యములో సైత మిదిసంభవింపవచ్చును; నేను కాదనను. మనకు ద్రవ్యము తక్కువై అధికారము మీచేతులలోనికి వచ్చినప్పుడు మీరుపన్నులను వృద్ధిచేయుదురు. పూర్తిగామీయిష్టము మీదనే దానిని వృద్ధిచేయుదురు లేనియెడల ఖర్చులకు ద్రవ్య మెట్లు సమకూరును? కాని, జనుల యిష్టమును బట్టి అది వృద్ధిచేయఁబడును? గనుక, అది మనమనస్సునకుకష్టముగ నుండదు. మనమీద్వారముగుండ నడుచుచుండఁగా ఈద్వారముగుండ నడవకూడదనియును, ఆద్వారముగుండ నడువవలెననియును, విద్యాధికులగు పరాయివారు (aliens)

మనకు చెప్పుదురు; కాని, ఎవరైనను వచ్చి అచట నిలువఁబడి దానిగుండ వెళ్లవలదని చెప్పనారంభించునెడల, అప్పుడు మన మతనిని గెంటివేసి బయటికి వెళ్లవచ్చును. స్వరాజ్యముయొక్క స్థితియు నట్టిదే. ఇది నిరంకుశాధికారవర్గముయొక్క అభ్యంతరమే. అట్టి అభ్యంతరము మనకక్కఱలేదు. రాజద్రోహముతో నెట్టిసంబంధమును లేనిదే స్వరాజ్యకాంక్ష (demand) అనునది. అదృశ్య ప్రభుత్వముతో కూడ దానికేమియు సంబంధము లేదు. నీయింటిపెత్తనమును నీకుంతట నీవే చేయువలయును; అట్లుచేసినయెడల ప్రథమమున నీకు మనశ్శాంతికలుగును. నీవుచేయవలసినదంతయు నీమేలుకొఱకే నీవుచేయుచున్నావను నుద్దేశముతో చేయుదువు. ఇంతియకాదు. నీవు వ్యయమునుకూడ తగ్గించెదవు. ఏస్వదేశసంస్థానములలో (native states) నైనను కలెక్టరు 25 వందల రూపాయలజీతమును సంపాదింపడని నేననుకొనను. కలెక్టరు పనిచేయునతఁడు యింత హెచ్చుజీతమును సంపాదించుదేశ మీప్రపంచమందెచటనైన నున్నయెడల నట్టిది హిందూదేశమే. (అహ్లాదము). పూర్వప్రభుత్వములో కలెక్టరునకు 2500 రూపాయలు జీతమునిచ్చుట యనునది సంవత్సరమునకు 30,000 రూపాయల జాగీరు నిచ్చుటవంటిదే యగును. మన స్వరాజ్యకాలమందు 30,000 రూపాయల జాగీరువంటి దెప్పుడైన నియ్యఁబడెనా? 30,000 రూపాయిలు స్వల్పమొత్తముకాదు. దానికి కారణము లున్నవి. ఏకారణమును చెప్పెదరు? ప్రతివిషయమునకును ఏదోయొకకారణ ముండునని గ్రహింపుఁడు. ఇతఁడు ఇంగ్లండులో తనపిల్లలు మొదలగువారికి 2500 రూపాయలు పంపవలయును. వీరాక్షేమముకొఱకు శీతలదేశమునుండి ఉష్ణదేశమునకు వారువచ్చి వారి ఆరోగ్యమును చెడగొట్టుకొందురు. కనుక నట్టివారికి జీతమీయఁగూడదా? వారలంత శ్రమపడి, స్వార్థత్యాగులై అనేకకష్టముల ననుభవించుచున్నారు. అట్టివారికి మీరు ద్రవ్యమీయరు? మొట్టమొదట ఇది వినునప్పుడు న్యాయ్యమని కనఁబడును (or తోఁచును) కాని, యిప్పటి

ముఖ్యప్రశ్న యేమనఁగా, అచ్చటినుండి యిచ్చటికి రావలసినదిగా నెవరు చెప్పిరి ? (ఆహ్లాదము). మనము రమ్మనలేదు. నీకుతగినపనిని నీవుచేయుదువు. నీకున్నంతసమర్థత మాకునుగూడ నున్నది కాని, మేము తక్కువ జీతమునకే ఆపనిని చేయఁగలము. మనుష్యులు దొరకుదురు. కావున అంతజీత మతనికేల యీయవలయును? అది మాకవసరము లేదు. విద్యనిమిత్తము ద్రవ్యము లేదని మన మనుకొనెదము. ప్రజోపయోగములగుపనుల (works of public utility) ను చేయువిషయములో చెప్పఁబడు "ద్రవ్యము లేదు" అనుక్షమాపణ (or మిష, excuse) ప్రథమముననంతర్ధాన మగును. ఇప్పటివలెనే నిరభ్యంతరముగ పనిజరుగును. ప్రథమమున అంతనిరభ్యంతరముగ జరుగకపోవును. ఒకవేళ, రూపాయికొక అణాచొప్పున తక్కువగనుండవచ్చును. ఐనను, పనిని ప్రజలు నెఱవేర్చిరి. అనెడి మంచి యభిప్రాయము యొక్కవిలువ హెచ్చును. ఈవిధముగ నిందులో(or ఈ పరిపాలనములో)మంచినిర్వాహకత్వము (management) కోరఁబడును. ప్రస్తుతపు శాసనము (లేకచట్టము, law) నందు సవరణ చేయవలసియుండును; అది పార్లమెంటుద్వారా జరుగును. మన మిత్రుల ద్వారా కోరము. ఈ కాంక్ష నెఱవేఱుటకు మనము పరాసుల (ఫ్రాన్సు, France) దేశమునకు అర్జీలను పంపుకొననక్కఱలేదు. అక్కడ మిత్రమండలియుండుఁగాక ; మనము వారిని ప్రార్థించుపడ నవసరము లేదు. ఆంగ్లేయులకును, ఆంగ్లేయుల పార్లమెంటు(మహాజనసభ)కును మనవిచేసికొనవలయును. ఈస్థితిగతులను వారియెదుట పెట్టవలయును. ఇందులకవసరమగుదానినెల్ల మనము చేయవలయును. ౫ లేక, 25 సంవత్సరములు మీరట్లు చేసిన యెడల అందలిఫలము ననుభవింపకపోరు. మఱియు, (more over) హిందూదేశముయొక్కయు, హిందూదేశీయుల ధైర్యముయొక్కయు, హిందూదేశీయుల సాహసముయొక్కయు (లేక పరాక్రమముయొక్కయు) హిందూదేశీయుల స్థైర్యము (stability) యొక్కయు, విలువను వృద్ధిచేయగలట్టి ప్రయత్నము చేయవలసినకాల మిప్పుడు

జరుగుచున్న యుద్ధమువలన నాసన్నమైనది. ఇట్టి ప్రయత్నమును వారం తటవారే చేయుచున్నారని దొరతనమువారికి తెలిసినయెడల మన కాంత్య (demand) ఫలరూపమును దాల్చునుటకు ఆశ (hope) యున్నది. కావున, ముఖ్యముగ ఈవిషయమును మీయెదుట నుంచితిని. ఇతరప్రదేశములందుకూడ నీవిషయము చర్చింపఁబడుచున్నది. ఇందు నిమిత్తము మనము స్థాపించినసంఘము (league) మూలమున ఈపనిజరుగుటకై నేఁడుకాకున్నను కొన్నిదినములతర్వాతనైనను నేనుగాని, మఱొకరుగాని, యీవిషయమును మీయెదుట నుంచుట కవకాశము కలుగును. మీరీవిషయము నెల్లప్పుడును చర్చింపుచు, దానినిగూర్చి సదా ఆలోచింపుచు, దానిప్రయోజనమును తెలిసికొనుచు, నిందు రాజభక్తి యెంత యున్నదో రాజద్రోహము (disloyalty) రాజభక్తిలేకుండుటే యెంత యున్నదో జాగ్రత్తగ ఆలోచింపుఁడు. ప్రస్తుతము నేనుచెప్పిన దిదియే. ఇంతకంటె నేను చెప్పఁదగినది హెచ్చుగనుండినను, దాని పర్యవసానమును (substance) సంగ్రహముగ చెప్పినాఁడను.

మహారాష్ట్రదేశములోను, హిందూదేశములోను మీరీవిషయము నాలోచింపనారంభించినయెడల నొకప్పుడు గాకున్న మఱొకప్పుడిది జయప్రదమగును. ఇది భగవంతుని చేతులలోనే యుండినప్పటికి కూడ అది యవసరమే. అది మనచేతులలో లేదని నేనొప్పుకొనుచున్నాను. కాని, యీప్రపంచములో కర్మసాఫల్యము (effect) నొందక తప్పిపోనేరదు.

నేను చెప్పినంతత్వరలో కర్మసాఫల్యము కాకపోవచ్చును; నాకనుల యెదుట నది సిద్ధింపకపోవచ్చును; బహుశః నేనందలిలాభము నొందకపోవచ్చును. కాని, యీకర్మకు ఫలితముండితీరవలయును. (ఆహ్లాదము). కర్మశాస్త్రప్రకార మొకకార్యము జరిగినప్పుడు దానివలన మఱొకఫలితము (results) కలుగును. అందువలన వేఱొకఫలము సిద్ధించును. ఇట్టివి పరంపరగా (or వరుసగ, in succession, ఒకదానివెంట నొకటి)

కలుగును. కాలముపట్టును, ఆలస్య మగును. కాని, మనకనులయెందు టనే మోక్షమగఁపడవలయునని మనము కోరుదుమా ? మోక్షమనఁగా దేహమునుండి జీవుఁడు ముక్తుఁడగుట స్వేచ్ఛగ (or బయలువెడలుట) ఒకానొకమనుష్యుని చేతులనుండి మన కదికావలయు నను నభిప్రాయ ముతో మనము దానిని గోరుచుంటిమా ? ఇప్పుడే మన కాన్ఫరెన్సు (సభ) లో మితవాదులు జాతీయవాదులు అనుకక్షు లుండఁగూడదని తీర్మానింపఁబడెను కదా. అనఁగా యెవరికి స్వరాజ్యమిచ్చిన నొకటియే (or మనకిష్టమే), రేపు మీసిపాయికి (భటునకు) అధికార మీయఁబడు నెడల నాకాక్షేపము లేదు. ఆభటుఁ డట్టిగొప్పయధికారముల నెట్లుచలా యింపఁగలుగు నని మీరనవచ్చును. ఎప్పుడైన నాభటుఁడు చనిపోవును. పిమ్మట, మనము చూడ (ఆలోచింప) వచ్చును. (ఆహ్లాదము). మన మధి కారముల (or హక్కులను, rights) గాంక్షించుచున్నాము. మన శ్రేయ స్కర మగు (or సౌఖ్యకరమగు) నొక విధానము నపేక్షించుచున్నాము. అది మనకు లభించును. (లేనిచో) అది మన సంతతివారికి లభించును. చేయఁదగుప్రయత్నమును చేయుఁడు. ఇది మీస్వంతకార్యముగ నాలో చించుచు దీనినిచేయుటకు సిద్ధపడుఁడు. మీజీవితకాలములో అదిలభ్య ముకాకుండినను, భగవదనుగ్రహమువలన మీతర్వాతితరములో (next generation) నైన అది తప్పక సిద్ధించును. (ఆహ్లాదము).

---

1916 సం॥ మే నెల తే 31 ది అహమద్‌నగరమున లోకమాన్య

## బాలగంగాధరతిలకుగారి ప్రథమోపన్యాసము.

మహాజనులారా! మీతో కొన్నిమాటలు ముచ్చటించుటకు పూ ర్వము మీకు అనేకనమస్కారము లాచరించుచున్నాఁడను. నన్నిచటికి ఆహ్వానముచేసి గౌరవించినందులకును, నాకు మీరొసంగిన స్వాగతము

నకును (address), మీకు వందనములు సమర్పించెద. నన్ను గౌరవించుటయందు మీయుద్దేశ్య మేమియుండినను, మీతో నేను చెప్పవలసిన కొన్నిసంగతులు నానిరంతరకృషియొక్క (my work) విషయమై యుండును. ఈసంగతి మీకు మిక్కిలి ఆశ్చర్యముగా తోఁచవచ్చును. మీరు నన్ను ఇచటికి ఆహ్వానించితిరి. అట్టి విషయములో మీయెదుట నేను నాకార్యమును గుఱించిచెప్పినయెడల అది ఒకవిధమైన అనౌచిత్యమని (impropriety) మీకు తోఁచును. "తిలకువచ్చి తనవిషయములనుగూర్చియే యుపన్యసించి" రని మీకు తోఁచినప్పటికిని, నేను చెప్పఁబోవు విషయములు నాకు ఎంత లాభకారియో మీకు నంతంతలాభకారియే యగుటవలన యీస్థలమం దట్టిసంగతులు ముచ్చటించుటకు నేను ఎంత మాత్రమును వెనుదీయను.

మనదేశముయొక్క స్థితినిఁగూర్చి యింతవఱకును అనేకస్థలములలో అనేకవిధములుగా చర్చలును వివాదములును జరుగుచువచ్చినవి. మొత్తముమీఁద ప్రజలకు ఏదిలాభకారి? (beneficial). అనేకవస్తువులు లాభకరములు. పరలోకవిషయము బోధించుమతము లాభకారి. ఈవిధముగానే నీతియు లాభకారియే. ఎవరి జీవనోపాధినిగూర్చి వారు జాగ్రత్తపడుటలాభకరము. వర్తకముఅభివృద్ధిచెందవలయును. జనసంఖ్య వృద్ధిపొందవలయు. (plenty) సమృద్ధి యుండవలయును. అదియంతయు సురక్షితముగా మనచేతులలో నుండవలయును;—ఇట్టి కోరికలను మనుష్యులందఱును కోరుచుందురు. నాకొసంగఁబడిన కొద్దికాలములో నీవిషయములన్నిటిని చర్చించుటకు నాకు వీలుపడదు. కనుక పైవిషయములో ముఖ్యమైనవియు, ముఖ్యమని వేనవేలుజనులచే నెన్నఁబడుచున్నవియు నగు కొన్నివిషయములనుగూర్చి మీకు కొన్నిమాటలు చెప్పెదను. మఱియు, ఇప్పు డెల్లప్రదేశములలో చర్చింపఁబడుచున్న ఒకవిషయమునుగూర్చియే చెప్పెదను ఇదియే స్వరాజ్యవిషయము. (ఆహ్లాదము) మనగృహకృత్యములను మనయింటియొద్దఅధికారముతో (authoratati-

vely) నెఱవేర్చుకొనఁగలము. ఇతరులకు సంబంధములేని (private) ఒకానొక కార్యము నేను చేయఁగోరినయెడల ఆవిషయమై నేను ఒకరి నడుగవలసినపనిలేదు; ఒకరి అనుజ్ఞను పొందవలసినయవసరము లేదు; మఱియు, ఒకరి సలహాతో నిమిత్తము లేదు. కాని, జనసామాన్యమునకు సంబంధించిన (public matters) విషయములలో నీపద్ధతి పనికిరాదు. మనలాభము మనకెంతముఖ్యమో ప్రజలలాభమును మనకంతముఖ్యమే. ప్రజలు క్షేమముగానుండుటకు ఎట్టియేర్పాటుచేయవలెనో, నిత్యమును అభివృద్ధిపొందుస్థితికి ప్రజలెల్లు చేరఁగలరో—ఈవిషయములను గుఱించి మన మాలోచించినప్పుడు, ఎన్నెన్ని విధములుగా మనమాలోచించి నను అధికారము మనచేతిలో లేనందున నిర్జయుల మగుచున్నాము (handicapped).

ఒకస్థలమునుండి మఱియొకస్థలమునకు నొక అయోమార్గము (రైలుపట్టాలు) మనము వేయఁదలంచుకొన్నయెడల నది మనయధికారములో లేదు. వర్తకవిషయములలోనొకానొకపరిశ్రమను మనదేశములో ప్రోత్సాహము చేయవలయునని మనమెన్నిమాఱు లుపన్యసించినను, ఆవృత్తి జయప్రదముగా జరుగుచున్న దేశమునకువెళ్లి ఆవృత్తినిగుఱించి జ్ఞానముసంపాదించుటకుఁగాని, అట్టి దేశములోనివర్తకమును మనదేశములో తగ్గించుటకుఁగాని, మనవర్తకమును వృద్ధిచేయుటకుఁగాని మనకు శక్తి పూర్తిగాలేదు. ఏవిషయమునుగుఱించి యాలోచించినను ఇట్టి స్థితియందే యున్నాము. మనము మద్యమును (అమ్మకము) ఆపలేము. మనచే కోరఁబడనటువంటియు, మన ప్రభుత్వము (government) చేఁ గోరఁబడనటువంటియు, కొన్నివస్తువులుకలవు కాని, అట్టివానివిషయమై ఎంతటికొద్దిమార్పుచేయుటకును ప్రస్తుతపరిపాలనాపద్ధతుల ననుసరించి మనకు ఎంతమాత్రమును అధికారములేదు. ఇంతవఱకు మనము అనేక ఫిర్యాదీలను (complaints) చేసినాము. వానిని ప్రభుత్వమువారు విన్నారు. కాని, యీఫిర్యాదులకు (complaints) మూలమేమి? మనము

కోరినప్రకారము మనస్థితినిఅభివృద్ధిచేయుటకు మార్గములోనడ్డమువచ్చినవియేవి? అనఁగాఅట్టిదానికి అభ్యంతరమేమి? అనువిషయమునుగూర్చి యేఁబదిసంవత్సరములనుండి ఆలోచించిరి. ఈవిషయము చక్కఁగా పరిశోధించి మనచేతులలో అధికారము లేనిలోపమే ముఖ్యకారణమని చాలమంది బుద్ధిమంతులుకనిపెట్టిరి. బహిరంగ (public matters) విషయములలో అనేకభిన్నాభిప్రాయములను ప్రజలు కలిగియున్నారు. కొందఱు 'మీకధికారము లేదా? మద్యపానము చేయనియెడల నన్నియు నెఱవేఱును' అని చెప్పెదరు. ఈసలహానిజముగా బాగుగానే ఉన్నది. కాని ప్రజలను సారాయిత్రాగనీయక చేయుటకు సలహామాత్రముతో జరుగదు. దీనికి కొంచెము అధికారము కావలయును. తనచేతులలో ఆయధికారము లేనివాఁడు, ఆపనిని నెఱవేర్పలేడు. సలహాతో మాత్రమే యిట్టి పనినిమనము నిర్వహించుకొనఁగలిగినయెడల మనము రాజును కోరకయుండెడివారమే. ప్రజలలో చాలమందియొక్క కోరికలను నెఱవేర్చుటకు ప్రభుత్వమువచ్చినది. ఈప్రభుత్వము మనచేతులలో లేకపోవుటచేత మీలో వేనవేలుజనులు ఒకవస్తువును కోరినప్పటికిని, అది పరిపాలనము చేయువారుకూడ కోరకపోయినయెడల ఎన్నటికిని నెఱవేరదు. ఇచ్చటికి నేను పూర్వ మొకసారివచ్చితిని. (అకాలమునాటి)కఱవు విషయ (famine administration) మగుపరిపాలనమేమైనది? సాలెవారికి క్షామమువలన చాలదండుగనచ్చినదని ప్రభుత్వమువారికి (government) తెలిసినపిమ్మట,ఆవిషయమై కొన్నిపనులుచేసిరి. మనవ్యాపారము (trade) ను పోఁగొట్టుకొంటిమి. పూర్వము రుసుముగ్రహించు ప్రతినిధివ్యాపారము (Business of commission agency) జరుగుచుండెడిది. ఆ యేజంట్లపని (ప్రతినిధివ్యాపారము) పూర్వము లేదనికాదు. ఇప్పుడును లేకపోలేదు. ఏజంట్లవ్యవహారము ఈకాలములోఁగూడ జరుగుచున్నది. పూర్వస్థితికిని ఇప్పటిపద్ధతికిని వ్యత్యాసమేమనిన, పూర్వము మీవర్తకులకు మీరు ప్రతినిధులు (agents) గా నుంటిరి. ఇప్పుడు ఇంగ్లాడు

దేశవర్తకులకు వీరు ప్రతినిధులు (agents) గా నున్నారు. వీరు ప్రత్తి (లేక దూది, cotton)ని యిచ్చటకొని ఇంగ్లాండునకు పంపెదరు. ఆప్రత్తినుండి ఇంగ్లాండులో చేసిన గుడ్డలు మనదేశమునకు వచ్చినప్పుడు వీరురుసుము (commission) గ్రహించికొని మాకుఅమ్మివేయుచున్నారు. రుసుము గ్రహించుప్రతినిధివ్యాపారము మిగిలియున్నదికాని, వానివలన పూర్వము మనదేశముపొందెడులాభము ఇప్పుడు మనకులేదు. ఆలాభము ఇంగ్లీషువారికి (ఆంగ్లేయులకు) జేరినది. సంగతియేమనఁగా, మనుష్యులలోను వ్యవహారములలోను ఏమియు భేదములేదుగానీ పరిపాలనాధికారులలో మార్పుకలిగినందున మనము కొన్నికార్యములను చేయలేక పోయినారము.

ఇప్పుడు మనఅవస్థవరీతిగానున్నదనఁగా, దేశమునకు మేలుకలుగజేయుకార్యములను మనము నెఱవేర్పలేము. ప్రప్రథమమున ఆంగ్లేయప్రభుత్వము మనకునిజముగా అన్యము కాఁబట్టి యిట్లయినదని మనము తలంచితిమి. ఇట్లుచెప్పుటవలనరాజద్రోహము ఎంతమాత్రమును లేదు. అన్యములగుపదార్థములను అన్యములు అని నుడువుటవలన రాజద్రోహముగాని మఱి యేయితరమైన నేఱముగాని లేదు. అన్యభావముయొక్క ఫలితమేమి ? అన్యులకును మనకును భేద మేమియనిన, అన్యుల (alien) దృక్పథము (point of view) అన్యముగా నున్నది; వారిభావములు అన్యములే. ఏప్రజలమధ్యవారు అన్యులుగానున్నారో, అట్టిప్రజలకు ప్రత్యేకముగా మేలుచేయునట్టి ఏకార్యమునకు వారిమనస్సు పోనట్టి ప్రవర్తనమును మొత్తముమీఁద వారుకలిగియున్నారు. అహమదానగరమును పరిపాలించిన మహమ్మదీయరాజులు—వారిని అన్యులు అని నేనుచెప్పను.—వారు ఈదేశమునకువచ్చి ఇక్కడ నివసించిస్థానికవ్యాపారములు (industries) జయప్రదముగా నభివృద్ధిపొందవలయునని (thrive) వారు అధమపక్షము కోరనైనకోరిరి. మఱియు వేఱైయుండవచ్చును. హిందూదేశములో (India) నివసింపవలయుననియును వారిబిడ్డ

లుకూడ హిందూదేశములోనే యుండవలెననియును కోరుదురు. వారిని ఉండనిమ్ము. అట్టిమనుష్యులకును అట్టిబిడ్డలకును హిందూదేశములోని యితరవాస్తవ్యులకును మేలుచేయఁగోరువారు అన్యులుకానేకారు. అన్యులనఁగా అన్యమతముకలవారని నా అర్థముకాదు. ఈదేశప్రజలకు మేలుకలుగఁజేయువాఁడు మహమ్మదీయుఁడైనను, ఆంగ్లేయుఁడైనను, అన్యుఁడుకాఁడు. 'అన్యము' లాభాపేక్షలనుబట్టియుండును, తెల్లచర్మమూ (white skin) నల్లచర్మమూ అనుభేదమునుబట్టి 'అన్యము'ఎంతమాత్రమువర్తించదు. మతమునకును అన్యభావమునకును సంబంధము లేదు. వ్యాపారముతోను వృత్తితోను అన్యభావమునకును సంబంధము లేదు. తానునివసింపనెంచినట్టియు తనబిడ్డలును రాబోవుసంతతివారును నివసింపవలయునని తలంచినట్టియు దేశముయొక్క మేలునుగోరువానిని నేను అన్యునిగా భావింపను. నేను ప్రార్థించుదేవాలయమునకేవచ్చి వాఁడుప్రార్థింపకపోవచ్చును. వానికిని నాకును వివాహసంబంధబంధుత్వముగాని సహపంక్తిభోజనముగాని లేకపోవచ్చును. ఇవన్నియుగూడ స్వల్పాంశములు. కాని, హిందూదేశముయొక్క మేలుకొఱకు పాటుపడుచున్నను ఆమార్గమున తగినసన్నాహములను సమకూర్చినను, వానిని నేను అన్యునిగాభావింపను; ప్రభుత్వము అన్యమైనది. ఈసంగతిలో ముఖ్యమైన దెద్దియు లేదని ప్రప్రథమున తలంచినాడను. పీష్వాల ప్రభుత్వము గతించినది. మహమ్మదీయుప్రభుత్వము గతించినది. (దేశము) ఆంగ్లేయుల వశమైనది. దేశము ఔన్నత్యమునకువచ్చుటకును, మేలుపొంది అభివృద్ధిగాంచి యితరదేశములతో సమానస్థితికివచ్చుటకును, కావలసినపనులనెల్లను నిర్వహించుట రాజుయొక్క విధాయకకృత్యము. ఈవిధాయకకృత్యమును నెఱవేర్చురాజు అన్యుఁడుకాఁడు. ఈవిధాయకకృత్యమును నెఱవేర్చనివాఁడును తనస్వలాభముకొఱకుఁగాని, తనజాతివారిమేలుకొఱకుఁగాని, తనస్వదేశముయొక్క మేలుకొఱకుఁగాని, ఎదురుచూచువానిని అన్యునిగా నేను భావించెదను. ఈప్రభుత్వము అన్యమని ఎవ

రైనచెప్పినయెడల అట్టివారు పై అర్థముతోనే యీమాటను చెప్పుదురు. (అన్యత్వము) అనెడు భావము ఎట్లుఅదృశ్యము కాఁగలదు? మొట్ట మొదట లెక్కలేనిసమస్యలు పొడచూపినవి. వ్యవసాయపుపన్నులు ఎక్కువాయెను. ఆటవికశాఖ ఒకానొకపద్ధతిననుసరించి యేర్పాటు చేయఁబడినది. మత్తుపదార్థశాఖ ఒక్కపద్ధతి ననుసరించి నిర్మింపఁబడి నది. ఈపైనిచెప్పఁబడిన అన్నియంశములను గుఱించియు మనప్రభుత్వ మువారికి గడిచిన 20, లేక 25 సంవత్సరములనుండి మొఱబెట్టుకొను చునేయున్నాము. కాని వేలువేలువిధములగు పరిపాలనాశాఖలవిష యమైగాని, వేలువేలు వృత్తులవిషయమైకాని, వేలువేలువ్యాపార ములవిషయిమైకాని వేలువేలుపరిశ్రమలవిషయమైకాని; తగిన ఏర్పా టులు ఏమియు చేయఁబడలేదు. గడిచిన ౕ0 సంవత్సరములలోను ఇదియే ముఖ్యసమస్య. దీనికికారణమును వెదకినపుడు ఈసంగతి ప్రభుత్వమువారికి (government) తెలియఁజేసినయెడలవారు మనము కోరినప్రకారము చేయుటకు తత్క్షణమే ప్రారంభింతురని మనము మొట్టమొదట నమ్మి తిమి. ప్రభుత్వము అన్యమైనది. దానికి నిజము తెలియదు.

మనలో 5 లేక 10 మంది ప్రముఖులుకలసి ప్రభుత్వమువారితో చెప్పినయెడల ప్రభుత్వమువారికి బోధపడును. ఆప్రభుత్వము అన్యమ గుటచేత బోధపడలేదు. ఈసంగతి ప్రభుత్వమువారికి తెలిసిన తక్ష ణమే, వారు ఉదారబుద్ధి కలవారగుటచేత మీరు చెప్పినదానిని చెవి యొగ్గివిని మీ యిబ్బందులను తొలగింతురు. మననమ్మకము ఇట్టిదై యున్నది. కాని, గడిచినయేఁబదిసంవత్సరములలో ప్రభుత్వముయొక్క ప్రవర్తనము మననమ్మకమును పాఱదోలుటకు కారణమైనది. మీరు ఎంతమొఱపెట్టినను(clamour), మీరు ఎంత ఆందోళనము (agitate) చేసినను, మీరు ఎన్నిహేతువులను చూపించినను, వారి వివరణపత్రికల నుండి (report) తీసి కనఁబఱచిన అంకెలనుగూడ చూడలేనట్టుగా ప్రభు త్వముయొక్క దృష్టి మార్పుజెందినది. ఆవాదనలే ఆహేతువులే వారి

యంగీకారమును పొందవు. మనము ప్రభుత్వమువారితో ఏమిచెప్పినను, మనము చెప్పినదానికి (statement) వ్యతిరిక్తమునే పట్టుదలగనుండును. ఈవిషయములో ఆశ్చర్యమొందవలసిన దేదియు లేదని యెవరైనను మీతో చెప్పవచ్చును. మహమ్మదీయులుగాని, హిందువులుగాని, పీష్వాలుగాని లేక, పూర్వము ఎవరు పరిపాలకులై యుండినను, ఆరాజ్యములన్నియు విచ్ఛిన్నములై యిప్పుడు ఆంగ్లేయపరిపాలనముస్థాపింపఁబడినది. సరియే, (of course) వారు వారికి ఏదిమేలో అదియే చేసెదరు. వారి విషయమై ఎందులకు మొఱపెట్టుకొనెదరు? ఇది సంభవించుట తప్పదు. చాలమందియొక్క అభిప్రాయమిట్టిదియే. మీయొక్క మొఱ (outcry) ప్రభుత్వమువారికి నొప్పికలుగఁజేసి వారిమనస్సు కలతజెందుటకు కారణము మాత్రమగును. కనుక ఇట్టి మొఱపెట్టుకొనక, ప్రభుత్వము మీకు నియ్యఁబోవుదానిని నిశ్శబ్దముగా పుచ్చుకొనుఁడు. మీరు ఎంతకొంచెము (గొట్టిలో నాలవవంతు) ఇచ్చినను ప్రభుత్వమువారు ఏదియిచ్చినను దానిని మీరు సంతోషముతో పుచ్చుకొని, వారికి వందనములు చేయుఁడు. * ఇదియే కొందరిప్రజలయొక్క యభిప్రాయము. ఈయభిప్రాయమును నేను అంగీకరింపను. ప్రభుత్వము, ఆంగ్లేయప్రభుత్వమైనను మఱియేప్రభుత్వమైనను, ప్రభుత్వమగుటవలన నెఱవేర్పవలసిన విధాయక కృత్యమున్నదని నాయభిప్రాయము. ఒకవిధమైన మతవిషయక విధాయకము ప్రభుత్వమువారి కున్నది. ఒకవిధమైన భారము దాని భుజముల మీఁద నున్నది. ఈభారమును తప్పించుకొనుప్రభుత్వము ప్రభుత్వముకాదని నేను వక్కాణించెదను. ప్రభుత్వము అధికారమును కలిగియున్నది; యుద్ధముచేత సంపాదింపఁబడినను, లేక ప్రజలచే సమర్పింపబడినను, ఎట్లువచ్చినను, ప్రభుత్వము కలిగియుండు సర్వాధికారమును (నెఱవేర్చుటకు) ప్రభుత్వమునకు విధాయకము. మనకు ఎట్లు విధాయకకృత్య

* ఇట్లు వందనములుచేయువారు మనలో మితవాదులని గ్రహింపవలెను. ఇట్టివారిని శాసనసభలకు ప్రతినిధులుగా ఎన్నుకొన్నపుడు వారు దేశమునకు చేయుమేలు సున్నా ○ అని తెలియవలెను.

ములుకలవో ఆరీతిగ నీ ప్రభుత్వమునఁబడెడువారికిఁగూడ విధాయకకృత్యములు కలవు. వారును కొన్నిపనులు చేయవలయును. కొన్నివిధాయకకృత్యములను ప్రభుత్వమువా రంగీకరించియే యున్నారు. బాటలను నిర్మించుట, తపాలాకచ్చేరీలను తంతివార్తాస్థలములను స్థాపించుటమొదలయిన పనులను ప్రభుత్వము వారు చేయు లేదా ? వారు చేయుచున్నారు. "ప్రభుత్వమువారు బాటలు వేయుట వారి చిత్తము. (it is its pleasure) వారికి ఇష్టమున్న బాటలు వేయుదురు. ఇష్టము లేనిచో వేయరు, అని రేపు ఎవఁడైనను మీతో చెప్పవచ్చినయెడల ఇక్కడకూడిన మీరు అతనితో నీవిధముగా చెప్పి లోపములయెంచెదరు. "ఇవి ప్రభుత్వము వారిచే చేయుబడనిచో మేముపన్నులు ఎందులకు చెల్లింపవలయును? ప్రజలనుండి గ్రహింపఁబడిన పన్నులును ప్రజలసదుపాయమునకు వ్యయపఱచకపోయిన మాయొద్దనుండి యేవిధమైన పన్నులు వసూలుచేయుటకు ప్రభుత్వమునకు అధికారము లేదు. మాయొక్క లాభమునకే వానిని ప్రభుత్వమువారు గ్రహించుచున్నారు." మీముందు ఎవరైనను ఈప్రభుత్వము మంచిదని వాదించునప్పుడు వారు మీకు దేనిని తెలియఁజేసెదరు ? మన ప్రభుత్వమువారు బాటలు వేసిరి, అయోమార్గములను ఏర్పాటుచేసిరి, తంతివార్తాస్థానములను తపాలాస్థానములను స్థాపించిరి. ఇవన్నియు మీసదుపాయమునకు చేయుబడినవేకదా ? ప్రభుత్వము గూర్చి ఎందులకు మొఱపెట్టెదరు. (outcry)?" అనిప్రశ్న ఎప్పుడును వేయుచునేయున్నారు. ఈపనులుచేయు లేదని నేనుచెప్పను. చేసినపనులు చాలవని నేను చెప్పుదును. కొన్నిపనులు చేసినారు; చక్కగాకూడ చేసినారు. పూర్వపుప్రభుత్వమువారు చేయుస్థితికంటె చాలబాగుగ చేసినారు—ఇది యీప్రభుత్వమునకు గౌరవము. ఇంకను చేయనిపనులను చేయువలసినదని ప్రభుత్వమువారితో మనము చెప్పఁగూడదా ? ఇంతవఱకు ప్రభుత్వమువారు చేయనిపనులను ఇప్పుడైనను చేయవలసినదని కోరినప్పుడు, తమ్ములమర్యాద చేసితిమని భావించెడు ప్రభుత్వమును, ఎన్ని

విధములచెప్పినను ఆకార్యములవైపుదృష్టిని పోనివ్వని ప్రభుత్వమును, అట్టి సంగతులు మనము చెప్పఁగూడదని తలంచునట్టి ప్రభుత్వమును, యథార్థప్రభుత్వము కాదు.

యథార్థప్రభుత్వమన అర్థమేమి? దానినివారు కొంచెము ఆలోచింపవలయును. ప్రస్తుతపుపద్ధతికిని (system) ప్రాచీనపద్ధతికిని వ్యత్యాసము మెండుగఁగలదు. ప్రస్తుతము ఒకవిధమైన దురభిప్రాయమును గలుగజేయుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఆంగ్లేయభాషలో(బురోక్రసీ) నిరంకుశాధికారవర్గ మనఁబడెడివారుగాని,ఇచ్ఛటికివచ్చు మండలాధికారి (collector) గాని, సివిలియనులు (civilians) గాని, ప్రభుత్వమువారు కారు. పోలీసుసిపాయి ప్రభుత్వము (government) కాఁడు. "మనదేశముపైనున్న బ్రిటిషుపరిపాలనమునునిలువఁబెట్టి దానికి హానిగాని బలహీనముగాని కలుగఁజేయకుండ ఏదైనను చేయుటకు వీలున్నయెడల చేయుఁడు" అని చెప్పుట ఎంతమాత్రము రాజద్రోహము కానేరదు. మనపైనున్న ఆంగ్లేయప్రభుత్వము కావలెనని మనము కోరుచున్నాము, ధాన్యపుకొట్లయొద్దనున్న యీకావలివాండ్రగు మధ్యవర్తులు మనకు అక్కఱలేదు. (ఆహ్లాదము). ధాన్యము యజమానునిది. భోజనసామగ్రి యజమానునిది. కాని, ఈమధ్యనున్నవారి నొప్పిగల కడుపును తొలఁగించుఁడు. తమగృహకృత్యములను తామేనెఱవేర్చుకొనునట్లుగా ఆయధికారము ప్రజలకీయవలయును. మనము ఈవిధమైన స్వరాజ్యము నడుగుచున్నాము. ఆంగ్లేయప్రభుత్వమును తొలఁగింపవలయునని నేనుగాని చక్రవర్తియొక్క పరిపాలనమును తొలఁగించి స్వదేశప్రభువుయొక్క (native state) పరిపాలనము స్థాపింపవలయుననిగాని, యీస్వరాజ్యము నకు అర్థము కాదు. బెల్గామునలో శ్రీఖపర్ది (Mr. Khaparde) గారు, బోధపఱచినట్టుగా స్వరాజ్యమనుమాటలకు అర్థము ఏమనఁగా, దేవుని యొద్దనున్న యీపూజారులును తొలఁగించవలయునని మనము గోరుచున్నారము. దేవతలు తప్పక ఉండవలయును. ఈపూజారులు అక్కఱ

లేదు. మాలోనే కొంతమందిని పూజారులనుగా నియమించవలసినదని చెప్పుచున్నాము. ఈమధ్యనున్న కలెక్టర్లు, కమీషనర్లు ఇతర మనుష్యులు మాకు అవసరములేదు. ఇప్పుడు మామీఁద పరిపాలన మెవరు చలాయించుచున్నారు? చక్రవర్తి యిక్కడికివచ్చి దానిని చలాయించుచున్నాఁడా? ఆయన ఇంగ్లాండులో నున్నాఁడు. కొన్నియథార్థపుసంగతులు (facts) ఆయనకు తెలియఁజేసినయెడల, మీకుమేలు చేయఁబడవలయునని ఆయనకోరిక. అయినను మీకు ఎందుచేత మేలుచేయుట లేదు? గనుక మనకు ఈపూజారులు (priests) అవసరములేదు. (ఆహ్లాదము). * ఆమనుష్యులు తెలివిగలయైనవారు. పూజారి అవసరములేదని మీరు చెప్పుతారు. "మేము పరీక్షలలో గృతార్థులైనాము. మేము చాలపనులు చేయుదుము" అని వారు చెప్పెదరు. ఈసంగతులన్నియు నిజమే. పూజారికి చెందవలసిన ప్రతిఫలము † వైపు వారిదృష్టి ఎక్కువగా తిరిగినది. కనుక యీపూజారిఉద్యోగము మనచేతులలోనే ఉండవలసినది. పంధరపురములోని బాడ్వాచు ‡ యొక్క స్థితియు వీరి స్థితియు ఒక్కటే. (ఆహ్లాదము). § తమ హస్తములలో నుంచుకొనవలయునని ప్రయత్నము చేయుచున్న (bureaucracy) నిరంకుశాధికారులచేతులలోనుండి యీపూజారియుద్యోగము తొలఁగించినయెడల చక్రవర్తికి ఏమైన నష్టముండునా? ఏమియు ఉండదు. ఆంగ్లేయులు చక్రవర్తిగారి జాతిలోనివారమని కొందఱందురు. మనము ఆయన ఏలుబడిలోని ప్రజలమైనప్పటి (subjects) నుండి ఆంగ్లప్రజలకున్ను నల్లనిప్రజలకును ఆయన భేదము చేయఁడు. చేయుట ఆయన కిష్టముకాదు. స్వరాజ్యమనఁగా మునిసిపల్ స్థానిక స్వతంత్రపరిపాలనము. కాని, అదియొకతమాషా,

* ఈమాట మూలములో ఇంగ్లీషున ఉన్నది.

† మూలములోనిమాట కృత్యాంశము. ఈమాటకు అర్థము. ఒక ఆస్తిలోగాని, ఉద్యోగములోగాని వృత్తిలోఁగాని, జీవనార్థముగవచ్చు ఒకభాగము.

‡ పంధరాపురములోని విఠోబాదేవళముయొక్క పూజారి.

§ ఈమాట మూలములో ఇంగ్లీషుననున్నది.

(farce), అదిచాలదు. కలెక్టరువద్దనుండి ఒకఆజ్ఞ (ఉత్తరువు, order) వచ్చినయెడల అది మీరు శిరసావహించవలసినదే (obey); ఆయన (కలక్టరు) ను * మధ్యజోక్యముగా కలుగఁజేసికొనుటకు అధికారము గలదు. అధ్యక్షుని (president) పిలిచి ఒకానొక కార్యము చేయవలసినదని చెప్పుటకు అతని కధికారము కలదు. అధ్యక్షుఁడు చేయకపోయిన యెడల అతనిని తొలఁగించుటకు కలెక్టరుకు అధికారము కలదు. ఇకను స్వరాజ్య మెక్కడనున్నది? (ఆహ్లాదము). పూర్వము చెప్పిన స్వరాజ్యమున కర్థమేమనిన, చక్రవర్తి, ఆంగ్లేయుల పరిపాలనమును ఉంచుకొనుటయు తక్కిన వ్యవహారములు చక్కపఱచుటకు పూర్తిగా ప్రజలకు అధికార ముండవలయు ననుటయే. ఇదియే స్వరాజ్యమునకు నిర్వచనము (definition); మేము కోరున దేమనఁగా—ఆంగ్లేయ ప్రభుత్వము తగ్గవలయునని కాదు. ఆంగ్లేయ ప్రభుత్వముపోయి యాస్థానమున జర్మను ప్రభుత్వము రావలయునని కాదు. ఇఁకను దానికివ్యతిరిక్తముగా (on the contrary) జర్మను ప్రభుత్వము మన దేశమునకువచ్చుట మనకోరిక కాదని ప్రస్తుతసంగ్రామము బుజువుచేసిన విషయము ప్రపంచములో నందఱెఱింగినదే. అంతేకాదు. ఇక్కడ ఆంగ్లేయ ప్రభుత్వము స్థావరముగా (permanently) నుండవలయునని దూరముననున్న శీతలప్రదేశములలో మనప్రజలువేనవేలు తమప్రాణములను ఈరోజున సమర్పించుచున్నారు. (గమనింపుఁడు, ఆహ్లాదము). ఇంకను మిగిలినదేమి? ఈపరిపాలనముండుటకును ఈపరిపాలనము పోకుండుటకును జర్మను పరిపాలనము ఆస్థానమున రాకుండుటకును మనశక్త్యానుసారముగ ఆంగ్లేయులంతధనికులము కాకున్నప్పటికిని, మనము సొమ్ము చెల్లించుచున్నప్పుడు.... † మన శక్త్యానుసారముగా మనయుద్ధభటుఁలు కష్టపడి యుద్ధము

---

* ఈమాట మూలములో ఇంగ్లీషులో నున్నది.

† మూలములో ఈవాక్యము రిపోర్టర్లచే అసంపూర్తిగా వదలివేయబడినది.

చేయుచు తమప్రాణములను బలియిచ్చుచున్నారు. ఫ్రెంచివారు జర్మనులు ఇతరదేశస్థులు మనవారిని పొగడుచు మెచ్చుకొనుచున్నారు. (ఆహ్లాదము, గమనింపుడు, గమనింపుడు). *

ఆంగ్లేయప్రభుత్వము నెడల మనరాజభక్తియీపద్ధతిగ నుండవలయునని, మనకోరికయని మనరక్తపాతమువలన మనము ఋజువుచేసితిమి. (గమినింపుడు, గమనింపుడు, ఆహ్లాదము). మనపక్షమున నంతకంటె ఎక్కువసాక్ష్యము ఎవరునుతీసికొనిరాగలరని నేనుఅనుకోను. కనుక, మనకు ఆంగ్లేయప్రభుత్వమే యుండవలయుననియు, దానికొఱకు మనము పాటుపడుచున్నామనియు, నిరోజుననిస్సందేహముగను, యథార్థముగను తెలియుచున్నదికదా! ఇట్టిస్థితిలోయున్నప్పుడు ఇప్పుడు ఉద్యోగములోనున్న యీమధ్యప్రజలనుతొలగించి బ్రిటిషుసామ్రాజ్యములో నితర ప్రదేశములలో ప్రజలు పొందియుండు హక్కులను మనము ఎందులకు పొందకూడదు? ధైర్యములోను విద్యలోను మనమువారికితీసిపోము. మనకు సామర్థ్యముకలదు. ఇట్టివిషయమందు మన హక్కులను ఎందులకు సంపాదింపకూడదు? చక్రవర్తియొక్క తెల్లప్రజలకును (subjects) నల్లనిప్రజలకును చక్రవర్తిఎందునకు భేదముకల్పించవలయును? చక్రవర్తికి అట్టిసలహా ఎవరుఇచ్చిరి? ఆంగ్లేయదేశపరిపాలనాపద్ధతియొక్క విచిత్రమేమనిన, చక్రవర్తి ప్రజలసలహా ననుసరించి ప్రవర్తించును. మంత్రులు, చక్రవర్తికి అట్టిసలహాలెందులకియ్యవలయును? ప్రస్తుతముఅధికారము (power) కలిగియున్న నిరంకుశాధికారవర్గము (bureaucracy) తెల్లవారు. ఒకనల్లవాఁడు ఎవఁడైనను వారిమధ్యనున్నను వారివలెనె అగుచున్నాఁడు. ప్రస్తుతపద్ధతిప్రకారము ఒకస్వదేశీయుఁడు (native) ఇంగ్లాండునకుపోయి అక్కడపరీక్షలయందు కృతార్థుఁడై కలెక్టరుగా నియమింపఁబడినప్పుడు అతఁడు వారితో తిరుగును గనుక, వారివలెనేఉండును. నేను తెల్లవారివిషయమే మాటలాడు

* యీమాటలు మూలములో ఇంగ్లీషున వ్రాయబడినవి.

చున్నానని మీరు తలచవద్దు. ఈపద్ధతిమనకవసరము లేదు. వారిలోమన వారొకరిద్దఱు ప్రవేశించిననేమిప్రయోజనము ? అతఁడు విశేషముగా ఏమియు చేయఁజాలఁడు కనుక, ఈపద్ధతిని పూర్తిగాతీసివేయవలెను. ఒకరిద్దఱకు ఉద్యోగములు యిచ్చుటవలన మేము తృప్తిపొందము. దాని సంగతి యుండనిండు.

ఈ పద్ధతిని ఎవరుఏర్పాటుచేసిరి ? చక్రవర్తిఏర్పాటుచేయలేదు. రాణిగారు ప్రచురించిన ప్రకటన ఒకమోస్తరుగాన్నది ; ప్రస్తుతపద్ధతి మరొకమోస్తరుగానున్నది. ప్రస్తుతము మనమేలును సమకూర్చుటకుఅవకాశములన్నియు మనచేతులలో లేవు. దిగుమతిగాబడిన విదేశీయవస్తువుల మీఁదపన్ను వేసి మనదేశవస్తువులకు ప్రోత్సాహము చేయవలయునని మన మూహించిన యెడల అది మనచేతులలో లేదు. మనదేశమునకుకావలసిన కొన్నిపరిశ్రములను మనదేశములో చేయవలయునని మన మెంతఆలోచించినను,ఇతరదేశములనుండి జీతములిచ్చియుపాధ్యాయులను మనదేశమునకుపిలిపించవలయునని మనమాలోచించినను ఆకార్యనిర్వహణము మన చేతులలో లేదు. ఇదిఎంతస్వల్పమైనసంగతియోఆలోచింపుఁడు.ఒక్కొకఁడునుచదువుటకునువ్రాయుటకును నేర్చియుండవలయును; ఒకఁడుమహమ్మదీయుఁడైనను లేక యితరమతస్థుఁడైనను,ఏవర్ణమువాఁడైనను,కొంచెము వ్రాయుటకును, చదువుటకును నేర్చుకొనుటవిధాయకము. ఈసంగతి ప్రపంచమందంతటగలప్రజలు ప్రస్తుత మంగీకరించినసంగతియే. ఈవిషయమై యిప్పుడు సందేహము లేదు. మనుజునకు చదువుటకును వ్రాయుటకును తెలిసియుండిన అధమపక్షము కొంతలాభమైన నుండును. ఈసంగతిని మరలచెప్పవలసినస్థితిలో నిప్పుడెవరును లేరు. అయినను ఆపని మనదేశములో నెందులకుజరుగదు ? ధనము లేదు గనుక. ఈసమాధానము (excuse) ఎవరు చెప్పుచున్నారు ? నిరంకుశాధికారవర్గముచే (bureaucracy) ఈసమాధాన మియ్యఁబడినది. వారిజీతము 2,500 రూపాయలును, 3000 రూపాయలుగావృద్ధిచేసికొనుటకు ధనముండును.

మారక ప్రతిఫలమునకు (exchange compensation) సంగతియిది యే. రూపాయలయొక్క (వెండియొక్క) ధర తగ్గినప్పుడు మారకమువలన ప్రభుత్వమువారు ఆరుకోట్లరూపాయలు పైకితీసిరి (were brought out); అప్పుడు ధనముకనఁబడినది. మీచేతులలో అధికారముండిన నే తప్ప ఇవుడుజరుగుచున్నవానినుండి మనము తప్పించుకోలేము. విద్య వ్యాపనకు ధనములేదు కాని, కలెక్టర్లకు 2,500 రూపాయలిచ్చుటకు ధనముకలదు.

ఈవిషయమై మనమెంతస్పష్టముగా చెప్పినను * మఱియు, మన చేతులలోనికి అధికారమునిచ్చినయెడల మనముచూచురీతి (point of view) ప్రస్తుత నిరంకుశాధికారవర్గము (bureaucracy) ఆదృష్టితో ఆవిషయమునుచూడదు. మొట్టమొదట, విద్యకొఱకు ధనమునువ్యయ ముచేయవలసినదని మనముచెప్పితిమి. వ్రాయుటకును చదువుటకును ప్రజలునేర్చినయెడల నేరములువేలకొలఁది తగ్గిపోవును. వారికార్యము లను వారుచక్కగానిర్వహింతురు. వారికి ఏదిక్షేమమో, ఏదినష్టమో, వారికిబోధపడును. ఈపద్ధతిలో ప్రజలున్నయెడల వారినిపాలించుటకు, 2,500 రూపాయలు జీతముగల అధికారిఅవసరములేదు. 500 రూపా యలుగలవాఁడుచాలును. విద్యకొఱకు 2000 రూపాయలు ఖర్చుపెట్టు టకు సామర్థ్యము కలిగియుందుము. ఏయితరదేశమునందు ఇంతఎక్కువ జీతములు గ్రహించుఅధికారులు ప్రస్తుతములేరు. హిందూదేశమును పరిపాలించుటకువచ్చినరాజప్రతినిధి నెలకు 20,000 రూపాయలుగ్రహిం చును. ఇంగ్లాండులో ప్రధానమంత్రికి నెలకు 5000 రూపాయలుమాత్ర మే, ఇంగ్లాండులోనుండి ఆంగ్లేయసామ్రాజ్యముయొక్క సకలవ్యవహార ములను నిర్వహించువానికి 5000 రూపాయలే. హిందూదేశముయొక్క ప్రభుత్వమును జరపించువానికి రూ.20,000 జీతము, ఇదిఎందుచేత? దీనికి ప్రత్యుత్తరములేదు. ఇతరులుఖర్చుభరించునట్లుగా వారుజరపించుచు

* మూలములో అసంపూర్తిగానున్నది.

న్నారుగనుక యిట్టిస్థితిలోనున్నది. (ఆహ్లాదము). * ఇదిహిందూదేశము. నీవు పోయి భుజింపుము. (go and eat). అన్నిటిని నీవు నిర్వహించవలసినది. నీకు ఇచ్చినయెడల దానిలో ఉద్యోగి మీశాఖవాఁడైనఁగాని, మీసంఘమువాఁడైనగాని (community) నెలకు 100 రూపాయలుజీతము యిత్తువుకాని మీఅంగడిలోనున్న అట్టిఉద్యోగస్థునికి మీరు 50 రూపాయలుమాత్రమేయిచ్చెదరు. † ప్రస్తుత మీపద్ధతిగనే జరుగుచున్నది. ఈపద్ధతివలన మనకు ఏమాత్రమును మేలుచేకూరలేదు. ఈవిషయములు మనకు గోచరించుటకిదియే ప్రథమముకాదు. ఈవిషయము మనకుగోచరించి 50 సంవత్సరములైనది.

1906సం॥లో కలకత్తాలో దేశీయమహాసభ (National Congress) సమావేశమయినప్పుడు, దాదాభాయినౌరోజీగారు (ఆహ్లాదము) ఈసంగతినిస్పష్టముగా చెప్పిరి. ప్రస్తుతముహిందూదేశములో జరుగుచున్న ఒకవిధమగు అన్యాయమును (injustice), అక్రమమును (irregularity) అణఁగఁద్రొక్కుటకును, ప్రజలచేతికి అధికారము జాఱుటతప్ప వేఱొకమందులేదని ఆయనతన 50 సంవత్సరముల అనుభవమనిచెప్పిరి. ఆయన దానికి స్వపరిపాలనమని పేరుపెట్టిరి. మఱియుప్రజలచేతులలోను, మన ‡ ఏ ఇండ్లలో నేమిజరుగవలయునో, మనగ్రామములో నేమిజరుగవలయునో, మనదేశములో నేమిజరుగవలయునో, మనరాజధానిలో నేమిజరుగవలయునో అట్టిఏర్పాటులను మనము నిశ్చయింపవలెను. ఈవిషయమును మనమునిశ్చయించినయెడల, అది కొలఁదిఖర్చుతో జరుగును, అది బాగుగాజరుగును. ఏవిషయమై ఎక్కువధనముఖర్చుపెట్టవలయునో, ఎట్టివిషయమై తక్కువఖర్చుపెట్టవలయునో, వీనినన్నిటిని, మనమునిర్ధారణ

* మూలములో నీమాట యింగ్లీషుననున్నది.

† మూలములో నీవాక్యము యొక్క అన్వయము తాఱుమాఱుగానున్నది.

‡ ఈవాక్యమునకును రాఁబోవువాక్యమునకును సంబంధమగపడదు.

ముచేసినచో మనప్రజలకు ఎక్కువలాభకారిగానుండును. నిరంకుశాధికారవర్గము వారికిమాత్రమే జ్ఞానమున్నట్లు మనకుజ్ఞానము (knowledge) లేదని నిరంకుశాధికారవర్గము వారనెదరు. వారిజీతముభద్రముగా ఉండవలయునని వారుమొట్టమొదటనే చూచుకొనెదరు. ధనాగారము లేక ట్రెజరీ(treasury)లోనికి ధనమురాఁగానే, వారిజీతము మొట్టమొదట నియ్యవలయును. సైనికులఖర్చులు మొట్టమొదట నీయవలయును. వీరికి మొట్టమొదట చక్కఁగ అమర్చఁబడవలయును, (They must be first fully provided for) ; ఇదిపోఁగా ధనముమిగిలినయెడల అదివిద్యకు వినియోగపడును. విద్య అవసరము లేదనివారనరు. వారిదృష్టిలోవిద్య చెడ్డవస్తువుకాదుకాని పైనుడివిన ఖర్చులన్నియుపోఁగా, వీలున్నయెడల ప్రజలకు విద్యగరవునదుపాయములు సమకూర్చబడును; ఇది తరువాత ఆలోచింపవలసినవిషయము.

"అధికారము మీచేతులలోనికివచ్చినయెడల మీరు మీవ్యవహారములను నిర్వహించుకొనఁగలరా? లేరా?" అనువిషయమును మనము ప్రథమమున విచారింపవలయును. వీరికి ఎక్కువజీత మిచ్చుచున్నారని మీకు తోఁచినయెడల, అదితగ్గించి యీపనిని దేశమునకు వారుచేయవలసినదని వారితో చెప్పుఁడు. ఈవిధముగా అన్నిసంగతులను ఆలోచించినప్పుడు, ఏకార్యములను నిర్వహింపవలయునని మనము కోరుచున్నామో అట్టివి నెఱవేర్చుటకు తగిన అవకాశమును మనచేతులలో మనము కలిగియుందుము. ఇది ఉత్తఆలోచన, మీకు కష్టము ఎక్కువ. మహారాష్ట్రభాషలోఒకసామెతకలదు.ఒకమనుష్యుఁడుమూఁడు ప్రశ్నలు వేసెను. గుఱ్ఱము ఎందులకు మొండిదైనది? తమలపాకులు ఎందుచేతకుళ్లినవి:—ఈకథమూఁడవపుస్తకములో పూర్వము ఉండినది. ఇప్పుడున్నదో లేదో నాకు తెలియదు.—ఇటువంటి రెండుమూఁడుప్రశ్నలకు నేను ఒకటే ప్రత్యుత్తరమిచ్చెదను. "తిరుగకపోవుటచేత" అనియే. ఈరీతినే, మనరాజధానిలో "మద్యముయొక్క అమ్మకము ఎందుచేతతగ్గిం

పఁబడ లేదు? అడవులలోని ప్రజలను కష్టము(జులుము)నకు ఎందులకు లో బఱచిరి? విద్యగఱపుటకు ఎందుచేత సొమ్ముకనపడదు?"—ఈ ప్రశ్నలకు జబాబు ఒక్కటియే. మీ చేతులలో అధికారము లేదు,...'కనుక' అను నదే....(ఆహ్లాదము).

ఈఅధికారము మీ చేతులలో నెంతకాల ముండునో అంతకాల మును మీకు అదృష్టోదయము (dawn of good fortune) చేకూఱదు. చక్రవర్తిఎవరైనను మనము ఆయన విషయమై చర్చింపము. వ్యాపారము, వర్తకము, మతము, సంఘము వీనితో సంబంధించెడు కార్యములను మనము నెఱవేర్పవలయును. ఈకార్యములను నెఱవేర్చుటకు తగిన అధికారము కొంతవఱకైనను మనచేతులలోనికివచ్చిననేకాని—(తుదకు పూర్తిగానే రావలయును)—పూర్తిగా మనచేతులలోనికి వచ్చిననేగాని సమృద్ధిసమయమును, అదృష్టలాభైశ్వర్యోదయములను మనముచూచుట దుర్లభము. మఱియొకరినోటితో మనము నీరుత్రాగలేము. మన యంతట మనమే త్రాగవలయును. ప్రస్తుతపుఏర్పాట్లు ఇతరుల నోళ్లతో నీరుత్రాగుటవంటిదే మననూతిలోని నీరును మనమేతోడి మనము త్రాగవలయును. ఆనుయ్యి ప్రభుత్వమువారికిని చెందినయెడల అవసరమున్న యెడల నెలకు ఒక్కరూపాయి పన్నుచెల్లించవచ్చును. కాని, మనకు అధికారము కావలయును, మనస్వాధీనములో దానిని ఉంచుకోనిది మనకు ఏవిధమైన మోక్షసాధనమును లేదు. చరిత్ర, నీతిశాస్త్ర, సాంఘికశాస్త్రములనుబట్టి యీ రాజ్యాంగసూత్రము దాదాపుగా నిశ్చయింపఁబడినది అనగా ఋజువు చేయఁబడినది. అయినను ఇంతవఱకు మీకు ఇన్ని దినములుగా ఎందులకు తెలియఁజేయఁబడలేదని మీరు అడగవచ్చును. ఈవిషయమై నేను కొన్నిమాటలు చెప్పవలసియున్నది. అధికారము మీచేతులలోనికి వచ్చునట్లును, లేక, అధికారము మీచేతులలోనికి వచ్చుకాలము సమీపించుచున్నట్లు కనబడుచున్నది. * ఇంతవఱకును

* ఈవాక్యము మూలములో స్పష్టముగా లేదు.

హిందూ దేశమునుండి వీలయినంత ఎక్కువలాభమును తీయవలయునని యింగ్లాండులోని జనసామాన్యము తలంచెడిది. వారికి హిందూదేశము ఒకవిధమైన భారమువంటిది. హిందూదేశములోని ౩౦ కోట్ల ప్రజలును, ఎప్పుడో ఒకప్పుడు తమ ప్రభుత్వము త్రోసివేయుదురనియు, ప్రజలను నిరాయుధులనుగ జేయవలయుననియు, వారిని వీలయినంత వఱకును బానిసలుగాను, లోంగుబాటులోను ఉంచవలసినదనియును ఇంగ్లాండులోని ప్రజలు తలంచుచుండెడివారు, (used to think). కాని, ఆస్థితి యిప్పుడు మాఱిపోయినది. ఐరోపాఖండములో ప్రస్తుతము జరుగుచున్న సంగ్రామమువల్ల బ్రిటిషు సామ్రాజ్యములోనున్న అన్నిభాగములు ఏకీభవించిననే కాని, తాను పొందవలసిన బలమును సామ్రాజ్యము పొందనేరదనెడి ఆలోచనము ప్రారంభమైనది. వారి వలసప్రదేశములును (colonies), దొరల (sahebs) నివాసప్రదేశములును అగు ఆస్ట్రేలియా, కేనాడా, న్యూజీలండు దేశస్థుల సహాయాపేక్షయందు తామంటిమను జ్ఞానము వారి కిప్పు డుదయించునట్లుగా సంభవించినది. ఈజ్ఞానోదయము (awakened conscionsness) వలన, మీరు లాభము పొందఁదలఁచినయెడల, కొన్నిహక్కులను సంపాదించుటకు అదను మీకుఁగూడ కలిగియున్నది. కత్తిని ఉపయోగించి యీహక్కులు పొందవలసినదని యెవరును మీతో చెప్పరు. ఈదినమున ప్రజలమనను (nation's mind) మార్పును పొందినది. ఇంగ్లాండునకు హిందూదేశము కొంతసహాయము చేయఁగలదు. హిందూదేశము సుఖముగానున్న యెడల, ఇంగ్లాండునకు నొకవిధమైన ప్రఖ్యాతి (glory) బలమును ఘనతనుకూడ పొందును. ఈజ్ఞానమునకు (consciouness) ఇంగ్లండు మేల్కాంచినది. ఈయుదయించిన జ్ఞానమునుండి మనము లాభమును పొందకపోయిన యెడల, ఇట్టిఅదను మరల ఎప్పుడును రాదు. ఇదిచెడ్డదని (bureaucracy) తలంచుచున్నారు. దీనివలన ఏవరు నష్టముపొందెదరు? నిరంకుశాధికారవర్గము, (bureaucracy) కాని, చక్రవర్తి కాదు. కనుక, ఇది చెడ్డదని వారు తలంచెదరు. మనము స్వరాజ్యమునకు తగమనియు అందుచేతనే తాము ఇక్కడను

వచ్చితిమనియు వారుమనతో చెప్పుచున్నారు. వారు ఇక్కడలేని పూర్వ కాలమునందు మనహిందూదేశములో స్వరాజ్యము లేనట్లే! మనమంద ఱమును కిరాతులము. ఒకరితల నొకరుపగులఁ గొట్టుకొనుచుండెడివా రము. పీష్వాల ప్రభుత్వములో రాజ్యాంగపద్ధతియే లేదు. మహమ్మదీయ ప్రభుత్వములోను రాజ్యాంగపద్ధతి లేదు. మనకు, రాష్ట్రపరిపాలనమును నిర్వహించుటకు చేతకాకుండెడిది. బాటలువేయించుటకును మనకు సామర్థ్యము లేకుండెడిది. ప్రజ లెట్లు సుఖముగా నుందురో మనకు తెలి యకుండెడిది. నానాఫడ్నవీసు తెలివితక్కువవాఁడు. మాలికాంబరు ఒక తెలివితక్కువవాఁడు. అక్బరును అవరంగజేబును తెలివితక్కువ వారే.కనుకనే వారు మీమేలుకొఱకు ఇచ్చుటకిదయచేసినారు.' మీరు ఇంకను పసిపిల్లకాయలు. (హాసము, laughter) * మీరు పిల్లకాయ లని ఒకనిముసము ఒప్పుకొందము. మీరు ఇంకను ఎప్పటికి పెద్దవా రగుదురు? 21 ఇరువదియొకటవ సంవత్సరమువచ్చినయెడల ధర్మశాస్త్ర ప్రకారము మనుష్యుఁడు పెద్దవాఁడుగ గమనింపఁబడుచున్నాఁడు. వీరు మనలను 50 సంవత్సరములు పరిపాలించినను, మనమింకను పెద్దవార ముగా నెదుగలేదు. అయినను, 50 సంవత్సరములలో వారు ఏమి చేసి నారు? హిందూదేశములోని ప్రజలు పసిపిల్లలైనయెడల వారికి విద్యగఱ పించుట ఎవరివిధాయకము? అది వారి విధాయకమే. వారు పరిపాల కులు,వారు ఈవిధాయకకృత్యమును నెఱవేర్పలేదని నేను సాహసముచేసి చెప్పుచున్నాను. కనుక, మనము పిల్లలమగుటయే కాక, మనము పరిపాల నకు పనికిరాము. (ఆహ్లాదము). 50 సంవత్సరములు తాము పరిపాలించిన ప్రజలయొక్క స్థితిని బాగుపఱచలేనివారు తమ అధికారమును విడనాడి యితరులకు దానినిచ్చుట మంచిపని. మీఅంగడిలో ఒకనిర్వాహకు డుండి (manager) అతఁడు 50 సంవత్సరములు మునిమ్ (munim) పనిచేయుచు 50 సంవత్సరములు వరుసగా ప్రతిసంవత్సరమును మీకు

* ఈమాట మూలములో ఇంగ్లీషులోనున్నది.

నష్టమునే కలుగఁజేసినయెడల, అట్టివారితో నీవు ఏమిచెప్పెదవు? అయ్యా, మీరు ఉద్యోగమును చాలించి వెడలిపొండు. మావ్యవహారమును మేమేనిర్వహించుకొనెదము. ఒకఁడు క్రిందిమెట్టులో నుండ వచ్చును (lower grade), వాఁడు తెలివికలవాఁడు కాకపోయినప్పటికిని, బజారు వ్యవహారములు చేయుటలో అథమపక్షము దండుగఁఉండకూడదన్న సంగతియైనను, వానికి తెలియును. ఈసంగతియయినను వానికి తెలిసియుండును. మనము తగియుండలేదని వారుచెప్పెడిసంగతి స్వార్థపరత్వమునుండి వెలువడుచున్నది. వారు చెప్పినదినిజమే యైనయెడల, ఒకరీతిగా వారి కది అవమానకరమే. తగినవారు కారని ఋజువు అగుచున్నది. అది అబద్ధమైనయెడల, వారు స్వార్థపరులు. పై సంగతులనుండి తుదకు తేలిన యభిప్రాయము (conclusion) ఇదితప్ప వేఱులేదు. "మనము తగినవారము కాము" అనుటవలన, అర్థమేమి? మనకున్న లోపమెద్ది? (what is the matter with us?) మనమునిసిపల్ నిర్వాహకముచూచి అంగీకరించుచున్నారు (tolerated). ఇంగ్లాండునకేగి పరీక్షలయందుఁ గృతార్థతజెంది మనవాఁడు కలక్టెరుగా వచ్చినయెడల, అదివారు సహించుచున్నారు. వారు కార్యములను నిర్వహించుచున్నారు. ప్రభుత్వమువారు వారిని మెచ్చుకొనుచున్నారు. కాని, ప్రజలకు 'స్వరాజ్య' హక్కులను ఈయవలసివచ్చినప్పుడు ప్రజలందఱు పనికిరానివారు (అనఁగా తగినవారుకారు) అని సర్టిఫికేట్టుయిచ్చుట కోట్లకొలదియున్న జనులందఱు తగినవారుకారు అని నుడువుట తమయొక్క చేతగానితనము వెల్లడిచేసికొనుటయే. (అహ్లాదము). *

ఇదికాక స్వరాజ్యమునకు అనేకఅభ్యంతరములు చూపించుచున్నారు. మొదటిదేమనఁగా, నేను ఇదివరకు చెప్పినట్లుగా, జనులందఱును తగినవారుకారని వారు నిస్సందేహముగా నిశ్చయించుచున్నారు. పరీక్ష పెట్టవలసినదని మనము చెప్పినచో పరీక్షపెట్టరు. "తగరు, తగరు"

* ఈమాట మూలములో నింగ్లీషున నున్నది.

అనఁగా ఏమిటి ? మీమనుష్యులను పనులలో పెట్టండి, మావారిని పను లలో పెట్టండి, వారు చక్కఁగా పనిచేయఁగలరో చేయలేరో చూడండి. పనిచేయుటకును తగిన అవకాశమును మనకీయుఁడు; అయినను మనముతగ మని పేరుపెట్టెదరు. అవకాశమీయఁబడినవారు తగనివారని నిశ్చయిం పఁబడినారా ? శాసనసభలలో సభ్యులున్నారు; వారు పనికిరానివారా? తాము పనికిరానివారము అని వారు ఎప్పుడైనను అనుకున్నారా? వారు చేతకానివారని మీరు ఎప్పుడైన అనినారా ? లేదు. చేతకాదు. అనఁ గా నీకేమి అర్థమున్నది? మీరు ఇయ్యఁదలఁచుకోలేదు అనుమాటయే. మజ్జిగ లేదు అనిచెప్పుటకు మోసముచేయవలసిన అవసరమున్నదా ? ఈదినము ఆదివారము కనుక మజ్జిగ లేదు—ఇప్పుడు ఇట్టి తలక్రిందులు జరుగుచున్నవి. అట్టిమోసమును (shuffling) చేయనీయక ధైర్య ముతో పట్టుపట్టి అడుగుటకు సంసిద్ధులై యున్నారా లేరా అనుసం గతిమిమ్ము నేనుఅడుగఁదలఁచితిని. అడుగుటకు మీరుసంసిద్ధులై యుండని యెడల, నీవిషయమై అవశ్యముగా ప్రార్థించనయెడలను, ప్రస్తుతావ కాశమును మీరు త్రోసివేసినయెడలను, మీకు 100 సంవత్సరములవఱకు ఇట్టి అవకాశము తిరిగిరాదు. కనుకనే, మీరు సంసిద్ధులై యుండుఁడు. మీరు సంసిద్ధులైయుండి కొంచెము గంభీరముగా (a little forcibly) మాటలాడినయెడల, ఏపోలీసుసిపాయియైన 'నీవా' అనునన్నసంగతి నాకుఁ దెలియును. (ఇది అసంభవము కాదు), కాని దీనిని మనము ఓర్చు కోవలసినదే. దీనిని తప్పించుమార్గము లేదు. మనచేతిలో అధికారము లేదు. "నీవు తెలివితక్కువవాఁడవు. అవతలికిపొమ్ము" అని పోలీసుసిపా యితో మనము చెప్పలేము. వాఁడు పోలీసు ఇన్స్పెక్టరుయొక్క ఉత్త రువు నవలంబించును. అన్నిమతముల వారును, అన్నిశాఖలవారునుఅగు మీరు సంక్షోభవించి పట్టుదలతో ఏకగ్రీవముగా ఈసమయమందు కోరిన యెడలను, మనఃపూర్తితో నీవిషయమై నొక్కియడిగినయెడలను, దీనికి కావలసినఖర్చును భరించుటకు సిద్ధపడి మీకోరిక చెల్లించినగాని, మీరు

తృప్తిఁబొంది సుఖముగానుండవలెనని ప్రభుత్వమునకేగాక, ప్రపంచమునకంతకును తెలియఁజేసినయెడలఁ గొలఁదికాలములోనే భగవదనుగ్రహమువలన మీకోరికను పొందగలరని నేను దృఢముగా నమ్ముచున్నానని చెప్పఁగలను. మీపట్టుదలనుండి వచ్చు ఫలిత మిదియే. మతవిషయములలోను, రాజకీయవిషయములలోను పట్టుదలకావలయును. ధైర్యములేనియెడల, మనోనిశ్చయము ముఖ్యవింపదు. "ఎలాగు పరిణమించునో?" అని అనుకొనుట తగదు. మంచివచ్చినను చెడుగువచ్చినను మాకు ఈవస్తువే కావలయును. ఈవస్తువే కావలయునని మనముకోరుచున్నాము. దీనికొఱకు సొమ్మువసూలుచేసి అవసరమైనఖర్చును కాయకష్టములను ననుభవించెదము. మనకోరిక నెఱవేఱువఱకు ఈఆందోళనమును ఆపివేయము. మన జీవితకాలములో నీపని సమాప్తిచెందనియెడల మనబిడ్డలుకూడ నీఆందోళనమును నిలువఁబెట్టుదురు. ఈపనివిషయమై యింతపట్టుదల యుండినప్పుడుమాత్రమే మనకు ఫలము లభించును. పట్టుదలలేనియెడల, భగవంతునివలనఁగాని, రాజువలనఁగాని, ఇహపరములయందు ఫలములభింపదు. ఈవిషయమై గట్టిగ పాటుపడినప్పటికిని మీకు పట్టుదలలేనియెడల, ఫలమును పొందనేరరు. మొట్టమొదట పట్టుదల కావలయును. ధనికులును పేదలునుకూడ పట్టుదల కలిగియుండవలయును. పేదలు తమకు వీలయినవిధము సహాయము చేయవలయును. ధనికులుతమకు వీలయిన విధముగ సహాయము చేయవలయును. బుద్ధిసూక్ష్మతగలవారు (intelligence) వారి బుద్ధిమూలమున సహాయము చేయవలయును. ప్రతిమనుష్యుఁడు నీవిషయమును మనస్సులో నెప్పుడును ఉంచుకొనవలయును. ఈ విషయమును మీరు ఎప్పుడును మనస్సునయుంచుకొనవలయును. మీరు కష్టపడుటకు సంసిద్ధులు కాకపోయినయెడల, నిర్జయులయినప్పుడు (for- the failure) ఇతరులమీఁద నేరముద్రోయుట ఉత్త తెలివితక్కువ, (sheer folly). తెలివితక్కువ యనుమాటను మీరు తేలికగా సహింపరు. అట్లు ప్రసంగధోరణిలో నంటిని. (I uttered it in the heat

of speaking). తగినంత పట్టుదలతోను మనఃపూర్తితోను గట్టిగా మనము ప్రయత్నములు చేయుటలేదని నాదృఢనమ్మకము. మీకు అధికారమిచ్చిన గందరగోళము ఉండునా లేదా' అని ఒకదొర మిమ్ము అడిగినయెడ ''అవును, అవును, మాలో మనుష్యులు లేరు. మేము సిద్ధముగా లేము'' అని మీరుత్తరమిచ్చెదరు. తరువాత, దొరగారివిషయమై మన యింట్లో నవ్వెదము. అక్కడ మనము నవ్వకతప్పదు. (ఆహ్లాదము, హాసము). మనయింట్లో నవ్వుటతగదు. అతనిముఖముమీదనే ఉత్తర మీయవలయును. ఏసంగతులను మనము నిజమని నమ్ముచున్నామో అట్టివానిని ప్రజలముందును, ఉద్యోగస్థులముందును, చక్రవర్తిముందు నుగూడ నిలునఁబెట్టుకొనుటకు మనము సంసిద్ధులమై యుండవలయును. దీనికి మీరు ఏదినమున సిద్ధులుగానుందురో—ముఖ్యముగా ఈదినము లలో యుద్ధము ముగించగానే—అధమపక్షము కొన్ని విషయములయందైనను పరిపాలనాపద్ధతి మార్పుచెందును. ప్రస్తుతపురీతినే పరిపాలన పద్ధతియున్నయెడల, ఐరోపాదేశస్థులందఱిలో ఇంగ్లాండు అధికారమును ఇయ్యదు. *

ప్రస్తుత మింగ్లాండు దేశము అన్ని దేశములకంటెను మిక్కిలి బలము కలది. ఆంగ్లేయప్రభుత్వము మిక్కిలి బలిష్ఠమైనది. కాని, దాని నట్లుంచుటకు ప్రస్తుతపరిపాలనాపద్ధతిలో మార్పు విధాయకముగా చేయఁబడును. నిజముగా 'ఆమార్పును చేయుఁడు' అని వారు చెప్పుచున్నారు. మార్పు చేయవలసినదని హిందూదేశము చెప్పదు. ఏవో కొన్నిలోపములు దాని యందు కనఁబడుచున్నవి. ఈదినము నేను నిలుచుండి చెప్పుచున్నాఁడను. రేపు మఱియొకఁడు నిలుచుండి ''మీమేలు దీనిలో లేదు' అని చెప్ప వచ్చును. ప్రస్తుత మమలులో నున్న పద్ధతియే మంచిది. దయాళువైన ప్రభుత్వ మున్నది. నిరంకుశాధికారవర్గము వారు (bureaucracy) బుద్ధిమంతులు. కాఁబట్టి వారిమార్గముల ననుసరించి మీరు వర్తించినయెడల

* ఈవాక్యము మూలములో స్పష్టముగా లేదు.

మీరు మేలుపొందెదరు.'' మీరు బానిసలుగా నుండఁగోరినయెడల నట్లుచేయుఁడు. చేయవలదని ఎవ్వరును చెప్పరు. బానిసత్వ మిష్టమున్న వానికి హితోపదేశము వందలకొలఁది చేసినను ప్రయోజనము లేదు. బానిసత్వములోనుండఁదలఁచుకొన్నవాఁడు స్వేచ్ఛగానట్లుచేయవచ్చును. కాని ఇది పౌరుల (citizens) స్థితికాదు. ఇది వర్తకులయొక్క స్థితికాదు. ఇది బుద్ధిమంతుల స్థితికాదు. ముసల్మానులు మొదలయిన ఏమతస్థులకు నుండవలసిన స్థితికాదు. ఒక్కతరగతికిమాత్రమే ఒక్కమహమ్మదీయ వర్తకులకుమాత్రమే యీవిషయము మన్వయించదు. నేను చెప్పఁబోవుసంగతి మహమ్మదీయులకు మాత్రమేకాదు, హిందువులకు మాత్రమేకాదు, వర్తకులకు మాత్రమేకాదు. అది అందఱకును వర్తించును. అందఱకును ఒక్క ఔషధమే కలదు. ఆఔషధము అధికారమే. దానిని మీరు స్వాధీనము చేసికొనుఁడు. అది మనకు స్వాధీనమైనప్పుడు మీకును మాకును ఏదేని వ్యాజ్యములున్నయెడల వానిని మనమే తీర్చుకొనఁగలము. అధికారము మనచేతిలోనికి వచ్చినతరువాత, వానిని చక్కఁబఱచుకొనుటకు మనకు చాలవ్యవధియుండును. మతవిషయిక నమ్మకములలో ఏదేని యభిప్రాయభేదము లున్నయెడల దానిని మనము సరిచేసికొందుము. దీనికొఱకు మనకు అధికారము కావలయును. కలహములను సరిచేసికొనుటకు అధికారము కావలయును. వానిని వృద్ధిచేయుటకు మనము అధికారమును కోరుటలేదు.

మనదేశమునకు ఏమిచేయవలయునో మనకు తెలిసినట్లుగా అన్యులకు తెలియదు. వారిదృగ్విషయము వేరు. (Their point of view is different) కనుక, శిరమున (at the head) బ్రిటిషు ప్రభుత్వము నిలుపుటవలన బ్రిటిషు సామ్రాజ్యమునంతట నేలునట్లుగనే ఒకేచక్రవర్తి మన హిందూదేశమును పరిపాలించును. కాని వలసప్రదేశముల (colonie) లోనున్న పద్ధతివలె ఇక్కడ నొకఏర్పాటును తీసికొనిరావలయును. ఆవలసప్రదేశములలో స్వత్వపు హక్కును (right of ownership)

శాసనములు చేయుటకు నధికారమును అన్ని అధికారములను వారు కలిగియున్నారు. అది చక్రవర్తికి సంబంధించదు. (That does not affect the Emperor) బ్రిటిషు ప్రభుత్వమును తొలఁగించుటకు ఎట్టి ప్రయత్నమును లేదు. కాని, ప్రజలను నెక్కువ యింపుగానుండునట్లుగా బ్రిటిషు పరిపాలనమును మార్చుటకు ఇదియొక ప్రయత్నము. కొంతమంది జీవనోపాధిని కోలుపోవుదురు. అట్లు కాదనము. అట్టి ప్రజలకు హిందూ దేశమును చక్రవర్తి ప్రత్యేకముగా నుంచెనని (reserved) మేము తలంపము. ఒకానొక కారణమువలన ప్రస్తుతపు ఏర్పాటు అమలులోనికి వచ్చినది. అది పోవలయును. ప్రజలహస్తములలోనికి అధికారమును చక్రవర్తి యీయవలయును హిందూప్రజలకును బ్రిటిషు ప్రజలకును తెల్లప్రజలకును నల్లప్రజలకును ఎట్టిభేదమును కల్పింపకుండ వారు చక్రవర్తికి ఎట్టిప్రజలో మనమునుఅట్టిప్రజలమే (subjects), వారెంతసౌఖ్యముగానున్నారో మనమంత సౌఖ్యముగా నుండవలయును. వీనికన్నిటికిని బీగమని బుద్ధిమంతులచేతను, విద్యావంతులచేతను, జ్ఞానులచేతను ఎన్నుకొనఁబడినది స్వరాజ్యమే. దానికి తగినకాలము సమీపించినది. దాని అర్థము మీకు బోధపఱచితిని. దానియొక్క సమయ మెట్లువచ్చినదో మీకు చెప్పితిని. అన్నివస్తువు లున్నప్పటికిని మీపట్టుదలయే కొనసాగించునది. ఇప్పుడు వచ్చిన సమయము పోవును. నేనుచెప్పిన యేర్పాటును మీధ్యానములో నుంచినను, మీరు దానిని సంపాదించలేరు. మీలో పట్టుదల యుండవలెను. దానిని సంపాదించు విషయమై ఆందోళనము ప్రారంభింపఁబడుటయే మనయదృష్టము.

స్వరాజ్యముకొఱకు పాటుపడుటకే ఒకసంఘము నీమధ్యనే బెల్గాములో మేము స్థాపనచేసితిమి. మద్రాసులో నొకసంఘము స్థాపింపఁబడినది. ఈవిషయ మప్పుడే దేశీయమహాజనసభ (congress) లోనికి వచ్చినది. ఇటుగాని అటుగాని దానిని నిర్ధారణచేయును. కాని, వేరు వేరురాష్ట్రములు తమయేర్పాటులను చేసికొని వానికి సహాయము

చేయుచున్నను "మీకు ఏమి కావలయును," అని కలెక్టరుగాని, కమీషనరుగాని, లేక యేఅధికారిగాని మిమ్ముఅడిగినప్పుడు "మాకు అధికారము కావలయును. అదిమాచేతులలో నుండవలయు"నని చెప్పుటకు తగినంతధైర్యమునైన అధమపక్షము మీకు కలిగియుండవలయును. ప్రభుత్వముయొక్క సేవకులు (servants) ప్రజలయొక్క సేవకులుగా నెన్నఁబడవలయును. భావికాలమందు మీకధికారము వచ్చినయెడల యూరోపియనులను మీసేవకులుగా నుంచకూడదని మీరు తలంచవద్దు. అతఁడు సరిగా పని చేయఁగలిగినయెడల మనముంచుకొనెదము. ఎంతజీతము వానికి తగునని మనకుతోఁచునో అంతయిచ్చెదము. కాని, అతఁడు మన సేవకుఁడై యుండవలయును. మనము అతనిసేవకులముకాము. ఈకోరికనే మీరు కలిగియున్నయెడలను, దీనికొఱకే మీరు ప్రయత్నముచేసినయెడలను, మీకిది సుసాధ్యమగును,(capable of accomplishment). దీనికి కావలసిన సహాయమును మీకొసంగుఁదు. ఈవిషయమై మనకుపన్యసించుటకు వచ్చువారికి కావలసిన సదుపాయముల నొసఁగుటకు సిద్ధముగా నుందుఁదు. మీరిట్లు సిద్ధముగా నున్నప్పుడే బొంబాయి, పూనా, నాగర్ (Nagar) పట్టణప్రజలును, బెంగాలు, మదరాసు మొదలయిన అన్నిప్రదేశముల ప్రజలును సిద్ధముగా నున్నప్పుడే యీకార్యము సాధ్యమగును. దీనిని నెఱవేర్చుటకును, దీనిని శీఘ్రకాలములోనే నెఱవేర్చుటకును దీనికొఱకు పాటుపడుఁడు. ఇంతమాత్ర మీవిషయమై మీతో ప్రసంగించితిని. నాయుపన్యాసములోపొరబాటులున్నయెడలను మీవిషయమై ఎత్తిపొడుపుమాటలున్నయెడలను క్షమింపుఁడని మిమ్ముకోరుచు పై పద్ధతిననుసరించి ఏదేనికొంతఫలమును చూచునసమయము హిందూదేశమునకు త్వరలో సంభవించునని కోరుచు మనఃపూర్వకముగు వందనముల నాచరించుచున్నాఁడను.

తే 1-6-1916ది అహమ్మదునగరమున లోకమాన్య

# బాలగంగాధరతిలకుగారి ద్వితీయోపన్యాసము.

(“ తిలక్ మహారాజ్‌కీ జై ” అని చప్పట్లు కొట్టఁబడినవి.)

నేను నిన్నటిదిన ముపన్యసించిన పిమ్మట మఱియొకయుపన్యాస మిచ్చుట తటస్థించు నని నే ననుకొనలేదు. నేనప్పు డొకగంటలో స్వరాజ్యవిషయమునుగూర్చి, రెండు లేక నాలుగుసామాన్యవిషయములను జెప్పితిని. కాని ఒకయుపన్యాసమేగాక, పదియుపన్యాసములయినను ఈవిషయమునకు చాలవు. కాఁబట్టి ఆవిషయము నే మిక్కిలి స్పష్టముగను బాగుగ గ్రహింపఁబడునట్లుగను, దానింగూర్చి ప్రజలయభిప్రాయములు మిగుల తేటగనుండునట్లును, స్వరాజ్యమునుగూర్చి నిన్న చెప్పినవిషయములేగాక, మఱి రెండువిషయముల నిప్పుడు మరల నేను చెప్పఁబూనినాఁడను. మతము కావలయునను సంస్కరణము లన్నియును స్వరాజ్యమునకు సంబంధించినవేయని నా సామాన్యాభిప్రాయము. తెలుచుగా ముసలమ్మసామెతను మీరెఱిఁగియే యున్నారు. అది ఈ క్రిందివిధముగ నున్నది. ఆముసలమ్మ దేవతనుపూజించిన పిమ్మట యేమి (వరము) కోరవలయునోయని యాలోచించి యీక్రిందివరమునకై ప్రార్థించినది — దేవత నాకీయవలసినవర మెట్టిదనఁగా, నామనుమలు బంగారు పళ్లెరములలో భుజించుటను నేను జూడవలయును. అనఁగా అంతకాలమామె జీవింపవలయుననియు, ఆమెకు కుమారుఁడు కలుగవలయుననియు అతఁడు ధన మార్జింపవలయుననియు మొదలగునవి. ఈ చిన్నవరములో నామెకోరికంతయు నిమిడియున్నది. స్వరాజ్యమునువిషయము నట్టిదే. మనకు స్వరాజ్యమబ్బనియెడల పరిశ్రామికాభివృద్ధియుండదు. మనకు స్వరాజ్యమబ్బనియెడల ప్రజల (nation) కు పనికివచ్చు ప్రారంభవిద్యగాని, ఉన్నతవిద్యగాని కలుగుట కవకాశముండదు. మనకు

స్వరాజ్యమబ్బనియెడల స్త్రీవిద్యాభివృద్ధికలిగినను, పరిశ్రామికాభివృద్ధి కలిగినను, సంఘసంస్కరణముకలిగినను, నిష్ప్రయోజనమే. ఇవన్నియు స్వరాజ్యభాగములే. ప్రథమమున అధికారము (కావలయును), ఉండిన జ్ఞానము (or వివేకము) ఉండును. అధికారమునుండి జ్ఞానము (వివేకము) వేఱుకాదు. అట్లగుచో నదినిష్ప్రయోజనము. ఏ దేశము (nation) నందైనను ఈయుపపాదనము (proposition) ఇంతకంటె నెక్కువ స్పష్టపఱచనక్కఱలేదు; కాని మనప్రజలకు ఒకముఖ్యపద్ధతిని బోధపఱచుటావశ్యకము. ఇందులకుకారణము మన దేశములో స్వరాజ్యము లేకుండుటయే. మనపక్షమువారిని కొందఱు ఇట్లాక్షేపింతురు. మీరుసంఘసంస్కరణమేల చేసికొనకూడదు? మనకు స్వరాజ్యము ఈయదలఁచనట్టియును, మనయాందోళనము నొకవైపునుంచి మఱియొకవైపునను మరల్పఁదలఁచునట్టియును వారిట్లు చెప్పుచున్నారుగాని, మనమిట్లనుట లేదు. వారిలో వారు సంఘసంస్కరణము చేసికొనినవా రనేకులున్నారు. బర్మాదేశములో సంఘసంస్కరణము పూర్ణముగ జరిగినది. వారిమతమొక్కటి, వారు దేనికిని సంసిద్ధులయియున్నారు. వారిబిడ్డలు ఇష్టమునచ్చినవారిని వివాహమాడెదరు. కాని, ఆదేశము పరతంత్రమై మునిఁగినస్థితియందున్నది. అచట నేవిషయములోను జాతీయతయనుశక్తి లేదు. కనుక, ఏమికావలయును? మన మొక దేశస్థుల (nation or జాతి) మే. మన మీప్రపంచమున జరుపవలసినవిధి యొకటియున్నది. మనకు స్వభావసిద్ధముగ మనుజున కుండవలసినహక్కులు కావలసియున్నవి. మనకు స్వేచ్ఛ కావలయును. మనవ్యవహారములను మనముచక్కపెట్టుకొనుహక్కు మన చేతులలో నుండవలయును. మన కిట్టివి లభించనియెడల ఎట్టిసంస్కరణమైనను నిష్ఫల మగును. అన్నిసంస్కరణముల కదిమూలము. అధికారము లేనియెడల వివేకము (జ్ఞానము) ఉండదు. పుస్తకపాండిత్యముమాత్రము వ్యర్థము. మనమీఁద నధికారము చేయుటకు వచ్చినజనులు బుద్ధియందును పాండిత్యమునందును మనకంటె నెక్కువవారని మీరు

నమ్మినను నానమ్మికమట్టిదికాదు. వారికున్నంతపాండిత్యము ధైర్యము సమర్థతలు మనము కనబఱచఁగలము. ఒకవేళ ఇప్పుడవి కనిపించకపోవచ్చునుగాని ఆశక్తి మనయందున్నది. చరిత్రయందును ఖగోళశాస్త్రమందును కూడ కూటమి (conjunctions) కలదు. మహమ్మదీయప్రభుత్వమంతరించుచున్నప్పుడు మహారాష్ట్రులు కొలఁదికాలములోనే తలయెత్తి సాగిరి. అటుపిమ్మట ఆంగ్లేయులు ఇండియాలో కాలుపెట్టినందున, అధికారమంతయు వారివశమైనది. మనము వారియెడ నగపఱచునట్టి మెప్పునకును వారిసమర్థతయెడ కనఁబఱచు—(నిజమగునట్టిగాని అబద్ధమగునట్టిగాని)—గర్వమునకును వారి యధికారమే కారణము. ఈయధికారములో నెంతకొద్దిమాత్రమైనను మీచేతులలోనికి వచ్చినప్పుడు, మీ పాండిత్యము పనికివచ్చును. మన మనేకవిషయముల నపేక్షించుచున్నారము. మన పరిశ్రమలు వృద్ధికావలయును. అదియెందుల కాగినది? దానినెవరాపిరి? మన మిందులకు కారణమును వెదకునెడల పరిశ్రామిక సంస్కరణములు మనమాపలేదనియు, ఆర్థికసంస్కరణమును (economic reform) మన మాపలేదనియు కనఁబడును.—ఏదేశము (nation)లో నిలుచుటకును సమర్థతనగపఱచుటకును (మార్గమున్నదో) స్వతంత్రముకలదో అక్కడ సుగుణసంపత్తి వర్ధిల్లును. ఎక్కడ బొత్తుగా బానిసతనమును దాస్యమును (bondage)నుండునో అచట నెట్టిగుణములువృద్ధియగును? యజమానియొక్క చిత్తానుసారముకాని మఱొకరీతి నెద్దియు జరుగనేరదు. ఆయన యిష్టపడునంతవఱకు మాత్రమే మీ రభివృద్ధి పొందుదురు. మీకు పాండిత్యమున్నయెడల మీరొక గొప్పయుద్యోగస్థునికి సహాయముచేసినప్పుడును ఆయనమిమ్మును 'సెబాసు' అనునప్పుడును మీకుసమర్థతకలదని మీరనుకొనెదరు. ఇదొకవిధమగుదుర్బలబుద్ధి,—ధైర్యములేమి, (want of spirit)—మఱియునిది దేశము (nation)నంతయు వ్యాపరించియున్నది. 'నేనుచేయలేను' అని నీవనెదవు. నీవు దానినెప్పుడును చేయలేవు. నీకెవరును పట్టా (sannad) నీయలేదు, అంతకు

పూర్వము కూడ నేనది చేయలేను, ఇది చేయలేనని రోదనము చేయుదువు. ఇట్లనుచు వారు మఱియొక మార్గ మవలంబింతురు. తుదకు మన మహారాష్ట్రములో నయినను కొందఱీ వయివిధము గు మిష పెట్టి స్వరాజ్యపు హక్కులను సంపాదించుటకు జరుగుచున్న ఆందోళనమునకు భంగము కలిగించుట గొప్ప దురదృష్టమని నాయభిప్రాయము. దీనిని ఆలోచింపుడు: మహారాష్ట్ర దేశములో ప్రజలకు (nation) ఉపకరించు గుణము లున్నవి కాని, ప్రస్తుతము అట్టిగుణము నుపయోగించుటకు మన కవకాశము దొరకదు. మఱియు, అట్టి అవకాశము మనకీయఁబడనందున మాత్రమే స్త్రీవిద్యావిషయమునకుఁగాని, మఱేవిషయమునకుఁగాని, మనబుద్ధి తిరుగదు. ఇందులో నెవరయిన అపాయ మున్నదని యెంచు నెడల అతఁడట్లు చేయనగునుగాని, నామనస్సు తృప్తినొందఁజాలదు; తృప్తిపఱుపఁబడదు. నేనీక జీవించనున్న కొద్దిసంవత్సరములలో తృప్తిపఱచఁబడునని నేనను కొనను. (ఆహ్లాదము). తక్కినవిషయములనుగూర్చి, మాటలాడుట నిష్ప్రయోజనము. ప్రస్తుతము మనజనులు పరాక్రమము, ధైర్యము, పాండిత్యములును కలిగియుండ లేదు; మనస్త్రీలు విద్యావంతులగునప్పుడు వారి సంతతివా రట్టివారగుదురు. కాని, అందులకుకూడ మనమే విత్తనము (seed) వేయవలయును. (ఆహ్లాదము). ఎవరికైన నట్టి (పైనిచెప్పఁబడిన) నమ్మకమున్నయెడల అది సరియైనది కాదు. స్త్రీవిద్య యవసరము లేదని నేననుకొని, మనల నీ ఆందోళనమునుండి త్రిప్పుటకుగాను దానివైపునకు తిరుగుమని వారనునప్పుడు 'దేశము (nation)ను నాశనము చేయుట కిదియొక ఔషధము' అనిమనము నెదము. నీకు బలము లేనియెడలను నీవు దేనినైన సంపాదించుటకు తగుసాహసము (pluck) లేనియెడలను విద్యావతిని పెండ్లియాడి యామెవలన కలుగుసంతాన మట్లే (విద్యావంతులు) అగుదురనుటయును, వారు మనయెడల కలిగియుండు బాధ్యతలను నెఱవేర్చుటకుఁగాని లేక ఋణములను తీర్చుటకుఁగాని ప్రయత్నించెదరు అనుటయు వట్టి వెఱ్ఱితనము. (ఆహ్లాదము). మీకాళ్లమీఁదనే మీరు

నిలుపవలయును. మీరు దీనిని నెఱవేర్పవలయును. వీనిలో ముఖ్యమగు దానిని మీరు నెఱవేర్ప (bring about) వలయును. గతించిన 50 సంవత్సరములనుండి ప్రయత్నములు చేసినవారి అనుభవమునుబట్టి అన్నివిషయములకును స్వరాజ్యము బీగము (or తాళపుచెవి, key) వంటిది. మఱియునది మీ చేతులలోనికి రానియెడల అంతట "మేము చిన్నచిన్న సంస్కరణములకు ప్రయత్నించి యీసంస్కరణ మొనర్తుము," అనునెడల,.....స్వరాజ్యమునకు (యీమార్గము) సహకారి కాదు. ఆయభిప్రాయ ప్రకారమే నిన్నటిదినము నే నుపన్యసించి యీవిషయమును గూర్చియే యీదినముకూడ మాటలాడుచున్నాను. "స్వరాజ్యము" న కర్థము నిన్నటి దినమున చెప్పితిని. స్వరాజ్యమనఁగా ఆంగ్లేయులను తరిమివేయుట కాదు. రాజెవరైనను ఇబ్బందిలేదు. (If does not matter whoever may be the King). మనకు రాజుతో పనిలేదు. మనహక్కులు మనకువచ్చిన చాలును. మఱియు, మనపై రాజుగా రెవరున్నను ఆహక్కులను సంపాదింపవచ్చును. ఇంగ్లాండులో ఒకరాజున్నాఁడు.... కాని ఆంగ్లజనులకు హక్కులున్నవా, లేవా ? ఇంగ్లాండుయొక్క రాజే మనచక్రవర్తి కావున, ఇంగ్లాండులో నాయన రాజుగనున్నంతవఱకు ఆంగ్లజనులకు స్వతంత్ర సంబంధమగు హక్కులు కలిగియుండునెడల, ఆరాజే ఇండియాదేశపు చక్రవర్తికూడనై యున్నందున, మనము బ్రిటిషుపౌరత్వము (British citizenship) ను పొందుటలో నేమిప్రతిబంధకమున్నది ? ఎట్టికష్టము నుండదు. చేయుబడు దురారోపణ (dark imputation) ము అనఁగా హోమ్‌రూలు—స్వరాజ్యవిషయమగు నాందోళనము—రాజద్రోహమైనదని. అదిరాజద్రోహమను నమ్మకముతో కొద్దిదినములక్రిందట (the other day) అనీబెసంటుగారియొద్ద రు 2,000 లను జామీనుగా పుచ్చుకొనిరి.—ఈయారోపణము, ఈనింద (accusation) చక్రవర్తిగారి యొద్దనుండి రాదు, ప్రజల (subjects) యొద్దనుండిరాదు, కాని, ప్రాతళ్లను కాపలాచేయువారు (granary keepers) అగుమధ్యవారినుండి

వచ్చుచున్నది. (ఆహ్లాదము). ఈపరిపాలనము మారునట్లు చేయుటయే మనకర్తవ్యము. రాజు మారనవసరము లేదు. ఈపద్ధతి—పరిపాలనము దేనిప్రకారము జరుగుచున్నదో అట్టియేర్పాటు మారనియెడల ఇండియాలోని ప్రతిమానవుఁడును అంతకంతకు ఎక్కువ నపుంసకుఁడు (effiminate) అగును. మనము చేయవలసినవిధి అదియే. బానిసతనపు ప్రతిష్ఠాపనలు(institutions), ఇట్టిబానిసతనముండిన నేమి (నష్టము) అని కొందఱందురు. వారైనను తిండికిచ్చుటలేదా? వారెవరినైనను తిండి లేక చచ్చునట్లు చేయుదురు పక్షులు, పశువులుకూడ తినుటకుసంపాదించుకొనును. తిండి సంపాదించుకొనుట (మాత్రమే) మనుష్యుని యాశయము (aim) కాదు. కుటుంబమునకుతిండిపెట్టుట(మాత్రమే) మనుష్యుని యాశయము కాదు. కాకిసైతము చాలకాలము బ్రతికి బలుల (బలి=offering)ను తినును. కాకితనజీవనముజరుపుకొనును. అది పంటలనుపండించనక్కఱ లేదు. ప్రతిదినము పండినఅన్నము దానికిదొరకును. ఒకఁడు తనజీవనము, జరుపుకొనుటయును, ఉదరపోషణము చేసికొనుటయును, రాజుగారిచే నేర్పఱచఁబడిన హద్దులలోపల నవకాశమీయఁబడు (kept open) నుద్యోగముల నొప్పుకొని వారియాజ్ఞలకు లోఁబడుటయును, ఆయన చిత్తానుసారముగ జీవించుటయును మాత్రము మగతనమని (manliness) నేనెంచను. ఈస్వభావము మనుష్యులకును పశువులకును సామాన్యమే. మనుష్యునియందు పుంసత్వము (manhood) ఉండవలసినయెడల మనబుద్ధికిని, మనసమర్థతకును, మనధైర్యసాహసములకును తగినంతఅవకాశ మున్నదేమో చూడవలయును. కాఁబట్టి మీరుచేయవలసినవిధి యేమైననున్నయెడల, అట్టి అధికారమును వశపఱచుకొనుటయే ప్రథమకృత్యము. కొద్దిభాగమును మీరు తీసికొనినను చింతలేదు. నాగరుజిల్లా సభాధ్యక్షుఁడగు యన్. సి. కేల్కారుగారు (Mr. N. C. Kelkar, President of the Nagar District Conference) సంగ్రహముగను మనకు దెలిపినట్లును చెప్పినట్లు, మనము చెల్లించు

పశువుల నేయే కార్యములు నిమిత్తము ఖర్చుపెట్టవలయునని 5, 6 మను ష్యుల యిష్టానుసారముగను స్థిరపఱచుకొని మనద్రవ్యమును మనము ఖర్చుపెట్టువిషయములో మనయిష్టప్రకారము (or స్వేచ్ఛగా)వని చేయు టకు కోరిక (hope)ను మనము కలిగియుండనియెడల, ప్రకృతిశాస్త్రి ప్రకారము మనుష్యుల మనస్సులందున్న యిట్టికోరిక (hope or thought) క్రమముగా తగ్గిపోయి, అంతవఱకు (to that extent) మనము అంతకంతకు పశువుల స్థితికి వత్తుము; (discend). 'స్వరాజ్యము' 'స్వరాజ్యము' అననేమి? దానిఫలిత మేమగును? స్వరాజ్యమనంగా నొకకలెక్టరును తొలంగించి మీామనుష్యుని యేర్పఱచుటయేనా? దేశీయుండగు కలెక్టరునిలిచితునకు ఆంగ్లేయకలెక్టర్లువచ్చునెడల వారుకావలయును.... అట్టిమనుష్యునితొలంగించి అట్టిస్థానములలో నట్టివారినేర్పఱుచుమనినచో నాక్షేపణయుండదు. ఒకవేళ తెల్లవానికిజీతమిచ్చునెడల నతండు మనవవు కరుగాకూడ నుండవచ్చును.అతండుమంచివాండగునెడల మనమతనినుంచ వచ్చును. ఇది వ్యక్తుల (or మనుష్యుల, individuals) ను గూర్చిన సమస్య కాదు. ఇది ప్రజలనుగూర్చిన సమస్య. ఒకజాతిని (ప్రజలు, nation) పశువులవలె భావించవలయునా? లేక, ఆజాతిలోని ప్రజలను మనుష్యులుగ నెంచి వారిభావమును స్వతంత్రాభిలాషను ఒకవైపునకువంచి వారినితెచ్చి నాగరకతగలదేశము (ప్రజలు)లలో చేర్చవలయునా? అనునదే ముఖ్యసమస్య. ఈవిధముగ (stand-point) నీవిషయమును నాలోచించునెడల స్వరాజ్యమును సంపాదించుటకంటెను, అధికారమును వశపఱచుకొనుటకంటెను, దీనిని నెఱవేర్చుకొనుటకు వేఱుపదుపాయము లేదు. ఒకపర్యాయము మధికారము మనచేతులలోనికి వచ్చినవుడు మనము వేలకొలంది పనులను చేయుటకు సమర్థుల మగుదుము. ఒకటి, లేక రెండువేల రూపాయలు ఆదాయమును గవర్నమెంటువారికిం గలుగం జేయంగల మద్యపు (liquor) దుకాణమును మూయుటకు పూనాలో నొకపెద్ద ప్రయత్నము జరిగినది. దానినిమూయుటకు మనఅధికారములో

లేదు. ఒకదుకాణము నొకచోట పెట్టవలయుననికాని, పెట్టకూడదనికాని నిశ్చయించుటకు ఇంతయుత్తరప్రత్యుత్తరములు (correspondence) ఎందులకు? దానివిషయములో జరుగు వ్రాతనిమిత్తము కావలసిన కాగితపుఖరీదుకు దానివలన సంవత్సరమునకువచ్చులాభమునకు చాలదని నాయభిప్రాయము. (హాసము, వినుఁడు, వినుఁడు, Hear, Hear) ప్రస్తుతపద్ధతిలో జరుగుచున్న యీపాలనని మాన్పవలయును. ఈదౌర్జన్యము (high-handedness) అంతమొందవలయును. ఈఅధికారము మన చేతులలోనికి రావలయును. అధికారము మన చేతులలోనికివచ్చుటవలన మనకువారసత్వపు (వంశపరంపర, heriditary) గుణములు పెంపగును. ఏదో యొకవిధమున నీగుణముల నుపయోగించుటకు మనకు మార్గముదొరకును. అదియే స్వరాజ్యము; స్వరాజ్యమన మఱియొకటికాదు. అది కొలఁదిమాత్రమైననేమి? అది మిమ్ముకష్టపెట్టదు. అది పెట్టవలసినంతకష్టమును పెట్టదు. ఇంటిలోకూర్చుండి ఏదో యొకపని చేసికొని కొంతద్రవ్యమునార్జించి కుటుంబమును సంరక్షణచేసికొనుట చాలును అనునెడల, ఇప్పుడు స్వరాజ్యాందోళన మెందులకుచేయవలయును? ఈప్రపంచమున మనకంటె నెక్కువగుపదార్థ మొకటియున్నదనియు, నీయొక్కనికంటె పెక్కుమందికి మేలును కలుగఁజేయవలయునను విధియున్నదనియు, జాతీయభావమున కిదియే ప్రత్యుత్తరము. ఈవిధిని మీరు మఱచిపోవ నారంభించితిరి. ఒకప్పుడు ఈమహారాష్ట్రదేశములో గొప్పవారిపరంపరలో ఇట్టి ఆదర్శముల (ideals) యెడజాగ్రత్తగలసమర్థులుండెడివారు. కర్మ (fate) విధానమున ఈమనుష్యస్వభావము నిలువదు. మన పనిని మఱియొకమనుష్యుఁడు చేయనారంభించునెడల మనము సరియేయని చెప్పుదుము. పనిజరుగుటయే చాలునుకాని, ఎక్కడసరియనవలయునో, ఎక్కడ అట్లనకూడదో, అవివేకము మనలనువిడనాడినది. ఆంగ్లేయులు మనపరిపాలనమును జరుపుచున్నారుగనుక మీరూరక కూరుచున్నారు. పశువుల చావడిలో పెంట (dirt) ఉన్నయెడల వారూడ్చెదరు. ఆరోగ్య

మును ఆలోచించి సకాలములో దానికి మేత వేసి నీళ్లు పెట్టెదరు —కాని, యీ స్వాతంత్ర్యము తమ చేతులలోనికి రావలయునని పశువులు ప్రశ్నించి నవా? (హాసము) మనుష్యులకును పశువులకును భేదమేమన, నాగరు (Nagar) యొక్క కర్తవ్యము ఆరోగ్యము నాలోచించి వ్యాధివచ్చునెడల ఏమిచేయవలయునో చెప్పి, తొందరలు సంభవించునెడల తగు నేర్పాటులు చేసి యాకస్మికవిపత్తును సంభవింపకుండ తగుజాగ్రత పడును. అనగా మీస్థితి పంజరములోని చిలుకవలె యున్నది. అట్టిస్థితి అక్కరలేదు. ఇందు లకు కారణము వారు పనులు జరుగునట్లు చేయుటమాత్రమే కాదు కాని, అట్టి ఏర్పాటువలన మనకున్న మంచిగుణములన్నియును క్రమముగా అదృ శ్యమగుచున్నవి. అట్టిగుణము లదృశ్యతనొందకుండ వారుచేయునది మనము చేయుస్వాతంత్ర్య ముండవలయును. వారుచేయుపనులకంటె నెక్కు వవిషయములను కనుగొన నక్కరలేదు. వారుచేయుదురని వదలిపెట్టి మనకిష్టముగలపనులను మనము చేయగూడదు. అదియే కావలయును. అట్టిఅధికారమే మన చేతులలోనికి రావలయును. దీనికొకటియే ఆక్షేప మున్నది. కాని, ఇట్టిస్థితికి వచ్చుట చాల చెఱుపు. “కేసరి” అను మహా రాష్ట్రవార్తాపత్రికలో నొకకథ ప్రచురింపబడినది. పంజరములోనుండు చిలుకనుగురించి యొకవిధమగుపద్యము (లేక గీతము, poem) ను తన స్వీయచరిత్రలో రవీంద్రనాథఠాకూరుగారు వ్రాసినారు. అందులో పం జరములోనున్న చిలుకకును, స్వేచ్ఛగనున్న చిలుకకును జరిగినసంభాషణ చెప్పబడినది; పంజరములోనిచిలుకకు స్వేచ్ఛగలచిలుక యిట్లు చెప్పినది. “బయట తమాషాయున్నది. ఒకడు తనయిష్టమువచ్చినట్లు సంచరించ వచ్చును. ఇష్టమువచ్చినచోటికి వెడలవచ్చును. ఇష్టమువచ్చినపుడు భుజింపవచ్చును. అట్టి సంతోషము నీకున్నదా?” పంజరములోని చిలుక యిట్లనుచున్నది. “అయ్యా! నీవుచెప్పునది నిజమే. కాని, బయటికి పోయినపిమ్మట ఇట్టిబంగారపుకాడ (లేక ఖడ్డీ, perch) ఎచ్చట లభిం చును?” మనస్థితియు నిట్లే అయినది.

స్వరాజ్య మబ్బినయెడల మన మెట్లు నిర్వహింపఁగలము? ఇచ్చు వారు లేరు, పుచ్చుకొనువారు లేరు; స్వరాజ్య మబ్బినయెడల మనమెట్లు నిర్వహింపఁగలమనియే కదా నీ అభిప్రాయము! మనము తగము; అనఁగా పైనిచెప్పఁబడిన చిలుక బయటికివెడలినయెడల దానికి పంజరము కాని, కూయుచుండుటకు ఖడ్డీగాని ఎట్లు దొరకును, అనునట్లున్నది. మనము ఆస్థితికే వచ్చితిమి. ఇది స్వభావసిద్ధమగు స్థితిగాదు. ఇది కల్పితమైనది. (It is artificial) అనేక సంవత్సరములు పంజరములో ఖైదుగానుంచ బడినచిలుకయొక్క మనస్సులో కలిగినభావమునలెనే పైఅధికారములు మనచేతులనుండి తొలఁగినందున మనమనస్సులలో పైభావము ఉదయించినవి. అది మనప్రథమమగుస్వభావసిద్ధమగు భావముకాదు.— స్వాభావికమగు మానుషభావము (కాదు) అది చిలుకయొక్క నైజ భావముకానట్లు ఇదియు మనజాతి (ప్రజల) యొక్క నైసర్గికభావము కాదు. ప్రథమమున నిది మనసునందుంచుకొనవలయును. మనపైని పడు నట్టి పనిని చేయుటకు మనము తగినవారమగుదుము. మనము ఇట్లు తగినవారిసంతతివారము. మఱియు, మనము వారియొక్క నిజమగు సంతతివారమే అగునెడల, మన కట్టియవకాశము కలిగినపుడు మనయందట్టిగుణములుద్యోతకములు కావలయును. మఱియు, అవి ద్యోతకము (manifest) అగు ననుసమ్మకముతో దానికొఱకు మనము ప్రయత్నము చేయవలయును. ఇదియే నేనుచెప్పునది (ఆహ్లాదము). వారసత్వమున కేమైన ప్రయోజనమున్నయెడల దానిని గుర్తింపుడు. అట్లు కాని యెడల ఫలానివారిమనుమలము—మునిమనుమలము—అని పిలిచికొనుటనైన మానివేయుఁడు. మనదేశములో నిపుడ నేకమందిసర్దారులున్నారు. వారితాతలు సర్దార్లనియు, వారితాతలరక్తముయొక్క గుణములు వారికిఁగూడ సంక్రమించినవనియు, వారనెదరు; కాని, వారు (తాతలు) సంపాదించిన వతనులను (జాగీరు మొదలగునవి) నిలుపుకొను నిమిత్తము వా రిష్టముపచ్చినట్లు సాహేబులకు (అనగా అధికార్లకు)

వారు నౌకరీ (లేక సలాములు) చేయుదురు. మంచిదే. వారు సర్దార్లు గనుక వారట్లు చేయ ప్రారంభించి రనెదను. కాని, యేదియు సంపాదింపఁ గోరనిమీరుగాని, మేముగాని వారివెంట ఎందులకు పరుగిడవలయును. ప్రజల (లేక దేశము) నొకవిధమగునీడ కప్పుచున్నది. దానినుండి మన ము తప్పించుకొనవలయును. ఇది యొక గ్రహణము. చంద్ర గ్రహణము తటస్థించినపుడు ఆయనకు విము క్తికలుగుటకు మనము దానములు చేయు దుము. మీకు సంభవించిన గ్రహణమును నాశనము చేయుటకై యొక దమ్మిడీనైనను ఖర్చుపెట్టుటకు మీరు సంసిద్ధులుకారు. మీరందులకు ప్రయత్నించనైనను ప్రయత్నించరు. చంద్ర గ్రహణముపట్టినపుడు పూర్వపుబ్రాహ్మణులు జపము (వేదపఠనము) నైనను చేసిరి. మీరు తుదకు జపమైనను చేయుదురా? మీరిందులకు ప్రయత్నములు చేయుచున్నా రా? ఇందునిమిత్త మెవరికైన నొకయాగాని (రెండుదమ్మిడీలు) ఇచ్చు టకు మీరు సిద్ధముగ నున్నారా? లేదు, ఏమియు లేదు. వారుమాత్ర మే యీఆక్షేపము చేయుదురు. హిందువుల కధికారమిచ్చినయెడల, మహమ్మదీయు లేమికావలయును? హిందువులకు స్వరాజ్యపు హక్కుల నిచ్చినయెడల మహమ్మదీయులకు లభింపవు. తర్వాత, మన మహమ్మదీయసోదరులను మనమాలోచించ లేనట్లును, వారును మనము నొక యేర్పాటును (setllement) చేసికొనఁజాలనట్లును మన చేతులలోనికి అధికారము వచ్చునెడల మనము వారిని (జులుము) దౌర్జన్యము చేయుదు మట!, వారిచేతులలోనికి అధికారము వచ్చు నెడల వారు హిందువులను జులుముచేయుదు రట! వీరువచ్చి యిట్టి సంగతులను ప్రజలపక్షమున జెప్పుదురు. వారెవరు? వారీసంగతుల నేల చెప్పుదురు? మిమ్ము భ్రమింపఁజేయుటకు (to delude you); దీని నాలోచింపవలయును. ఈసివిల్ సర్వెంట్సు (civil servants) మీకంటె ఎక్కువ తెలివిగలవారు. వా రధికారమును వారిచేతులలో నుంచుకొనఁ గోరెదరు. ఈవిషయము కథలోని ముగ్గురు దొంగలవలె నున్నది.

మీరు రాజకీయవిషయములలో నేదైననపేక్షించునెడల(want), 'మీరుగునపుంసకులు. మహమ్మదీయులు మీకనుకూలురుకారు' అనివారనె దరు. మహమ్మదీయులు తమకాక్షేపణలేదనునెడల వారింకొకదానిని వ్రేలు పెట్టిచూపెదరు. ఈవిధముగా మోసము(roguery) జరుగుచున్నది. ఇట్టి మోసము (roguery) వలన మోస(deceived) పోకుండ.... ఈహక్కు లను సంపాదించుటకుఁగాను అశాస్త్రీయమగుపనులను మీరుచేయవలసిన దని నేననను. శాస్త్రీయమగుమార్గ మొకటియున్నది. కాని, ఆశాస్త్రీయ పద్ధతియొట్టిదనమీరితరులమాటలను వినకూడదనునది. మీహక్కులను మీరుకోరుచున్నట్లు దృఢమనస్కులై చెప్పుటకు మీరుసంసిద్ధులుగనుండ వలయును. మీరు మీమనస్సులో దృఢనిశ్చయము కలిగియుండనియె డల, ఒకపోలీసు ఉద్యోగస్థుఁడువచ్చి "మంచిది, మీరుతిలకుగారిఉపన్యాస మునకు వెడలితిరా?" అని అడిగినవెంటనే "అవును; నేను అదిముగింపు కావచ్చినప్పుడు వెడలి దూరముగ కూర్చునియుంటిని. నేను దానినంతయు వినలేదు" అని, ప్రత్యుత్తరమిచ్చెదరు. పోలీసు ఉద్యోగస్థుఁడు చూచి నాఁడుగనుక, మీరు వానినితిరస్కరించలేరు. మీమనస్సులలోనట్టిభయ మెందులకున్నది? స్వరాజ్యము కాంక్షించుచున్నామని మీరనుటకు భయపడవలసిన దేమున్నది? ఇచ్చట ఏకష్టము సంభవించుచున్నది. తరువాత, ఉపన్యాసమునకు హాజరైన (attended) వారడిగినప్పుడు అతఁడు నిజముచెప్పును. కాని, పోలీసువా రడిగిన "నేను బాగుగ విన లేదు, ఇద్దరు లేకనలుగురు చెప్పుచుండిరి. ఏమిచేయవలయును? నాయభి ప్రాయముమాత్రము ఆయన (అభిప్రాయము) వంటిదికాదు," అని అతఁ డనును. ఈవిషయములో నట్టిక్రిందుమీఁదులు (shuffling) పనికిరావు. క్రిందుమీఁదు (shuffling) చేయుటవలన ఏదేవతను సేవించుటకాదు. మీమనస్సులో నేమున్నదో అది ఆదేవతకు తెలియును. ఇట్లు తెలిసికొను దేవతలలో స్వతంత్రమను దేవత అతిజాగ్రత్తగనున్నది. మీకు కావలసిన దానిని కోరినయెడల, వారు దాని నిచ్చెదరు. వారొకటి రెండుపర్యా

యములు "కాదు" అనవచ్చును. వా రెన్నిపర్యాయములు 'కాదు' అనెదరు ? ఈవిషయములో తలక్రిందులేమియు లేదని వారికి నమ్మకము కలిగింపవలయును. ప్రయత్నముచేసినఁగాని, వేఱుమార్గము లేదని వారికి నమ్మకము కలుగఁజేయవలయును. మీలో నెదియో కొంతకనిపించు వఱకు ప్రతిదేవత మిమ్ము వెఱపించును, (frighten). మనయోగశాస్త్ర ము నాలోచించునెడల దేవతలను సంతోషపెట్టవలయునని కనఁబడు చున్నది. వారు మనలను భయపెట్టనారంభించెదరు. జయము కలిగిన యెడల సరియే. భయపడకుండ స్థిరచిత్తముతో మనము పనిచేసినయె డల, యోగశాస్త్రములోని దేవతలు పూజింపఁబడుదురు. దీనిని ఋజువు పఱచఁదగినది; ఇదియే విధి (rule). రాజకీయవిషయములలో సైతము వేఱువిధిలేదు; వేఱుమార్గమును లేదు. అది స్వరాజ్యము; అది మనకు కావలయును;దానిని మనము సంపాదించెదము. దానిని సంపాదించకుండ మనప్రయత్నములను మనము మానము;—మీయందిట్టిదృఢమగునమ్మక ముండినఁగాని ఇది లభింపదు. ఈభయము వెనుకచిక్కును. పోలీసువారు వెనుకచిక్కుదురు. సి.ఐ.డి. (C. I. D.,గూఢచారశాఖ) కలెక్టరు వెనుక చిక్కును. తుదకు అదిలభించును. వారి వెఱపులకు (blustering) ను, కేకలకును భయపడకూడదు. ఇంతియకాక దీనియొక్క నిశ్చయమగు ఫలితము (consequence) నిదియేయని మీరాలోచింపుఁడు. ఇంగ్లీషు లో నొకసామెతయున్నది. "చీకటిలోనుండి వెలుపలికిపోకుండ వెలుతురు నెట్లుచూడఁగలము?" ఉదయమున నుదయించుటకు(ముందు)సూర్యుఁడు చీఁకటినుండి పోవలయును. శాస్త్రసూత్రముగాకుండ సామాన్యజనుల నమ్మకమును మాత్రము చెప్పుచున్నాను. చీఁకటిలోనుండిపోకుండ వెలు తురులభింపదు; ఉష్ణవాతపు దెబ్బలనుండియు, కష్టములనుండియు, జనుల యొక్క వెఱపులు లేక కేకలనుండియు తప్పించుకొనకగాని, స్వతంత్రము లభింపదు. స్థిరచిత్తత కావలయును. స్వరాజ్యమన నేదియో చెప్పితిని. అంతపట్టుదలతో ప్రయత్నముల నారంభింపవలయును.... దేవునికృపవలన

ప్రస్తుతపు ప్రపంచస్థితి చూపుచున్నది. విశ్వాసముగుభాష (Language of faith)లో మాటలాడుదునేని, దైవము మనకుసహాయము చేయుటకు సిద్ధముగనున్నాఁడు కాని, దేవుఁడుసిద్ధముగనున్నను మీరు సిద్ధముగలేరు. (హాసము) దేవుఁడు శాంతస్వరూపుఁడు. స్వర్గమునుండి మీకు వరమును పంపవలయునా? ఎవరును పంపుటలేదు. దేవుఁడుసయితము పంపఁడు. ఫలితము నాయనవంపునెడల అది నిష్ప్రయోజనమగును. ఏలన, మీరు భయపడినప్పుడు అదివఱకున్నదికూడ తర్వాత అదృశ్యము కానచ్చును. ఇట్టివరమీయఁబడినయెడల, దాని నెట్లుపయోగింపవలయును? అనఁగా దేవునియొక్క నివాసస్థలమేదైననుండినయెడల, మీరు దానిని ఆయన యింటికిపంపుదురు. అది పోస్టుద్వారా పంపతగినయెడల మీరట్లు పంపుదురు. (హాసము). ఇట్టి భావోదయము కలిగినపిమ్మటను, నేనుచెప్పునట్టి ప్రజలహక్కగు నీయధికారము మీచేతులలోనికి వచ్చినతరువాతను ఏమిజరుగును? దేశము (ప్రజలు) నకు ఏమిఫలితము కలుగును? నేఁటి దినముననే నిది చెప్పఁబోవుచున్నాను. స్వరాజ్యమనన్నదియో చెప్పినాఁడను. స్వరాజ్యమన ఆంగ్లేయులను వెడలఁగొట్టి మనయధికారమును స్థాపించుటకాదని మనమిత్రులగు కేల్కరుగారు (Mr. Kelkar) ఇదివఱకే చెప్పినారు. కొంతమందిని వెడలఁగొట్టవలయును. రాజును వెడలఁగొట్టి ఆయన యధికారమునొకరిచేతులలోనికిలాఁగుకొనుట స్వరాజ్యము కాదు ప్రజలహక్కులను చేతులలోనికి దీసికొనుట యని దానియర్థము. ఒకదేశము (nation) ను బానిసతనములో నుంచుటవలన ఇంగ్లాండునకు లాభమేమైనకలిగినదా యనిజాగ్రత్తగ నాలోచించునెడల, ఇంగ్లాండు యొక్క అధికారములోనుండు సామ్రాజ్యముయొక్క రాష్ట్రములకును, దేశములకును ఎప్పుడో యొకప్పుడు ఇంగ్లాండు స్వతంత్రము నీయవలయునని ప్రస్తుతము సకలప్రపంచస్థితినిఁబట్టి తెలియుచున్నది. ఇదియెప్పటికైనను తటస్థించవలయును. ఇది జరిగికావలయును; కాని, మీరుమాత్రమేమియుచేయనియెడల అది జరుగదు. రాత్రియంతయు మేలుకొని

దొంగవచ్చినప్పుడు నిద్రపోవునట్టిస్థితివంటిది మీదిఅగును. కాలము సమీపించుచున్నది; ఒకవేళ ఈ ప్రపంచములో ఇతరదేశములలో (nations) సంభవించుచున్న మార్పుయొక్క స్వభావము దేవునికృపవలన మీకనుకూలమగును. కాని, సమయము (time) అనుకూలించునెడల మీరు మేల్కొనియుండుచో మీకు లాభకరమగును. లేనియెడల, మీరొకసారినిద్రించుచో మీ రెల్లప్పుడు నిద్రించవలెను. ఇందువలన మీకు స్వరాజ్యపుహక్కులు లభించినను ప్రయోజనమేముండును? కానున్నదాని స్వరూపమును (picture) సంగ్రహముగ తెలిపెదను.

పీష్వాలకాలములో నేమితటస్థించినది ? దానికొఱకు మనము చరిత్రము నించుక పరీక్షింపవలయును. పీష్వాలకాలములో మహారాష్ట్ర దేశపరిపాలనము బాగుగ జరుగుచుండెను. పీష్వాలయొక్క రాజ్యమును ఎల్ఫిన్‌స్టన్ (Elphinstone) దొర చెడఁగొట్టి అది చేసినపిమ్మట కమిషనర్ (commissioner) అయ్యెను. నేను చెప్పుచున్నదానికి ఆదొరయేసాక్షి. పునహా మహాపట్టణము అంతపెద్దదైనను (దానిలో) రాత్రియందు దారిదోపుడులు (docoities) జరుగలేదు. మద్యపానము లేకుండెను; అది బొత్తుగ నిషేధింపఁబడెను. నానాఫడ్నవీసువలన నేర్పాటుచేయఁబడిన జమాబందివిధానము తర్వాత ననుసరింపఁబడియున్నది, (copied). ఇంతియకాక, సర్కారులెక్కలెట్లుంచవలయునో తెలుపుశాస్త్రముపీష్వాలరాజ్యకాలములో మనలో నేర్పడినది; ఆలెక్కలేయిప్పుడు నుంచఁబడుచున్నవి. రాష్ట్రముల నెట్లు పరిపాలింపవలయునో మనకు తెలియును. భోజనకాలమం దొకానొకసర్దారు ఫలానివానితో మాటలాడినాఁడను సమాచారము నానాఫడ్నవీసునకు (వెంటనే) తెలియునట్టిరీతిగా నానాఫడ్నవీసుయొక్క గూఢచారశాఖ(C.I.D;) యుండెను; (ఆహ్లాదము). ఒకపర్యాయ మీక్రిందిసంగతి తటస్థించినదట. ఖోపోలీఘాట్ (Khopolighat) మార్గముగా నొకపల్లకిలో ఇంగ్లీషువారి రెసిడెంటునకుబొంబాయి గవర్నమెంటువారు మందుసామానులపంపించిరి, ఫలా

నాదినమున రానున్న ఆపల్లకిని ఘాటుమీద నాపవలసినదని పునహోద దప్తార్ (daftar) నుండి హుకుము వెడలినది. ముందు సామానుపల్లకిలో వచ్చుచున్నదను సమాచారము దానికి (దప్తార్ కు) తెలిసినది. తరువాత 'మాపల్లకి నెందుల కాపుచేయబడినదని' రెసిడెంటు మొఱపెట్టెను (complained). అందుపై "దానివిషయమై మీరే ఆలోచించి చూచుకొనుడు. మేము పల్లకిని జప్తి (attached) చేసినాము; పోలీసు యము. ఎక్కడ నేమిజరిగినదో దానిని మారాజునకు తెలియపఱచవలయును. కాబట్టి యిట్లు మేమేచేసినాము." అని నానాఫడ్నవీసు నొద్దనుండి ఆయనకు జవాబువచ్చినది. ఇట్లాయనకు చెప్పిరి. గూఢచారశాఖ (C. I. D) కావలయును. ఏనరక్కఱ లేదనెదరు? రాజునకు సమాచారము తెలియనియెడల, ఆయన పరిపాలనము జరుపజాలడు. గూఢచారశాఖ (C. I. D.,) తో మాకు తగదా లేదు. వారుపనిచేయు పద్ధతిని/మార్చియే మాతగవు. (ఆహ్లాదము, శృణు, Hear). ఆపద్ధతి మన అధికారములో లేదు. పరిపాలనము జరుపుటకు అన్నిశాఖలును (departments) ఉండవలయును. పోలీసు (శాఖ) కావలయును, గూఢచారశాఖ (C. I. D.) కావలయును, రివిన్యూ (శాఖ) కావలయును, న్యాయశాఖ (Judicial department) కావలయును. అన్నిశాఖలును కావలయును. అయినను కష్ట మెక్కడనున్నది? ఒక్కటేవిషయములో కష్టమున్నది. అన్ని (శాఖలు) ప్రజలయొక్క—(మనయొక్క) అధికారములో నుండవలయును. ఇందులోమాత్రమే కష్టమున్నది. ఆంగ్లేయులు అత్యంతనాగరకు లనియును, మనముకూడ నాగరకులము కావలయు నని యును,అభిప్రాయము చాలమంది కలిగియున్నారు. నాగరకత నెవఁ డపేక్షించుఁడు ? అన్నిసంస్కరణములు కావలయును. నానాఫడ్నవీసు కాలములో ఉత్తరములు పంపవలసియుండెను, ఇప్పుడు గూఢచారశాఖ (C. I. D.) వారు తంతిని పంపెదరు. సదుపాయములు (means) దొరకుచున్నవి. వీని నన్నిటిని ఉపయోగించుచు పరిపాలనమును జరుపవలయును. కాని, పీష్వాలరాజ్యకాలములో ఈపరిపాలనా విధానమంత

యు నుండెను. ఆపద్ధతి (system) చెడిపోయినపిమ్మట, ఏమి జరిగినదో ఆలోచింపుఁడు.

పీష్వాలరాజ్య మంతరించినవుడు పీష్వాలస్వాధీనములోనుండిన నాగరు,సతారా, పునహా మొదలగుచోట్లు ఆంగ్లేయులవశమైనవి. అప్పటి పీష్వాయొక్క సహాయులు (Lieutenants) గొప్పసైన్యాధిపతులుగ (generals)నుండిరి. సైన్యమును ఆజ్ఞాపించిన (లేక, నడిపిన) జాగీరుదార్ల లోను సర్దార్లలోను గైక్‌వార్, హోల్‌కారు,సింధియాముఖ్యులు. వారు ఇంగ్లీషుప్రభుత్వముతో చేరి పీష్వాప్రభుత్వమునణఁగఁద్రొక్కినందున వా రిప్పటికిమిగిలియున్నారు. ఇది 1818సంవత్సరపుచరిత్ర. ఇప్పుడు ఈముగ్గురస్థితియెట్లున్నది? బరోడాసర్కారుస్థితియెట్లున్నది? హోల్కారుస్థితియెట్లున్నది? సింధియాసర్కారుస్థితియెట్లున్నది? పునహా చుట్టుపట్లనున్న రాష్ట్రము లేక జిల్లాస్థితియెట్లున్నది? దీనిని ఆలోచింపుఁడు. ఈమూఁడునాలుగు జిల్లాలును ఇంగ్లీషుగవర్నమెంటువారి స్వాధీనములోనికి వచ్చినందున వారిపరిపాలనము క్రమముగా అధికారవర్గముయొక్క చేతులలోనికిఁజేరినది. జనులు చెప్పుకొనునది వినిపించుకొనకపోవుటయే యీయధికారవర్గపుధోరణి (policy). మొదట గవర్నరు, తరువాత కమీషనరు, తరువాత కలెక్టరు, అటుతరువాతకలెక్టరుయొక్క తాబేదారు అసిస్టెంటుకలెక్టరు, మమ్లత్‌దారు,ఆవల కార్‌కూన్, ఫౌజ్‌దారు (Fouzdar),పోలీసుసిపాయి అధికారవర్గమంతయు మొదటినుండి చివరవఱకునిట్టియేర్పాటుగ నున్నది. జనుల క్షేమమైన జరుగవలసినయెడల వారేచేయవలయును. ప్రజలకు లాభకరమైనదిగాని, నష్టకరమైనదిగాని దేనివిషయమైనను పై గవర్నమెంటు వారు ఉత్తరువు జారీచేయుదురు. దాని ననుసరించి క్రిందివారు తగుజాగ్రత్త (steps) పుచ్చుకొనెదరు. మొట్టమొదట నీయేర్పాటు మంచిదనుకొనిరి. బాజీరావు పీష్వాప్రభుత్వములోని అల్లరులు అణఁగఁద్రొక్కఁబడినవి. వారప్పుడు సుఖముగనున్నామనిరి. వారు నేతినిచూచిరిగాని, కవ్వమును (rod)చూడలేదు, (హాసము). అటుపిమ్మట క్రమముగా అదికనుపించ నారంభించెను. సర్వాధికారమును అధికారవర్గముక్రిందికి చేరినది. మిగి

లినజనులు విద్యావంతులైరి, (లేక వివేకులైరి). వారయోగ్యమార్గములనుప యోగింపనారంభించిరి. నేను నాగరుకువచ్చుచున్నాఁడనో లేదో అను సమాచారము ఎవరికైనను తెలియవలసినయెడల తంతిని పంపవచ్చును. విద్య కలిగినది. ఈలాభములన్నియు కలిగినవి. కాని, అధికారమంతయు అధికారవర్గముచేతులలోనికి వెడలినది. కంపెనీవారికాలములో కొంత వఱకది వారిచేతులలోనికిఁ జేరినది. 1858 సంవత్సరములో నేర్పడిన ఇండియాగవర్నమెంటుచట్టముప్రకారము అది వారిచేతులలోనికి పూర్తిగ పోయినది. ఆచట్ట మేర్పడి యిప్పటికి 58 సంవత్సరములైనది. ఈ 58 సంవత్సరములలో నేమిజరిగినది ? ఉద్యోగస్థునకు బలము హెచ్చినది; అతనికి అధికారముకలిగినది; ప్రజలయొక్క అధికారము తగ్గిపోవనారంభించినది. కులకరణి మాకక్కఱలేదనునంతవఱకు మాకందఱునౌకర్లు కావలయును. మనకు వారసత్వపుఅధికారము లేవైననుండినయెడల, అవికూడ పోయినవి. ఇనాంకమిషన్ ఏర్పడినప్పుడు మన కది తోఁచలేదు. ఇప్పుడు మనము దానివిషయములో నేమియుఁజేయఁజాలము. అప్పుడు వించుర్కార్ (Vinchurkar) జాగీర్దారని అనిరి. ఆయన సైన్యాధిపతిగ నుండెను. ఒకరు 10,000 సైన్యమునకును, మఱొకరు 15,000 సైన్యమునకును అధికార్లు (officers)గ నుండిరి. "నీవు 15,000 సైన్యమును పంపవలసినది. నీకు 15 లక్షలరూపాయల నిచ్చెదము, వానిలో 14 లక్షల రూపాయలు ఖర్చుపెట్టుకొనవలసినది. తరువాత, లక్షరూపాయలు తీసికొనవలసినది" అని వారికిఁ దెలిపిరి. వారొప్పుకొనిరి. ఇంటియొద్దకూర్చుండి ఆద్రవ్యమును వినియోగపఱచుకొనవచ్చును. ఇంకేమి ? ఇదియొకగొప్పసూత్రము (principle). అప్పుడు "గవర్నమెంటుపక్షమున యుద్ధముచేయుటకు సైన్యమునుంచుకొనునధికారమును మేముపోఁగొట్టుకొంటిమి." అని యెవరును అనలేదు. ఎవరు నట్లనుకొనలేదు. మనమింటియొద్ద సుఖముగా కూర్చుండి తినుటకు ధన మిచ్చుచున్నారు. గనుక, గవర్నమెంటుమంచిదనుకొనిరి. ఇంకేమికావలయును. ఇట్టిస్థితివలన మనమిట్టి క్షీణదశకు వచ్చితిమి. 50 లేక 60 సంవత్సరములలో రాష్ట్రముయొక్క

అధికారము లన్నియును ఆంగ్లేయాధికారవర్గమునకు వశమైనవి. ఇంతి మాత్రమున ఆంగ్లేయాధికారవర్గము చెడ్డదని నేననుచున్నట్లు మీరు గ్రహింపఁగూడదు. వారు చాలపాండిత్యము, నేర్పుకలవారు. ఇంగ్లండులోని యుత్తమవిద్యార్థులకే యీయుద్యోగములనిచ్చుచున్నారు. వారి సమర్థతలు అధికతరమైనవి కాని, దీనినంతయు నొప్పుకొనినను మననిమిత్తము వారు పనిచేయుచు కష్టనష్టములనుభవించుచు (wear and tear) నుండుట వాస్తవము. ఇంగ్లాండు శీతలదేశమైనందునను ఇదియుష్ణదేశమైనందునను, వారికెక్కువ జీతమీయవలయును. మనమేలుకొఱకువచ్చినందున వారికి కాదనెదరా? (హాసము). ఇవి యన్నియు మన మొప్పుకొనుచున్నాము. మనకంటె వారు తఱుచుగా కొంచెమెక్కువ పనిచేయుచున్నారని నే నొప్పుకొనెదను. "మనముపనిచేయుటకు సిద్ధముగానున్నప్పుడుఅది మనపనియే యైనప్పుడు దాని నితరుల కెందులకీయవలయును?" అనిమాత్రమే నేననెదను. వారు చెడుగుగా పనిచేయుదురని (కూడ) నేననను. మనపనికిని, మనలాభమునకును హద్దులు (లేక, మితము, restrictions) ఏర్పాటు చేసినందున, మన మనస్సులు బలహీనమగుటకారంభించినవి. మనయుత్సాహము తగ్గనారంభించినది. నపుంసకత్వము (effiminacy) వృద్ధియగుచున్నది. కనుక, ఇదిమనకక్కఱలేదు. వారు విద్యావంతులగుటచే వారినక్కఱలేదనను; వారు మంచివారు. వారు వర్తకులు; మీకంటెనెక్కువ తెలివిగలవానిని మీదుకాణములోగుమాస్తా(ఏజంటు, agant) గా నుంచరా? అట్టివా రుండవచ్చును; కాని, అట్టిగుమాస్తా (ఏజంటు ను) మీదుకాణములోనుంచి, మీరు వెలుపల నిలచి, అతఁడిచ్చు ద్రవ్యమును మాత్రమే పుచ్చుకొని యూరకుండెదరా? ఇది నిశ్చయముగ వ్యవహారసంబంధమగు సమస్య(or ప్రశ్న.) ఈరాష్ట్రముయొక్క నిర్వాహక మట్లేయున్నది. బరోడావిషయ మేమైనది? బరోడాయొక్క చరిత్రను చూడుఁడు. బరోడాచరిత్రములో నట్టి వ్రాత లున్నవి. మఱియు క్రమముగా (by degrees) ఆయన చేయఁగలిగినది అక్కడ. క్రమముగా జరుగుటలేదు. బరోడామహారాజుయొక్క

సింహాసనము, (gadi) శాశ్వతముగునట్లు చేయఁబడవలసివచ్చెను. అది పరంపరహక్కు (regular matter of succession) కలదయ్యెను. ఇది చరిత్రలోనిభాగము.

పూర్వము బరోడాయొక్క వ్యవహారములు పునహానుండి నిర్వహింపఁబడుచుండెను. అనగా పునహా పైవిచారణ (supervision)కు లోఁబడియుండెను; తక్కినపనిని బరోడా రాజులు చేయుచుండిరి. ఇతరరాజులవలన (కూడ) జరుపఁబడుచుండి యుండవచ్చును. కాఁబట్టి, యిచట విద్య నేర్చుకొనుటవలన మీరుసిద్ధము (ready) అగుచో, మీరు బరోడాకుఁబోయి నవుకరి నీయవలసినదని అడుగవచ్చును. పునహా, బొంబాయి పట్టణములలో విద్య నేర్చుకొని, అచట జిల్లా మేజస్ట్రీటులుగను, మునసబులుగను, సుభాలు (subhas) గను, దివానులుగ నున్నారు. నాయబ్ దివానులు, హైకోర్టుజడ్జీలు నున్నారు. వీ రక్కడ పనిచేయుచున్నారు. వారివిషయమునయెట్టిపితూరీ (complaint) లేకుండ వారచట పనిచేయుచున్నారు. కాఁబట్టి, అట్లే యిచట జరుగుట కేమియాక్షేపమున్నది? పునహా, సతారాజిల్లాలనుండి మనుష్యులు పోయి, బరోడాయొక్క పరిపాలనము జరగించుచున్నయెడల, వారాపరిపాలనము నావిధముగనే మనరాష్ట్రములో జరుపుట కేమియాక్షేపమున్నది? ఎవరాక్షేపించిరి? దేశము (or ప్రజలు, nation) రెండు తెగలుగవిభజింపఁబడినందున నొకభాగము మహారాష్ట్రజాతి (చారిత్రకకారణమువలన నాంగ్లేయులవశమైనది;) మఱియొకటి స్వదేశ రాజుల (chiefs) స్వాధీనములో నుండినది. ఈదేశస్థులు పనిచేయుట కర్హులని యొకభాగము చెప్పుచున్నది. రెండవభాగములోని అధికార్లు వారుపనికిరాదని అనెదరు; మనము వారనునట్లేఅనుచు వారివలెనే మాటలాడ నారంభింతుము. రెండుమానములు (standards) ఉన్నవి, రెండువైపులున్నవి. కావున, 'స్వరాజ్యము'నుగూర్చి మాటలాడునపు డేమికావలయును? బరోడాలోవలెనే పునహావిషయములోను, సతారావిషయములోను, అట్టి యేర్పాటులే చేయుటకు ఆక్షేప మెచట నున్నదో యిపుడు చూడవలయును. ఇంగ్లీషుగవర్నమెంటు వారి అధి

కారము నిలుచును. బరోడామీఁద కూడ అది యున్నది. బరోడారాజు (chief) స్వతంత్రరాజు కాఁడు. పునహాలో పీష్వాలు రాజ్యముఁ జేసినప్పుడు రూపాయిలో 10 అణాలకు 6 అణాలవంతున బాసీన్ (Basse-en) లో సంధిజరిగినది. పునహాసంస్థానము అట్లే నిలిచియుండినయెడల వారుకూడదానినినిర్వహించుటకు సమర్థతకలిగియుండెడివారే. సతారానాగరులోనువారు నిర్వహించెడివారే. నిజాము రాష్ట్రమునం దట్టినిర్వాహకమే జరుగుచున్నది.

---

# ప్రస్తుతపుస్థితి.

1918 సంవత్సరము ఏప్రలు తే 21 ది ఆదివారముసాయంకాలము మదరాసు రాయపేటయందలి డాక్టరు: సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారి గారీవిలాసమున లోకమాన్య బాలగంగాధరతిలకుగారు "ప్రస్తుతపుస్థితి"ని గుఱించి మహోపన్యాసముఁగావించిరి. ఆనిబిసెంటు అధ్యక్షురాలయ్యెను. ఐదాఱువేల జనులువచ్చిరి. తిలకుమహాశయుఁడు సభకువచ్చినపుడు "వందేమాతర" ధ్వానములు మిన్నుముట్టెను. ప్రారంభమున బిసెంటు సభాకార్యక్రమమును ఉపక్రమించుచు లోకమాన్యుని ఉపన్యసింపఁ గోరెను. శ్రీ తిలకుమహాశయుఁడు ఇట్లు చెప్పెను.

"నేఁడు మన మెట్టితీర్మానముచేసికొనినను రేపటి పరిస్థితులవలన నవి విచ్ఛిన్నమగుట సంభవింపవచ్చునని ఇదివఱకే చెప్పియుంటిని. ప్రస్తుతపరిస్థితులు అన్నియు మనకెఱుకలేకయే సత్వరముగా మాఱఁ బడుచున్నవి. స్థితిగతులనుబట్టి నేఁడుచెప్పినవిషయములనే రేపును చెప్పవలసివచ్చునేమో చెప్పఁజాలము. ప్రభుత్వమువారు ప్రకటించిన కొన్నిపత్రములనుండి బాహ్యస్థితులను మనము సులభముగ నూహింపఁ గలము. సుమారు మూఁడువారములక్రిందట నేను మీసమక్షమున

మాట్లాడినపుడు యుద్ధసందర్భములననుసరించి భారతదేశమునకు స్వరాజ్యమునీయవలెనని బ్రిటిషుప్రజలకుఁ జెప్పఁబోవుచుంటినని తెల్పియుంటిని. మనయర్హతను వారియౌదార్యమును అట్లుంచినను జాతివర్ణమతవివక్షుతలును, న్యాయమును, ధర్మమును అట్లుంచినను సామ్రాజ్యము సంరక్షింపఁబడవలసినచో యుద్ధసందర్భములననుసరించి భరతవర్షమునకు స్వరాజ్యము తప్పక యొసఁగవలయును. ధర్మసూత్రమువలనను, అమెరికావారి నిర్బంధమువలనను, ఐర్లండునకు స్వరాజ్యమును ఈయవలసివచ్చినది. ఎందులకు? స్వదేశమునందు తముచే నిరాకరింపఁబడిన ధర్మసూత్రముకొఱకు తాము యుద్ధము చేయుటలేదని ఐర్లండుప్రజలు భావించునట్లు చేయవలయునని ఆంగ్లప్రధానమంత్రి నుడివెను. ఇది యొకకారణము. ఇది బలమగుకారణమే. అట్లు చేయుటకు అమెరికా దేశాధ్యక్షుఁడగు విల్సనుమహాశయుఁడు కోరుట రెండవకారణము. బహుశా లోకస్వాతంత్ర్యముకొఱకును, లోకశాంతికొఱకును, ఈయుద్ధము జరగుచున్నదని నమ్మకము గలుగునట్లుచేసినగాని యుద్ధమునందు అమెరికా యెంతమాత్రమును పాల్గొనదని చెప్పుటయే ఈవాక్యమునకు అర్థమైయుండవచ్చును. ప్రస్తుతయుద్ధము ఏధర్మసూత్రముల సంస్థాపనమునకు జరుపఁబడుచున్నదో ఆసూత్రములు స్థాపితములగుటయే అమెరికావారి యాశయము. జాతివర్ణవిభేదములను బాటింపక ఆధర్మసూత్రములను లోకమున స్థాపించుటకొఱకే యుద్ధము సల్పుచున్నచో తాము సాధ్యమైనంత సహాయము చేయుటకు సంసిద్ధులమై యున్నామని అమెరికావారు ప్రకటించిరి. పైనిఁజెప్పిన రెండుకారణములవలనను ఐర్లండుకు తత్క్షణము స్వరాజ్యము నొసంగుట తప్పనిసరియైనది. ఈసందర్భమున తూర్పుదేశమునందును, పశ్చిమదేశమునందును, ఉన్నస్థితులను గుఱించి కొంత తెలుపవలసియున్నది. పశ్చిమమున స్థితులు విషమములైయున్నవి. ప్రతిదినమును, ప్రతిగంటయు ఇంకను విపరీతములు అగుచున్నవి. అమెరికావారిసహాయము రాకముందే ఇఁక రెండుమూఁడు నెలలలో జర్మనులు బ్రిటిషుసేనలను నాశనముచేసినచో ఇఁక ఆశలేదు.

ఇంతలోపల బ్రిటిషు పరాసు సేనలు నాశనము చేయఁబడఁజాలవనియు, తమస్థానములను తాము నిలిపికొందుమని బ్రిటిషు పరాసు సేనాధిపతులును, ప్రజలును నమ్మకముతో నున్నారు. జర్మను దౌర్జన్యప్రవాహము నాపుటకు అమెరికను సేనలు సహాయము వచ్చునవఱకును యుద్ధము నిలిచిపోవునంతవఱకును, మనస్థానములను మనము పట్టుకొనియుండుట యేగాదు; మనకు కావలసినది. పశ్చిమమున స్థితులు ఇట్లున్నవి. తూర్పు దేశమునఁ జూడ, ఆసియాఖండమంతయు జర్మను దండయాత్రకు గుఱి కానున్నది. రాజకీయ ప్రముఖత్వ పుడాంబిక మేమియు లేకయే తూర్పు దేశమున వాస్తవస్థితులను ఉన్నవియున్నట్లు మీ యెదుటఁ బల్కెదను. ఆసియాఖండమంతయు జర్మను దౌర్జన్యప్రవాహమునకు గుఱియగుచున్నది. రష్యాసామ్రాజ్యము విచ్ఛిన్నమైనతోడనే ఆసియాయందలి తుర్కిదేశమును, రష్యాయును, జర్మనుల హస్తగతములైనవి. ఎట్లయిన జర్మనులు ఒకవారములో భరతవర్షవాయువ్యపు సరిహద్దునకు రావచ్చును. అప్పటికి స్థితులు విషమించును. ఆస్థితి నెదుర్కొనుటకు మనము సిద్ధముగ నుండిననే తప్ప దైవము మనకు సహాయము చేయదు. దానినిఁగూర్చి మనము యోచించి, తర్కించి, దాని నెదుర్కొనుటకు ఏర్పాటులు చేయవలెను. రాజకీయజ్ఞానియగువాఁడు ప్రజాబలముపై నాధారపడియుండవలెను. ఇప్పుడు రెండుప్రదేశములయందు భయస్థితి గలుగును. ఏషియాయందొకభయస్థితి; యూరపునందొకభయస్థితి. పశ్చిమమునందలి భయస్థితి నెదుర్కొనుటకు అయిర్లండుదేశమున నిర్బంధసైనికశాసనము నుపయోగించుట యొకయుపాయము తమకు నిరాకరింపఁబడని ధర్మసూత్రసంస్థాపనమునకు తాము యుద్ధము సల్పవలయునని అయిర్లండుప్రజలకు తోఁచునట్లు చేసిననే తప్ప ఇది సాధ్యపడదు. ఇది యందఱు నంగీకరించినదే. అయిర్లండు ప్రజాశయముల విషయమున బ్రిటిషుప్రజలను సాధ్యమైనంతవఱకు తృప్తిపఱిచిన వెనుక ఆంగ్లప్రభుత్వమువారు అయిర్లండున నిర్బంధసైనికశాసనము ప్రవేశపెట్ట నూహించుచున్నారు. ఆంగ్లప్రధానమంత్రి చెప్పినది ఇదియే. ఈ

ప్రకారము 2 సంవత్సరములలో 50 లక్షలనుండి 70 లక్షలవఱకును సేనను గూర్పవచ్చునని వారు ఊహించుచున్నారు. ఆవిషయమంతయు మనకు అనవసరము. ఆసియాఖండస్థితియే మనము యోచింపవలసినది. ప్రభుత్వమువారు ప్రకటించిన కొన్నివిషయములనుండి దీనినూహింపవచ్చును.

జర్మను నిరంకుశదౌర్జన్యము పశ్చిమమున నిలిపివేయఁబడువచ్చునని ఒకప్రకటనము నందు గాన్పించుచున్నది. పశ్చిమమున నిలిపివేసినచో తూర్పున దాని కవకాశము కలుగవచ్చును. ఇవి నావాక్యములు కావు. ఇప్పటినుండియే యూహింపవలసియున్న ఈమహాకష్టమునుండి మాతృదేశమును సంరక్షించుటకు భారతీయులు సంసిద్ధులై యుండవలయును. ఇదియే మీకు చేయఁబడినవిజ్ఞాపనము. మీరు సంసిద్ధులైయున్నారా? సంసిద్ధులుకాకున్నచో అయిర్లండువిషయమున యోచించిన ధర్మసూత్రమునైన మీవిషయమున పాటింపకయే మిమ్ములను సంసిద్ధులగునట్లు నిర్బంధించుదురు. భరతవర్షస్థితినిసూచించు రెండవప్రకటనము ఆరాజప్రతినిధి ఆంగ్లప్రధానమంత్రి సందేశమును, దానికి రాజప్రతినిధి యిచ్చినయుత్తరమును, మూఁడవది ఢిల్లీలోజరుగనున్న యుద్ధసమావేశము. వీనినన్నిటిని చూచినచో ప్రభుత్వమువారు తమచర్యనిదివఱకే నిశ్చయించుకొనిరనియు, దానిని కొద్దికొద్దిగ నాచరణమున బెట్టుచున్నారనియు నూహింపవలసియున్నది. వారు చేయఁదలఁపెట్టిన విధాన మెట్టిదియో ఇంతవఱకును బ్రకటింపలేదు. పైమూఁడువిషయములను బాగుగా యోచించినవారు భరతవర్ష సందేశవాహకుల ప్రయాణనిరోధసమయముననే యిఁక జరుగనున్న మహానాటకమున ప్రథమరంగము ప్రారంభమైనదని తెలిసికొనఁగలరు. మాకు మొదటరహదారీచీట్లు ఒసఁగఁబడినపుడు ఈచర్య యోచింపఁబడుచుండెను. ఈ విషయమున హిందూదేశాంగమంత్రికిని, రాజప్రతినిధికిని, యుద్ధమంత్రివర్గమువారికిని, ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచుండెను. సందేశవాహకులు ప్రయాణమైనప్పటికి రాజ్యాంగవర్గమువా రొకతీర్మానము గావించుకొనిరి. రాజ

ప్రతినిధిగారు ఏమిచేయవలయునో, హిందూదేశాంగమంత్రిగారు ఏమి చేయవలయునో, యుద్ధమంత్రివర్గమువారు ఏమిచేయవలయునో నిర్ణయింపఁబడెను. సందేశవాహకులకు ప్రయాణనిరోధ మొనరించుటయే ప్రథమకర్తవ్యము. రెండవది, ఎట్టివిధానమున ననుసరింపవలయునో నిర్ణయించుటకు సభను జేయుట. హిందూదేశమునందు సంస్కరణోద్యమమును అణఁచుటకును, హిందూదేశమునందలి మనుష్యబలమును, ధనసాయమును సామ్రాజ్యోపయోగములకు వినియోగించుటకును, సామ్రాజ్యసహాయార్థము మనస్ఫూర్తిగ స్వార్థత్యాగమును చేయునట్లు ప్రజలనుద్బోధించుటకును, ఈసభయందు యోచింపఁబడునని తెలుపఁబడినది. వార్తాపత్రికలకు పంపఁబడిన సభోద్దేశములు ఇవిమూఁడే. సభ యెట్టిది? మొదట స్వదేశసంస్థానములవిషయము ప్రభుత్వము వారి యోచనకురాఁగా సంస్థానాధిపతులు బ్రిటిషుపరిపాలనమునందు జోక్యము కలిగించుకొనఁగూడదని నిశ్చయింపఁబడెను. బరోడామహారాజుగారు అట్లుచెప్పిరి. మహారాజుల భావములును, ఆశయములును, ప్రజలభావములకంటెను, ఆశయములకంటెను అన్యములుగానుండును; గనుక మహారాజులును యుద్ధనిధితోబాటు భారతస్వరాజ్యనిధికిని సహాయము చేయుదురని తోఁచదు. సభాసారాంశమునందలి మొదటిలోపమిదియే. రెండవలోపము, అఖిలభారతశాసనసభలోని అనధికారసభ్యులది. స్థానిక ప్రభుత్వమువారు వివిధసంఘముల ప్రతినిధులను తమకుఁదోచినవారిని నిర్ణయించి సభకుపంపుట మూఁడవలోపము. ప్రతిప్రతినిధికిని తాను ప్రాతినిధ్యమువహించుసంఘముతరపున ఒకవోటు ఉండును. ఇట్టిసంఘములు అనేకములు భరతవర్షమునఁ గలవు. ప్రతిసంఘమునకును ఒక్కొక్క వోటునిచ్చుచో ప్రభుత్వమువారి కనుకూలముగా వోటునిచ్చువారి సంఖ్యయే అధికముగానుండును. సభలో విశేషసంఖ్యాకులు ప్రభుత్వమువారిచే నియమింపఁబడినవారగుటచే ప్రభుత్వమువారిచర్యలను ఆమోదించుటయే వారివిధియైయుండును. ఆచర్యలను మనము నిర్బంధముగ

అనుసరింపవలసినదేనా ? (వలదు, వలదు అని ధ్వనులు.) మనకాంగ్రెసు నాయకులు ఈసభకు రావింపఁబడుదురేమో తెలియదు. నేఁటిసభకు అధ్యక్షతవహించిన అధ్యక్షురాలికి ఇంతవఱకును ఆహ్వానము రాలేదు. ప్రభుత్వమువారు జరుపనున్నసభ వారితీర్మానమే హిందూదేశపు అదృష్ట దురదృష్టములను నిర్ణయించును. అదియే ప్రజాశయములపై కడపటితీర్పు అగును. ఇది అయిర్లండు స్వరాజ్యవిషయికసభవంటిదైనను కాదు. ఇది యిట్టిదని చెప్పుటకు వీలులేదు; ఏమో మోసము. ప్రజాప్రతినిధిసంఘములు ప్రభుత్వమువారికి తమతమరాజకీయ సంస్కరణవిధానములను సమర్పించిరి. వీనిలో అనేకసంఘములు దేశీయసభా మహమ్మదీయ మహాసభలచే నిర్వచింపఁబడిన సంస్కరణముల నామోదించెను. మాంటేగ్యూగారీసంస్కరణములకు ఆమోదము దెలుపవలదా? ఆమోదము దెలుపవలయుచో రాజకీయోద్యమము నడఁచివేయఁబనిలేదు. మాకు స్వరాజ్యమునొసఁగుచో మాతృదేశమును సంరక్షించుటకు మేము సంసిద్ధుల మగుదుము. వారేరాజకీయవిధానమును స్థాపింపఁబోవుచున్నారో, ఏమిచర్యపూనఁబోవుచున్నారో మన కేమియు దెలియదు. సందేశవాహకుల ప్రయాణనిరోధసమస్యవిషయములు ఇండియా కౌన్సిలునుండి కొన్నివిషయములు తెలియఁగలవు. ప్రభుత్వమువారు విశేషౌదార్యమును ప్రకటించిరని ఇండియాకౌన్సిలువారనిరి. మాంటేగ్యూగా రిచ్చుటనే యున్నారఁట. ఆంగ్లజాతియంతయు మాంటేగ్యూగారితోడనే యున్నది కాఁబోలు. మాంటేగ్యూగారు ఇచ్చుటనే యున్నారు, గనుక రాజకీయాందోళనాపరులు అవసరము లేదఁట! మనకుస్వరాజ్యము నీయరనుట సులభముగ నీయవచ్చును. సందేశవాహకవర్గమువారు ప్రజల పక్షమున స్వరాజ్యముకొఱకు అనఁగా ప్రజలను సంతృప్తిపఱచుటకు అధమము కాంగ్రెసు-లీగువిధానము కొఱకైన ఇంగ్లాండునకు అరుగుచున్నారు. కాంగ్రెసు-లీగువిధానమును, ప్రభుత్వమువారు నిర్ణయించు విధానమును బ్రిటిషుప్రజలయెదుట నుంచుచో అదియైనను ప్రభుత్వ

మువారు మన కీయఁబూనుకొనరు. మనముకోరినదానిలో ఏభాగమునో మనకు ఇచ్చెదరు. ప్రభుత్వమువారవలంబించు రాజకీయవిధానము ఢిల్లీ సభలో చర్చింపఁబడునేమో తెలియదు. ప్రభుత్వమువారెంతయిచ్చిన నంతే చాలుననియు, ప్రభుత్వమువారు సభలో ఏదినిర్ణయించిన నదియే పదివేలనియు, సంతృప్తినొందువారు కొందఱుగలరు. ఇదియొకపక్షము వారిచర్య. వారేదియోయిచ్చిన మనము నిరాకరించినచో సమాధానమునకు రాఁజాలక ప్రభుత్వమువారు తాము ఈయఁదలఁచినదాని నింకను ఎక్కువసేయుదురనియు, క్రమముగా ప్రజాశయములు ఫలింపనువచ్చుననియు మఱికొందఱభావము. ఈరెండుచర్యలలో అనుసరింపఁదగినచర్యయేదో మీరే నిర్ణయింపవలెను. ప్రభుత్వమువారిభావమును పరికింపుఁడు. మహాధర్మసూత్రమునకు పోరాడుచున్నామని ప్రజలు తలంపవలయుననుసూత్రమును అయిర్లెండునకు అన్వయింపఁజేసిరి. ఆసూత్రమును భరతవర్షమునకు అన్వయింపఁదగదా? అయిర్లండుప్రజలవలె మనము మనుష్యులము కామా? భారతీయులేమియు షరతును బెట్టలేదు. షరతును పెట్టుటకు మీరెవ్వరందురని కొందఱందురు. ఇదియొకషరతా? స్వజాతియందనువర్తింపఁబడుచున్న ధర్మసూత్రముకొఱకు పోరవలయునని ఒకనిహృదయమునందు విశ్వాసము నుదయింపఁజేసినఁగాని అతనిని అట్లుపోరుటకు నిర్బంధింపవీలులే దను మనుష్యసహజప్రకృతిని ప్రభుత్వవారికి తెలుపుటయే మనయుద్దేశము. స్వదేశమునందు మీరును స్వాతంత్ర్యము ననుభవించెదరని ప్రజలకు నమ్మకముకలిగింపవలెను. ఇదియొకషరతగునా? ఇది మానుషధర్మము. సహజప్రకృతి మనసహకారము ఫలప్రదమగుటకు మానుషప్రకృతిని ప్రభుత్వమువారియెదుటఁబెట్టుటయే మనయుద్దేశము. ఇట్టిచర్చఅయిర్లండువిషయమున నంగీకరింపఁబడెను. మేము ప్రభుత్వము వారిని తోడ్పడ సంసిద్ధులమయ్యెదమనియు, వాయువ్యసరిహద్దునుండి వచ్చుఏయుద్ధమువలననైన భరతవర్షమును సంరక్షించెదమనియు మేము మాదేశముకొఱకు పోరుచున్నామని మాకునమ్మకముకలుగువఱకు అంతటి

ఉత్సాహముతో పనిచేయఁజాలమనియు, నేను కొలంబోనుండి రాజ ప్రతినిధికిని, ఆంగ్లప్రధానమంత్రికిని తంతివార్తనిచ్చితిని. ఈవిషయమును ప్రభుత్వమువారు తప్పక యోచింపవలయును. అధికారవర్గమువారు తమకు తోఁచినరాజకీయవిధానమును మనకొసఁగుటకష్టముగాదు. వారు దాని నిదివఱకే రెండుమూఁడుమాసములక్రిందటనే నిశ్చయించియుండిరి. మాంటేగ్యూగారిసంస్కరణవిధానమును ఇంకను ప్రకటింపలేదు. ప్రకటించినచో దానిపై తీవ్రమగుచర్చయు, కొంతకష్టమును గలుగును. ఇదియంతయు ప్రభుత్వమువారికిని, ఢిల్లీసభ కాహ్వానింపఁబడిన సంఘమువారికిని, సంబంధించినది. ఈసభవారితీర్మానమే న్యాయము. అయిర్లండువిషయమున వర్తింపఁజేయఁబడిన ధర్మసూత్రము మనవిషయమున వర్తింపఁజేయనిచో మనము మనదేశముకొఱకు పోరుటలేదని భావింపవలసివచ్చును. మనము కూలికొఱకు హీనకార్యములకు పాల్పడువారము కాము. ఆంగ్లప్రభుత్వవారు అయిర్లండువిషయమున స్వయంనిర్ణయసూత్రము నంగీకరించి భరతవర్షమువిషయమున నంగీకరింపఁ దలఁపలేదు. ఇందు మనమేమియు మరతును బెట్టుటలేదు. ఒకజాతిని సహాయము చేయమని కోరుటకు ముందు ఆజాతివిషయమున ననుసరింపవలసినవిషయమును ప్రభుత్వమువారికి జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాము. ఆవిషయమును ప్రజలకు నచ్చచెప్పవలెను. అయిర్లండునకు ప్రజాశయము నిచ్చుట ప్రజాశయానుగుణ మని నిన్నటితంతీవార్త ప్రకారము లాయిడుజార్జిగారు అంగీకరించిరి. ఆయిర్లండునకు స్వరాజ్యము నీయనిచో అమెరికానుండి ఆంగ్లేయులు ఊహించినంతటిసహాయము రాదని లాయిడుజార్జిగా రొప్పుకొనిరి; దాని నిప్పుడు పార్లమెంటుసభలో బహిరంగముగా నంగీకరించిరి. అమెరికావారికోర్కెననుసరించియే అయిర్లండునకు స్వరాజ్యము నిచ్చితిమని పార్లమెంటువారు బహిరంగముగా ప్రకటించిరి. అమెరికాసహాయమును మనము యాచింపఁ జాలము. సర్వసామాన్య మని మిత్రమండలివారు ప్రకటించుస్వాతంత్ర్యమునందు

మనకు విశ్వాసము చాలదు. లోకమునం దంతటనుస్వాతంత్ర్యము ప్రతిష్ఠింపఁ గోరుచో దానిని భరతవర్షమునఁ బ్రతిష్ఠింపవలదా? రాజకీయాందోళనమును దానివిషయపుచర్చను సంపూర్ణముగ నడఁచి వేయుదురనియు, వీరాయొద్ద మీయుసస్ఫూర్తిగ స్వార్థత్యాగమును, మనుష్యబలమును, ఫలసాయమును, పనియుదురనియు భయముగుచున్నది. మన స్ఫూర్తియనునది హృదయమునుండి రావలయును. మనహృదయములనే కప్పి యుంచి భావములకు ప్రాముఖ్యము నీయకుండినచో మనస్ఫూర్తి యనునది ఎక్కడనుండి వచ్చును? మనలను పశువులనువలె పని చేయునట్లు నిర్బంధించెదరు. భరతవర్షమునకు స్వవ్యవహారమును జన్మస్వత్వము నంగీకరింపనిచో భరవర్షము యుద్ధము సలుపఁ జాలదు. మనము చేయవలసిన దేమి? మనము ధనమును, బలమును సిద్ధపఱుపవలెను. ప్రకృతి యనుమహాదేవత తాను విధించుధర్మములను ఎట్లయినను నిర్వర్తింపఁ జేయు ననుసత్యమును ప్రభుత్వమువారి మనస్సునకు ఎక్కునట్లు చేయవలెను. రాజకీయాందోళనము నడఁచివేయుచో దాని నడచు టెట్లు? ఇంకొకముద్రణశాసనమును, ఇంకొక అరాజకీయ సభలశాసనమును, ప్రబలమగు ఇంకొక హిందూదేశరక్షకశాసనమును ప్రవేశపెట్టుటయే దీనికి ఉపాయము. స్వరాజ్యమునుగూర్చి వా రొక్కమాటయైన అనరు. యుద్ధము జయప్రదముగ నంతము కావలయు ననువిషయమును వారు గమనింపరు. భరతవర్షక్షేమలాభములకు సామ్రాజ్యరక్షణము ముఖ్యమని 30 కోట్లజనులకు నమ్మకము గలిగించినచో వారు సామ్రాజ్యసంరక్షణమునకు సంసిద్ధు లగుదురు. సామ్రాజ్యరక్షణవిషయము మాత్రమే కాదు. మనస్ఫూర్తిగ ప్రజలు తోడ్పడవలయుననియు, ఇప్పుడున్న రాజకీయతంత్రమే నడచుచుండవలయు ననియు, ప్రభుత్వమువారు కోరుచున్నారు. బహిరంగముగ చర్చించుట మానివేసి కాలపువిషమస్థితిని బ్రిటిషువారికిఁ బ్రకటింపవలయును. గాని బ్రిటిషువా రట్టి చర్చ నంగీకరింపలేదు. తమవిధానమును తామే నిర్ణయించుకొని మీరు ఇంగ్లాం

దునకు పోఁగూడ దనియు, హిందూదేశమునలన నైనస్థితిగతులను గుఱించి మీ రొకమాటయైనఁ బలుకఁ గూడ దనియు ప్రభుత్వము వారు చెప్పెదరు. మనము భారతీయులసహజగుణములతో కట్టకడపటి వఱకును పోరి యుద్ధానంతరమున నైనను అయిర్లండువలె స్వయంనిర్ణయస్వాతంత్ర్యములను బడయవలయును. మనకు సమయ మిదియే. దానికొఱకుఁ బనిచేయ బద్ధప్రతిజ్ఞులయినచో దైవము మీకు తోడ్పడును. అధికారవర్గము వారికి లోనుగా నుండుటకు ఎంతవఱకును మీకు మనోనిశ్చయముగలదో దైవము పరిశీలింపవేచి యున్నది. మనము నిర్ణయించుకొనినపట్టుదలనే దృఢముగఁ బట్టి యుండవలయును. రూపాయిలో ఏ 4 అణాలో, 5 అణాలో ప్రభుత్వమువా రీయఁ దలఁచినంత పుచ్చుకొనుట మనకిష్టము లేదు. ముష్టివాఁడైనను ఒకదమ్మిడే నిచ్చిన నవతల పాఱవేయును. మనము ముష్టివాండ్రము కాము. వా రిచ్చుదానికంటె నధికముగా నీయవలయు నని మనము పట్టుపట్టినచో అధికముగనే మనకు లభించును. మీరు పోరవలసినయవసరమును తెలిసికొన నిర్బంధించునంతటి యవస్థ తటస్థించినది. ప్రభుత్వమువారు నిర్బంధసైనికవిధానము నీదేశమునఁ ప్రవేశపెట్టనిండు. మన మేమి చేయవలయునో అప్పుడే నిర్ణయించుకొందము. ఎట్లయినను ఇప్పుడు లొంగితిమా మన మధోగతిపాలగుదుము. ప్రభుత్వమువారు చాలకష్టస్థితియందున్నారని మఱియొక వాదము చెప్పఁబడుచున్నది. దీనియందర్థము లేదు. కడచిన 150 సంవత్సరములు ప్రభుత్వమువారు మనక్షేమలాభముల నేమియు యోజింపక సామ్రాజ్యమునకు విషమదశ సంప్రాప్తించినప్పుడు మనయొద్దకు వచ్చి మనసహాయ మత్యవసర మనిరో రెదరు. అట్టిప్రభుత్వమువారు నిజముగ మనసహాయము నపేక్షించుచో వారు మనయెడఁ దమకుఁ గలఅన్యాభిప్రాయమునువిడిచి ప్రస్తుతస్థితిలో మనకు కొంతన్యాయమునొసఁగవలయును. ప్రజలు ప్రభుత్వముకొఱకు సృజింపఁబడలేదు. ప్రభుత్వమే ప్రజలకొఱకు ఏర్పఱుపఁబడినది. ప్రస్తుతపరిపాలనావిధానమే అసందర్భము; ప్రభు

త్వము వారి కా సక్తి లేదు. ప్రజలా అసహాయులు, అసహాయు లగు వారి
చేతను ఆయుధములు లేకపోలేదు. ఆయాయుధము సాత్త్విక నిరోధము.
ఈయాయుధబలమున ప్రభుత్వము వారే ప్రజాభిప్రాయమునకు లొంగె
దరు. మన అసహాయస్థితియందును ప్రభుత్వము మనకుఁ తోడ్పడకున్నచో
వారు మనసహాయము నపేక్షించుటయే అనవసరమని ప్రభుత్వము వారికి
నచ్చ జెప్పవలయును. ఇదియే ప్రస్తుతపుస్థితి. ప్రజలలో తమ కిష్టము
వచ్చిన నాయకులను నియమించి ప్రభుత్వము వారు తమపనులను సాగిం
చుకొనుచున్నారు. రాజకీయాందోళనము నంతను నిలిపివేయవలయు
నని ప్రభుత్వము వారు కొందఱు నాయకులతోఁ బలుకుదురు. పశ్చిమము
నందువలె తూర్పునందును, ఆసియాఖండమున యుద్ధభయము గలుగు
చున్నది. దీనినెదుర్కొనుట కేర్పాటులు చేయఁబడెను. వాని నిదివఱకె
చెప్పియుంటిని. మనము 50,100 లక్షల సేనను సామ్రాజ్యమునకు ఒసఁ
గఁగల మనియు. దానిని ప్రభుత్వమువా రంగీకరించినచో తూర్పునఁ
కాని పడమటఁగాని ఎచ్చటనైన సామ్రాజ్యమును రక్షింపఁగల మనియు
నమ్మకము చెప్పుచు మనయాశయములను దెలుపుచు అమెరికాఅధ్యక్షు
నకు ఒక ఉత్తరమునందు దెలిపితిమి. హిందూదేశ మొక్కటియే సర్వ
శక్తియుతమైనది. ఈమహాసంగ్రామానంతరమున బ్రిటిషువారియందు
వర్ణవిభేదచింత యుండదు నని నాకుఁ దోఁచుచున్నది. భారతస్వరాజ్య
మును నిరాకరించినను, యుద్ధమును సక్రమముగా నడపవచ్చునని
హిందూదేశప్రభుత్వము వారూహించుచున్నారు. మాతృదేశసంరక్ష
ణమునకు మనము సంసిద్ధులముగాని అన్యదేశీయులలాభములకు ఉండు
దేశమును రక్షింప సంసిద్ధులము గాము. హిందూదేశప్రభుత్వము వారు
ప్రస్తుతస్థితులను గ్రహించిరని భావించెదను. మీ రడుగుచుండుదానిని
మఱింత తగ్గించుటకును, మిమ్ము నిర్బంధించుటకును వారు ప్రయత్నిం
తురు. మనము ఓపికతో వేచియుండి మన మిదివఱకు నిర్ణయించుకొనిన
అత్యల్పసంస్కరణము లగు కాంగ్రెసు-లీగు విధానములనే పట్టుపట్టి

సాధింపవలెను. మనకు షరతులను జెప్ప నవసరము లేదు ; గాని మనలను గూడ మనుష్యులవలె నితరులతో సమానముగ నాదరింపవలయు నని కోరుచున్నాము. మనకు ఉత్సాహమును, హృదయపూర్వక మగుభావమును ఉండవలయు ననినధర్మసూత్రము ననుసరించి మనుష్యధర్మవిధముగ మనల నాదరింపవలెను, అట్లు ఆదరించిననే మనభావబలమును, ఉత్సాహమును ఫలకారియగును. ఇది షరతు కాదు; అవలంబింపఁదగిన సత్క్రమవిధానము. ప్రస్తుత రాజకీయస్థితి త్వరితగతిని మార్పుల నొందుచున్నది. ఢిల్లీసభ వారితీర్మానము అనంతరమున రాజకీయస్థితి మాఱివచ్చును; గనుక మనము సభావిషయమునే మొదట బలవంతముగ ఖండింపవలయును. మననాయకులను తప్పుత్రోవలఁ ద్రిప్పవచ్చును. ఇదివఱకువలె విశ్వాసము నుంచవలసిన నాయకులు కాకపోవచ్చును. ఎట్లయిన నొక్కటే యగును; కాని మనపట్టుమాత్రము వదలఁగూడదు. యుద్ధము విజయము గలుగునంతవఱకును సాగకుండినచో మనరాజకీయాందోళన మంతయు నిదివఱకన్న మఱింత బలకరముగ సాగింపవలసినసమయ మిదియే. ప్రభుత్వమువారిచర్య తీవ్రముగ ఖండింపఁబడును. అప్పటికి మీరందఱును సంసిద్ధులై యుండవలెను. మీకుఁ బాతికభాగమే కావలయునో, అంతయుఁ గావలయునో మీరే నిర్ణయించుకోవలెను. మననాయకులు కొందఱు ఇప్పుడు సందిగ్ధమనస్కు లగుచున్నారని పత్రికలవలనను, ఇతరవిధములను దెలియుచున్నది. వా రెట్లయినఁ గానిండు. మనము మాత్రము పట్టు విడువవలదు. స్వరాజ్యపుహక్కు నిచ్చునంతవఱకు మనము మనస్ఫూర్తిగఁ బ్రభుత్వమువారికిఁ దోడ్పడఁ జాలము. ఇట్టిమహాప్రభుత్వ మైనను లొంగక తప్పదు. అయిర్లండు విషయమున అమెరికావారినిర్బంధ ముండెను. అమెరికావారిసహాయము మనకు లేకున్నను దైవసహాయమును న్యాయమును మనపక్షముననుండి ప్రభుత్వమువారిని నిర్బంధింప నున్నవి. మనము ఓపికతో బ్రయత్నించుచున్నచో ఆసహాయములు మనకు దప్పకసిద్ధించును; పోరు ఆరంభమైనది.

ప్రభుత్వమువారిచేతనే ఆరంభింపఁబడినది. మనము చెప్పవలసినదంతయు చెప్పినవెనుక ఎవరు జయించెదరో చూడవలసియున్నది. మనకున్యాయము గలిగినపిదప సామ్రాజ్యమునకు సేవఁ జేయఁగోరుచున్నాము. పైనిచెప్పిన ధర్మసూత్రములవలననే మనము సామ్రాజ్యరక్షణమునకు సంసిద్ధుల మయ్యెదము. ఈవిషయమును ప్రభుత్వమువారి ఆలోచనకు నకు తోఁచవలెను. ఢిల్లీసభవారు మన కనుకూలముగఁ జేసినచో మంచిదే. లేకున్న ప్రభుత్వపక్షము నెదిరించుటకు ప్రజాపక్షమును నెలకొలుపవలెను. పూర్వపుమితవాదులు, అతివాదులు అనుపేర్లు పోయి క్రొత్తపేర్లు వచ్చును. కట్టకడపట యుద్ధస్థితివలనను, కాలసందర్భము వలనను మనయాశయములు ఫలించి తీఱును.

అనంతరము అధ్యక్షురాలగు ఆనిబిసెంటు సభను ముగించుచు రహ్యావిచ్ఛేదముతో ఏషియాస్థితులు మాఱిన వనియు, ఈసందిగ్ధసమయమున హిందూదేశసంరక్షణార్థము సేననుగూర్చి యుంచి మాతృదేశమును గాపాడుట యవసరమనియు, పూర్వము భారతీయుల మగుమనము స్వరక్షణకు సమర్థులై యుంటిమి. గాని 1878 సంవత్సరమునుండి మనకు సహాయులమైతిమనియు, సాధించి మనయాశయములను బడయుటకిదియే సమయమనియు, యుద్ధారంభముననే భరతవర్షమున సేనలను తయారుచేసి యుంచినచో మన ముత్సాహపూరితులమై సామ్రాజ్యమును రక్షించి విజయము బడసి యుండెడివార మనియు, మనము యుద్ధము సలుపవలసియున్నచో స్వాతంత్ర్యయుతులమై సామ్రాజ్యపౌరులవలె నుందు రని మనకు నమ్మకము నీయవలె ననియు లోకమాన్య తిలకుగారి హితోపదేశనిర్వహణమున చెన్నరాష్ట్ర మెన్నటికిని వెనుకఁబడ దని ప్రజలతరఫున శ్రీ తిలకుమహాశయమునకు నివేదించుచుంటిననియు చెప్పెను. వందేమాతరమను ధ్వనులతో సభ ముగిసినది.

## ఉపసంహారము.

శ్రీ తిలకుగారు 1916 సంవత్సరమువఱకు చేసినపని యిదియని 12-వ పుటలో చెప్పియున్నాము. ఇటీవల వారు ఇంగ్లాండునకు వెళ్లి కాంగ్రెసుప్రతినిధులతో కలసి మన దేశము మేలునకై పడినపాట్లు పత్రికలవల్ల అందరికిని తెలిసియే యున్నది. ఇప్పుడు మనకు ప్రసాదింపబడ్డ రాజ్యాంగసంస్కరణములకు వీరినిరంతరకృషియే ముఖ్యకారణ మని కూడా చెప్పి యుంటిమి. ఈసంస్కరణములగూర్చి కొంత వివరించి ఈగ్రంథమును పూర్తిచేసెదము. మితవాదుల కుట్రలవల్లను, బ్రాహ్మణేతరుల పోరబాట్లవల్లను కాంగ్రెసు-ముస్లిమ్‌లీగువారు కోరినసంస్కరణలు మనకు లభించినవి కావు. శ్రీతిలకు, గాంధి, పండితమాళవ్యా మొదలగువారిసహాయముతో మరింత కృషిచేసినగాని మనకు సంపూర్ణాధికారము రాచాలదు.

### రాజకీయసంస్కరణములు-గవర్నమెంటు.

ఇప్పటి రాజ్యాంగవిధానమును గుఱించి చెప్పుట అనవసరము. ప్రజాభిప్రాయమునకు బద్ధులుకాని కార్యనిర్వాహక సభ్యులతోఁ గూడుకొన్న ఒక అధికారవర్గము (Bureaucratic Government) క్రింద మనము చిరకాలమునుండి కష్టపడుచున్నాము. ప్రజల సంరక్షణకు ఏర్పడ్డ కార్యనిర్వాహకసభ (Executive Government) యొక్క చర్యలు ఎంత అధర్మములు, అక్రమములైనను దానిని లోంగదీసి ప్రజాభిప్రాయప్రకారము నడచునట్లు చేయుటకు సమర్థతలేని చట్టనిర్మాణసభ యొకటి మనకు సంప్రాప్తమై యున్నది. ఇట్లుండఁగా ఇటీవల పొసగిన ఐరోపామహా సంగ్రామమున మనదేశస్థులు ధీరతనము వారికి చూపిన ప్రభుభక్తి విశ్వాసములును, సంగ్రామమునకై మనశక్తికి వంచన లేకచేసిన మనుష్యసహాయము, ద్రవ్యసహాయములుఅమూల్యములగుటచే బ్రిటీష్ మంత్రివర్గమువారు హిందూదేశమున బాధ్యతా

యుతప్రభుత్వమును (Responsible Government) నెలకొల్పుదుమని వెల్లడిపఱిచిరి. శాసననిర్మాణసభనుండి ఎన్నుకొనఁబడిన కార్యనిర్వాహక సభ్యులను నియమింపను, లేక తొలగింపను అధికారముగల ప్రజాసభయొక్క ప్రభుత్వమునకే బాధ్యతాయుత ప్రభుత్వమని పేరు. ఈశాసననిర్మాణసభాసభ్యు లప్పుడప్పుడు ప్రజలచే ఎన్నుకొనఁబడుదురు. కాఁబట్టి శాసననిర్మాణార్హత ప్రత్యక్షముగ సభ్యులదే అయినను, వారు ప్రజలవలన ఎన్నుకొనఁబడిన సభ్యులైయుండి ప్రజాభిప్రాయము ననుసరించి నడచువారగుటచే, నిజముగ శాసననిర్మాణార్హత ప్రజలదే అని భావింపవలసియున్నది. ఈశాసననిర్మాణసభ్యులు తమకును, తమద్వారా ప్రజలకును బాధ్యు లగుమంత్రివర్గమును ఏర్పఱచుకొనుట విధియై యున్నది. శాసననిర్మాణసభ్యులకు మంత్రివర్గము బాధ్యమై యుండవలయును. అనఁగా శాసననిర్మాణసభ్యులకు మంత్రివర్గమున నమ్మకము పోయినవెంటనే అట్టిమంత్రులు వారిపదవులను వదలవలయును. ప్రజాభిప్రాయమును పొందనిది వారిపై ఎట్టిపన్నును విధింపరాదు. మఱియు వారి ఇష్టములేక తమమంత్రులు ఇష్టానుసారము కోశములోని ద్రవ్యమును ఖర్చుపెట్టరాదు. ఇట్టిప్రభుత్వమే బాధ్యతాయుత (జబాబుదారీ) ప్రభుత్వము.

న్యాయశాస్త్రమునందు మంత్రిచేయుప్రతికార్యమునకుబాధ్యత మంత్రిదై యున్నది. పై నుదాహరించిన మంత్రియొక్క బాధ్యతకును ఇప్పుడు చెప్పెడు బాధ్యతకును ఏవిధమైన సంబంధములేదు. ప్రభుత్వమువా రెల్లప్పుడు మంత్రిద్వారా చర్యను నడపుదురు. కాఁబట్టి మంత్రిచేయు ప్రతికార్యమునకు బాధ్యత మంత్రిదై యున్నది. ఇందుకు దృష్టాంతము.—అవసరములేనిది ఇప్పుడు సైనిక ప్రభుత్వమును మంత్రివర్గమువారు స్థాపించినయెడల, అట్లు చేసినందులకు న్యాయప్రకారము మంత్రి జబాబు చెప్పవలసియున్నది. ఈ రెండు విధముల బాధ్యతలను వహించే మంత్రివర్గము ఏర్పడినయెడల అద్దానినే బాధ్యతాయుత

ప్రభుత్వ మనెదరు. పార్లమెంటుసభవారివల్ల మనకువాగ్దానము చేయఁబడిన బాధ్యతాయుతప్రభుత్వస్వభావము ఇదియే.

ఈప్రకటనలోని విధానములను నెఱవేర్చుటకే ఇండియామంత్రిగారు (State Secretary of India) రాజప్రతినిధియగు వైసిరాయిగారును కొన్నిసంస్కరణములను ప్రకటించిరి. అట్టి సంస్కరణముల లోని విధానములను మనదేశమునందలి రాజకీయసభలు పరిపరివిధములుగా విచారించుచున్నారు. ఆసంస్కరణముల విధానముపై ప్రజాభిప్రాయమును తెలుపుఁడని సంస్కర్తలు కోరియున్నారు. స్వయంనిర్ణయ సూత్రాధికార ప్రభుత్వమును (Right of Self-determination) యుద్ధానంతరమున ప్రపంచములోనుండు ఎల్లదేశములలోను నెలకొల్పవలయునని ఐరోపాదేశములోని బలిష్ఠములైన రాజ్యము లన్నియు (powers) నొక్కచోటఁ జేరి నిర్ధారణ గావించియున్నందున, నాసందర్భము నెఱిఁగి, ఇండియాదేశపు సర్వజనహితార్థమై, సర్వజనాభిప్రాయమును తనగుండా వెల్లడిజేయుటకు బాధ్యతగల ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌సభ ఒక్కచోటఁగూడి వెంటనే రాజప్రతినిధిగారియొక్కయు మంత్రియగుమాంటాగ్యూగారియొక్కయు సంస్కరణములు ఈసమయమున ఇండియాదేశములోని ప్రజలకు యాశాభంగకరము లనియు, వెంటనే సంపూర్ణరాష్ట్రాధికారమును ఇండియాదేశమున కియ్యవలయుననియు, కేంద్ర ప్రభుత్వమున (Central Government) కొంతవఱకైనను స్వయంనిర్ణయ సూత్రాధికార ప్రభుత్వమున కెడ ముంచవలయుననియు తెలిపెను. ఇండియాదేశము అంతట బాధ్యతాయుత ప్రభుత్వమునకు ప్రకృత మర్హత గలదైయున్న దనునాధారముపై బలపఱచి కాంగ్రెసుసభవారీవిధానమును వేడిరి. కాంగ్రెస్ ప్రతినిధులు ఇగ్లాండునందు ఏర్పడ్డ విచారణోపసంఘము (Joint Commitee) ఎదుట సాక్ష్యమునిచ్చి ఇండియా ప్రజాభిప్రాయమును నిరాఘాటముగా తెలిపి కాంగ్రెస్ సభవారు కోరిన సంస్కరణముల నిష్పింప

మని కోరియున్నారు. ద్వంద్వరాజ్యాంగపద్ధతి (Diarchy) బాధ్యతాయుత ప్రభుత్వము కానేరదు కాని, ఏదో ఒకతీరున అధికారవర్గముతోఁ గలసిపోవలయు ననుభావముతో కాంగ్రెస్ ప్రతినిధులు కేంద్రప్రభుత్వమున (Central Government) ద్వంద్వరాజ్యాంగపద్ధతి(Diarchy) నంగీకరించి రాష్ట్రీయప్రభుత్వమునమాత్రము సంపూర్ణాధికారమును గోరిరి. ఇందువలన మితవాదులలో నాయకులకు భయోద్రేకము కలిగెను. కారణ మేమన, మన మంత గొప్ప కోరికలను కోరినయెడల బ్రిటీషుప్రజలు గొంతెమ్మ కోరికలని భావించి అసలే దేనిని ఇయ్యకపోవుదురేమో అని! అవును, అది నిజమే! మన ప్రభుత్వము నిర్వహించుటకు మనము తగినవారమని వారికి తోఁచువఱకు అధికారము నెట్లు వదలుదురు? వారేకాదు, వారిస్థానమున ఎవరున్నను మనకోరికలు కొనసాగనివి, అనియే అనవచ్చును. బ్రిటీషురాజ్యాంగముక్రింద నూటయేబది సంవత్సరము లుండియున్నను, అవసరము వచ్చినప్పుడు నిర్భయముగ ప్రభుత్వము వారితో "మా దేశ వ్యవహారములను సంస్కరించుటకు మాకు తగినశక్తి వచ్చినది. మాఅధికారమును మా కియ్యవలసినది" అని పోరుటకుకూడ మనము నేర్చుకొననియెడల మనచదువు, మన అనుభవములవల్ల ప్రయోజనమేమి? ఈసందర్భమున మన దేశములోని ప్రముఖులలో ఒకరికిని ఒకగవర్నరుగారికిని జరిగినసంభాషణలో వారు "మీకు సంస్కరణములు కావలసిన వానిని నిర్భయముగ కోరవచ్చును. కోరి తుదకు అవి లభించువఱకు ప్రభుత్వముతో పోరాడవచ్చును. కాని కొందఱు ప్రజానాయకుల విషయమై నాకు కలిగిన అనుభవ మెట్టిదో చెప్పెదను వినుఁడు," అన్నారు. గవర్నరుగారు. వారు నాయొద్దకు వచ్చి రాజకీయసంస్కరణములవిషయమున నాసలహాలే (proposals) అన్నిటికన్న మేలైనవనియు, అవి తమకును సమ్మతము లేయనియు చెప్పి పిదప మఱియొక పెద్దమనిషి వచ్చినపుడు వారియొద్దకు వెళ్లి వారి సలహాలే గొప్పవనియు సమ్మతమైనవనియు చెప్పియుండిరి. గవ

ర్నరువంటివానికి మీ ప్రజాప్రతినిధులు చేయుసహాయ మెట్టిదైనయెడల ఏ కార్యములు కొనసాగగలవు?' అనిరి. ఇదే నిజమైనయెడల మనలో నెవ్వరినైనను వారికి చెప్పఁదగిన సమాధాన మెద్దియో ఆలోచింపుఁడు. సిగ్గుతో తలవంచుకొని అట్టివారు మనప్రతినిధులు కారనియు, మన అభిప్రాయములను బైలుపుచ్చువారు కారనియు బదులు చెప్పవలసిన వారమైయున్నాము. వీరుగాక, ఇంకను ఒకతరగతి ప్రజాప్రతినిధుల మని చెప్పుకొనువారున్నారు. వీరెట్టివా రనఁగా శ్రీమాంటాగ్యుగారి విధానమును బలపఱచి అంతేచాలు నని చెప్పకపోయినయెడల, అసలు విధానమే యూడిపోవునేమో అని నిశ్చయముగ మనస్సుననమ్మియుండు వారు. అట్లుచేయనియెడల సైడన్‌హాంకక్షివారు అసలుబిల్లునే అణఁగఁ ద్రొక్కుదురని చెప్పుచున్నారు. ఈరెండవతరగతి ప్రజాప్రతినిధులు మనతో ఐర్లాండుదేశపు స్వరాజ్యవిధానము ఎన్నిమార్లు విఘ్నమైనదో చూడుఁడని చెప్పుచున్నారు. ఈతీరుగా భయపడి 'చిత్తము, మీరెంత ఇచ్చిన నంతేచాలును, మహాప్రభో!' అని దీనాలాపములాడు స్థితిలోనే యుండినయెడల యెన్నటికిని మనకు సంపూర్ణమైన బాధ్యతాయుతప్రభుత్వము లభింపదు. మనవారిలో కొందఱు తాముప్రభుత్వమువారి అభిప్రాయముల ననుసరించి నడచుటవల్లనే కొన్నిసంస్కరణములైనను మనకు లభించినవి, లేనియెడల మొదలే లేకపోవుననే యభిప్రాయముతో నున్నారు. ఇది కేవలము పొరబాటు. మనవిమోచనము మనచేతిలోనే యున్నది. ప్రతినిమిషమున సహాయము నిమిత్తమైదీనులమై గవర్నమెంటువారివంకనేమనము చూచుచుండినయెడల ఎట్టిమేలును కలుగనేరదు. మిస్టర్ జిన్నాగారు హోంరూలు తరఫునను, ముస్లింలీగు తరఫునను ప్రతినిధులైనను వారు విచారణోపసంఘము (Joint Committee) ముందు యిచ్చినసాక్ష్యములో యాచకులకు వారి కిష్టము వచ్చినదానిని అడుగుట కర్హతలేదనిన్ని, ఈసంస్కరణవిషయమున మన దేశప్రజలను అట్టియాచకులుగాఁ దలచి గవర్నమెంటువారికి తోచినంత

ఇచ్చెదమని చెప్పుచుండు అభిప్రాయముతో నున్నారని చెప్పియున్నారు. వీరు కాంగ్రెసు ప్రతినిధులు కాకపోయినను, మన దేశముయొక్క ముఖ్యాభిప్రాయమును వెల్లడిచేసినపుడు ప్రజలకు అట్టి అభిప్రాయ ముండుట మంచిదికాదు; దానిని తొలగింపవలసినదని కమిటిలో కొందఱుకోరఁగా, మీరు సాధ్యమైనంతవఱకు ప్రజ లంగీకరించు ముఖ్యసంస్కరణముల నిచ్చినయెడల అటులే చేయుదురని చెప్పియున్నారు. మఱియు వారు మాంటాగ్యు విధానములన్నియు పిఱికితనముతోను, పక్షపాతముతోను కూడియున్నవని చెప్పిరి. వీరు చెప్పినదే నిజము. ఇట్లు ప్రభుత్వము వారికి చెప్పుటవలన జిన్నాగారు మన దేశమునకు మహోపకారమును చేసినవారై యున్నారు. కాంగ్రెస్ ప్రతినిధులు శ్రీ శ్రీనివాసశాస్త్రి, మోచర్ల రామచంద్రరావుగార్లవలన పల నిందార్హులు కావలయును. వీరును, వీరికక్షివారును కొద్దిసంఖ్యాకులై యున్నారని వీరి కక్షికి నాయకుఁడైన శ్రీ సురేంద్రనాథబానర్జిగారు ఇచ్చిన సాక్ష్యమున ఒప్పుకొన్నారనుసంగతి శ్రీ శాస్త్రిగారు మఱువఁగూడదు. తామే మన దేశమును వదలుటకు ముందు ప్రజ లెవ్వరును తాము గవర్నమెంటుపక్షము నవలంబించుటవలన తమ మాటపై గౌరవ ముంచలేదనియు, తాము చెప్పినతీరున నడచుటలేదనియు, బహిరంగముగ ప్రకటించినసంగతి వారు మఱువఁగూడదు. మఱియు విచారణోపసంఘము (Joint Committee) యెదుట సాక్ష్యము నిచ్చిన ప్రముఖులలో కొందఱు యిచ్చట రాష్ట్రీయప్రభువులుగ నుండినవారు రాజకీయవ్యవహారములలో తా ముండినప్పటి ఇండియాస్థితికిని యిప్పటికిని భేద మున్నదని చెప్పినసంగతి శ్రీ శాస్త్రిగారు మఱువఁగూడదు. వీరును, వీరిమిత్రవర్గమువారును ప్రజానాయకత్వము నేలకోల్పోయిరి? వినుఁడు. ప్రజలు రాజకీయవ్యవహారములయం దారితేరినవారై పూర్వపుతీరున గుడ్డివారివలె నాయకులుచెప్పు ప్రతివిషయమునకు తలలూచక వారుచెప్పినదానిని విమర్శించి మంచిచెడుగులను కనిపెట్టుశక్తికలవారగుటవల్లనే. ప్రజ లిట్టిస్థితియందున్న

ప్పుడు నాయకుల నిరంకుశాధికారత్వమునకు భంగము కలుగకపోదు. నాయకులు చిరకాలము కష్టించి ప్రజల రాజకీయవ్యవహారములయందు ఈస్థితికి తేగలిగినందులకు సంతోషించి ప్రజాభిప్రాయమున కనుకూలముగ తాము నడుచుకొనవలసినది విధియై యుండెను. శ్రీ శాస్త్రిగారు వీరి మిత్రవర్గమిప్పు డేమిచేసిరో కనుఁగొనుఁడు. ప్రజ లీస్థితికి రాఁగానే పూర్వమువలె వారిమాట సాగ లేదని కాంగ్రెస్ సభయందుండి తాము చీలిపోయి తమ కక్షతరఫున ప్రత్యేక ప్రాతినిధ్యమును వహించి ఇంగ్లాండునకుపోయి తమకిట్టియవస్థసంప్రాప్తమైనదనిన్ని మాంటెగ్యూసంస్కరణ విధానములు బలవఱుప వచ్చియున్నావని చెప్పియున్నారు. శ్రీ మాంటెగ్యూగారు మన ప్రజాసామాన్యాభిప్రాయ ప్రకారమే నడుచుకొనవలయునని తామాతురముతో నుండునట్లు చెప్పుచున్నారు. అయితే ప్రజాభిప్రాయమను మాటకు వారిదేశమున ఏ యర్థము చేయుదురో ఆయర్థమును మన దేశమున చేయుట లేదు. ప్రజాయభిప్రాయమెటులున్నను తమ కనుకూలముగనుండి తాము చెప్పునదే సరియైనది అనిచెప్పు ఏకొలది మందినైన తృప్తిపఱచుటకూడ ప్రజాసామాన్యాభిప్రాయమును తృప్తిపఱచుటయే యని శ్రీమాంటగ్యూగా రభిప్రాయపడుచున్నారు. సర్ జేమ్సుమేస్టన్ గారిని విచారణోపసంఘమువారు (Joint Committee) అడ్డప్రశ్నలు వేయుటలో ఇండియా దేశములో మనము కావించు సంస్కరణములు కొందఱికైన తృప్తికలిగింపఁగలవా? అనియడిగిరి. ఇది ఎంత సరసమగు మాటయో చూడుఁడు. శ్రీ శాస్త్రిగారు, వారిమిత్రులు, కాంగ్రెసునుండి చీలినందులకుగాని, ఆమీఁద వారీవిషయమై చేయుచుండు కృషివిషయమైకాని, కాంగ్రెస్సువారితో దెబ్బలాడుట లేదు. ఇట్టి స్థితిలో మిక్కిలి జాగరూకులును, మితవాదులు నైన శ్రీ శ్రీనివాస శాస్త్రిగారు తమ "సర్వెంటు ఆఫ్ ఇండియా" పత్రికలో కాంగ్రెస్ ప్రతినిధి యగు శ్రీ గా॥ పటేలుగారు మొదటినుండి తప్పుదారిద్రొక్కి రనియు ఒకప్పుడైన విచారణోపసంఘము వారు వీరు చెప్పిన సంగతులకు

సానుభూతి నియ్యలేదనియు వ్రాసియున్నారు. శ్రీ పటేలుగారు జాయింటు కమిటీవారి సానుభూతిని సంపాదించుటకు అంత దూరప్రయాణము చేయలేదు. అట్టి సానుభూతిని వారు చూపకపోయినందున శ్రీ పటేలుగారికిగాని, వారి దేశమునకుగాని ఆశాభంగము కలుగ నేరదు. ఇతరులవలె తమ దేశీయుల అభిప్రాయమును తెలియఁజేయువలసిన విధాయకమును వదలి, గవర్నమెంటువారి అభిప్రాయప్రకారమే నడుచుకొని యుండినయెడల వీరికిని కమిటీవారి సానుభూతి లభించియే యుండును. పార్లమెంటువారియొద్దకు యాచనార్థమై పోయియుండినయెడల వారి సానుభూతికి ఎదురుచూడవలసినవారే. ఇది ముష్టియడుగుటకు తరుణము కాదని శ్రీ శాస్త్రిగారు తెలిసికొనకపోవుట విచారకరము. శ్రీ దివాన్ మాధవరావుగారిని గుఱించి వ్రాయుటలోకూడ, వారు అడ్డసవాళ్లకు సరియైనజబాబు లియ్యలేదనియు, మొదటచెప్పినకొన్నియంశములను అడ్డసవాళ్లను వేయునప్పుడు దృఢపఱచుకోలేక పోయిరనియు శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. న్యాయప్రకారము సాక్ష్యము నిచ్చునపుడు మొదట కొన్ని యంశములను దృఢముగఁ జెప్పినను అడ్డసవాళ్లలో అవసరమైనప్పుడు వానిని కొంత సవరించుకొనుట విధి. ఇందులో చిత్రమేదియును లేదు. తాముపట్టిన కుందేటికి మూఁడేకాళ్లని చెప్పవలసిన విధి ఎచ్చటను లేదు. శ్రీ తిలకుగారు, శ్రీ పటేలుగారు, శ్రీ దివాన్ మాధవరావుగార్ల సాక్ష్యమువలన జాయింటు కమిటీవారి కంత తృప్తి కలిగినట్లు లేదని శ్రీ శాస్త్రిగారు భయపడుచున్నారు. ఉభయకక్షుల తరఫున సాక్ష్యమును విచారించుటకు మునుపే, తాము చేయుచున్న తీర్మానమును మనస్సున నుంచుకొని పక్షపాతబుద్ధితో కూర్చున్నన్యాయమూర్తియెదుట శ్రీ శాస్త్రిగారు వాదించి న్యాయమును బడయుటకు ప్రయత్నించినవారు కాకపోవుటచే వారి కట్టిభయముపుట్టుట సహజము. కాని వారి మనోభిప్రాయముల నీతీరున వెలిబుచ్చుట సరి కాదని శ్రీ శాస్త్రిగారి బుద్ధికి తట్టనందుకు చింతిల్లవలసియున్నది. కాంగ్రెసు మహాసభ

వారు ముప్పదిమూఁడుసంవత్సరములు పాటుపడి తుదకు ఫలప్రాప్తినము యమున కాంగ్రెసు మహాసభానుభవములనుగాని, మూలయుద్దేశము లనుగాని యెంతమాత్రము గ్రహింపలేని శ్రీ పటేలుగారు, శ్రీ మాధవరావుగారును ప్రతినిధులుగా నెన్నుకొనఁబడినందులకు విచారము చెందవలసియున్నదని వ్రాసినారు. ఈపట్టున శ్రీ శాస్త్రిగారి రచనాశైలికి సంతోషింపవలసినదే కాని వారుచేసిన నిందారోపణమునకు కానేరదు. కాంగ్రెసు మహాసభ ముప్పదిమూఁడుసంవత్సరములు కృషిచేసి సంపాదించిన అనుభవ మేమిటిది? వారి ముఖ్యోద్దేశము లేమిటివి? అవి ఎట్టినాయకులలో మూర్తీభవించినవి? అను ప్రశ్నలకు శ్రీ శాస్త్రిగారి వ్రాత అవకాశమిచ్చుచున్నది. ఇంత దీర్ఘకాలానుభవముగల కాంగ్రెసు మహాసభాభిప్రాయముల కనుగుణముగనడచుకొనుట తమవిధియై యున్న దని తెలిసికొనిన నాయకులలో మూర్తీభవింపవలసినదా? లేక కాంగ్రెస్ మహాజనసభయొక్క అభిప్రాయములను నిరాకరించి, అందుండిచీలి స్వాభిప్రాయమే ఎల్లప్పుడు అమలునందుండవలయు ననువారిలో మూర్తీభవింపవలసినదా? రెండవతరగతివారిలో మూర్తీభవించిన దని చెప్పుటకు అవకాశము లేదు. ప్రజాప్రభుత్వమునకు (Democracy) ముఖ్యమైన సంవిధాన మేమన: 1. హెచ్చుసంఖ్యాకులు సభలో తీర్మానించిన ప్రకారము అందఱును నడచుకొనవలయునని గ్రహించుటయు, 2. భిన్నాభిప్రాయములు గలిగినప్పుడు సహనముతో నుండుటయు. శ్రీ శాస్త్రిగారును, వారిమిత్రులును పై రెండుముఖ్యాంశములను పాలించిన వారు కారు. అట్టిస్థితిలో కాంగ్రెస్ మహాసభ యిష్టానుసారము ప్రతినిధులను శ్రీ శాస్త్రిగారు నిందించుట భావ్యము కాదు. ఆంగ్లేయరాజ్యాంగచరిత్రను చూచినయెడల అచ్చట ప్రజానాయకులు ప్రజలు రాజకీయాంశములను చర్చించుటకు శక్తిలేక యున్నంతకాలమును వారికి సలహాయిచ్చుచుండి, ప్రజల కాశక్తిరాఁగానే, వారి యభిప్రాయముల కనుగుణముగ నడచుకొనుట విధాయకమని తెలిసికొని ఏ తిరుగ ప్రవర్తించిరో

శ్రీ శాస్త్రిగారికి తెలియగలదు. దేశీయమహాసభా ప్రతినిధులపై ఇట్టినింద శాస్త్రిగారు మోపుట సరి కాదు. ప్రభుత్వమువారిదయకు ఎదురుచూడక, స్థిరబుద్ధి వహించి తామే బుద్ధిసూక్ష్మముకలవా రని ప్రకటింపక, తమ దేశీయమహాజనసభ యుద్ఘాటించిన అభిప్రాయములనే బలపఱచియుండిన యెడల దేశీయులకృషి సఫలమై యుండియుండును. అనవసరమైన నిందారోపణకు బదులుచెప్పుట విధి; సంస్కరణలవిషయమై మాంటగ్యూ గారియొక్కయు, మన ప్రతిపక్షులయొక్కయు అభిప్రాయములనుగూర్చి కొంత యాలోచించెదము. మహా సంగ్రామమున ప్రభుత్వమువారికి మనము చేసిన గొప్పసహాయములకు కృతజ్ఞతను తెలుపుచు, సంస్కరణలు చేయవలసినపుడు తాము చెప్పిన దానికంటె ఎక్కువభారము వహించుటకు శక్తిలేనివారమై యున్నామని చెప్పుచున్నారు. అన్నిరాజకీయసంఘముల వారును, ఈవిషయమున వారియభిప్రాయముతో నేకీభవింపక కేంద్రీభూతప్రభుత్వమున (Central Government) కొంతమట్టుకైన బాధ్యతాయుతప్రభుత్వము నియ్యవలయునని యేకకంఠ్యముగఁగోరుచున్నారు. భిన్నాభిప్రాయములున్న అంశముల నదలి అన్నికక్షులవారు ఏకగ్రీవముగ కోరినదానినైనను ఏల యియ్యరాదు? లేక నిశ్చయముగ మన కియ్యవలసినదంతయు యిచ్చుటకు వారికినిజముగ యిష్టములేనియెడల మనలో మితవాదులనెడివారిని చీలదీసి బళిబళీ యని వారివీపులపై తట్టుచు, ఏల యూరనటన? ఇదివఱలో మాంటగ్యూ వైసిరాయిగార్లు సంప్రతించి ప్రకటించిన విధానమునకును, ఇప్పుడుపార్లమెంటు ప్రసాదించినచట్టమునకు ఎంతభేద మున్నదో చూడుడు. మంత్రిని ఏర్పఱచు అధికారము గవర్నరుగారి దఁట! వారిని తొలగించు అధికారము వారిదే యఁట!! ఇట్టి మంత్రులప్రభుత్వము బాధ్యతాయుతప్రభుత్వ మెట్లగునో తెలియకయున్నది. ఈమంత్రి కన్న, మంత్రి క్రింద పనిచేయవలసిన సివిల్ సర్వీసుద్యోగస్థులను ఎక్కువ గొప్పవారుగఁజేసి, ఈ యుద్యోగస్థులను తొలగించుటకు ఇంగ్లాండులోని పార్లమెంటునకు తప్ప మఱియెవ్వరికిని

అధికారము లేదని కనఁబఱచియున్నారు. ఇట్టి చట్టమునుగూర్చి చర్చింప వలసివచ్చినప్పుడు కాంగ్రెస్ ప్రతినిధులు, 'ఇది సంభావితము కాదు. మేము కోరినదాని నియ్యవలసినది,' అని అడిగినప్పుడు తప్పేమున్నది? అడిగినంతమాత్రమున మనమిత్రులు బొటబొట కన్నీళ్లు కార్చవలసిన దెందులకు? కాంగ్రెస్‌మహాసభను, ఇతరసభలను ప్రతినిధులను పంప మని కోరి,చివర కచ్చోటి కెంతోఖర్చుపెట్టుకొనిపోయి పన్యాయము వివిచ్చ లేక తాము చెప్పినదే వేదమని మాంటగ్యుగారు అనుచున్నారు; ఇది యెంత బాగుగ నుంటున్నదో చూడుఁడు. మనస్సున మాంటగ్యుగారికి మఱికొంత మేలుచేయవలసినదని యున్నట్లు కనఁబడుచున్నది కాని మన ప్రతికక్షులు మనకేదియును ఇప్పింపఁగూడదని యేడ్పుటచే శక్తిలేనిస్థితి లో నున్నారు. మనవిరోధులు మనలో జాతి మతభేదము లుండుటచే ప్రస్తుతము ఎట్టి సంస్కరణములకు అనర్హుల మని చెప్పుచున్నారు. ఈవిష యము కొంత ఆలోచింతము. మనలో జాతి మతభేదము లున్నమాట నిశ్చయము. అయితే మునుపటి లేదు. ఈదేశమున బ్రిటీషుపాలన నూటయేబదిసంవత్సరములుగ సాగుచుండుటచే నీభేదములు చాల తగ్గి నవి. ఇంగ్లాండున ప్రజలలో పరస్పరభేదము లెట్లున్నవో అట్లే ఇచ్చట నైతే మున్నవి. ఇంతభేదములున్నను,ఇవి యున్నంతమాత్రమున ఇంగ్లాం డునవలె ఒకరినొకరు బాధించుట చంపుటలు లేవు. ఇంగ్లీషువారు కొందఱు వ్రాసిన ఈదేశచరిత్రవల్లనే యిచ్చట ఎట్టి పరస్పరభేదము లున్నను ఈదేశములోని ప్రజలు అన్యోన్యానురాగములతో ప్రవర్తించు నట్లు స్పష్టమగుచున్నది. దీనికిఁ గొంతవఱకు ఇంగ్లీషుప్రభుత్వము కారణ మని చెప్పవచ్చును. శ్రీ కార్మైకల్ ప్రభువు జాయింటుకమిటీవారియెదుట సాక్ష్యము చెప్పినప్పుడు మనలోని పరస్పరభేదములు ఇంగ్లీషువారికిని స్కాచ్ వారికిని, ఇంగ్లీషువారికిని ఐరిషువారికిని యుండేవానివంటివే యని న్యాయరీతిని జెప్పియున్నారు. బ్రిటీషు ప్రభుత్వసంబంధముచేతను, ప్రపంచములో ఇతరదేశముల స్థితిగతులఁబట్టియు ఈదేశములోని భేద

ములు నశించి ప్రజలందఱును ఒకటగుచుండగా ఈ దేశమున కుద్యోగమునకును, వర్తకమునకుగాను వచ్చిన ఆంగ్లేయులు తామొక ప్రత్యేక జాతిగ ఏర్పడి ఈ దేశపు ప్రజలతో ఏవిధమైన సంబంధము లేక ప్రజల కష్టసుఖములు, మంచిచెడుగులు వారు తెలిసికొనక, ప్రజలయందు వారికి నమ్మకము లేక, వారియందు ప్రజలకు నమ్మకము లేకయున్నట్టి స్థితితటస్థించి నందుచే దేశమున కింతకీడు సంప్రాప్తమైనది. కొందఱ నాయకులలో నేవియో కొన్ని స్వల్పభేదములు కలిగినప్పుడు వీరు ప్రత్యేకజాతిగ నేర్పడి యుండుటయే కాక మననాయకులలో కొందఱి కేవియో భేదము లేర్పడ్డప్పుడు వానిని వృద్ధిచేసి కక్షలు పెంచి మనవారిలో కొందఱను తమ కైవశము చేసికొని, మనము స్వరాజ్యప్రాప్తికి అనర్హులమని మనవారిచేతనే చెప్పించి తాము లాభము చెందవలయునని యున్నారు. మన దేశాభివృద్ధిని అడ్డగించుటకు వలయు ప్రయత్నమంతయు చేయుచున్నారు. తుదకు వారిప్రయత్నములు నిష్ఫలములు గాకమానవు. ఈ విషయమై ఇఁక నేమియు విస్తరించిచెప్పుట అనవసరము. ఈయిబ్బందికి కారణము మనమేదియు మఱువలేదు గనుక కొన్నిసంగతులు చెప్పెదను. బ్రాహ్మణులందఱు కలసి బ్రాహ్మణేతరులకు అపకారముచేసినట్లు చెప్పెడు అంశము పొరబాటు. బ్రాహ్మణులుగాని మఱెవ్వరుగాని గవర్నమెంటులో గొప్పపదవులను పొంది, వారిచుట్టాలకు, మిత్రులకు ఏదియో ఉద్యోగములిప్పించుటయును, తాము తమయుద్యోగములవదలునపుడు వారిని తమ స్థానమునకు వచ్చునట్లు చేయుటయును ఇదివఱలో అప్పుడప్పుడు జరుగుచున్న సంగతి నిజమే. ఇది దేశమం దంతటను తెలిసినదే. ఇంతమాత్రముచే బ్రాహ్మణులు తక్కినజాతివారిని అణఁగద్రొక్కిరని చెప్పుట సరికాదు. బ్రాహ్మణులలో సైతము ఎన్నియో తెగ లున్నవని ఎల్లరకు తెలిసినదే. ఇట్టి స్థితిలో బ్రాహ్మణులందఱు బ్రాహ్మణేతరులను కష్ట పెట్టుచున్నారని ఎట్లు చెప్పగలము? కొందఱు గొప్పపదవికి వచ్చినా మనునహంకారముచేత, తక్కినవారిని అనఁగా బ్రాహ్మణులమీఁదను, బ్రాహ్మణేతరులమీఁదను,

క్రైస్తవులమీఁదను, మహమ్మదీయులమీఁదను, వీరు వారనక అన్నిజాతుల మీఁదను తమయధికార పరాక్రమమును నిరంకుశముగఁ జూపుచున్నారు, అని చెప్పఁదగును. ఎచ్చటనో కొందఱు మహామహులుతప్ప తక్కిన వారు సాధారణముగ మైమఱచి నడుచుకొనుసంగతి యందఱకును తెలిసినదే. ఇట్టి అధికారపరాక్రమమును జూపు బ్రాహ్మణులు పదవులలో నుండి న్యాయవిరుద్ధముగ నడచినపుడు, బ్రాహ్మణేతరులతోఁబాటు బ్రాహ్మణులుకూడ వారిని దూషించుచున్నారు. ఇట్టిబ్రాహ్మణులు వేనవేలున్నారని నేను జూపఁగలను. ప్రజాసామాన్యము న్యాయముగా ప్రవర్తింపని బ్రాహ్మణులు గాని, ఇతరజాతివారుగాని అధికారమునకు వచ్చినపుడు తమ స్వాతంత్ర్యములు నిలుపుకొనుటకు అట్లు ఉద్యోగస్థులతో పోరాడుట విధి. అంతేకాని బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు అన్యోన్య ప్రేమానుబంధములు లేవని చెప్పుట సరికాదు. ఈవిషయమై కాంగ్రెస్ తరఫున ప్రతినిధులు జాయింటుకమిటీవారి యెదుట, సాక్ష్యమును నొక్కి చెప్పియున్నారు.

## ఇపుడు కాఁబోవుమార్పులు.

మన రాష్ట్రమున ప్రతిజిల్లానుండి రాష్ట్రసభకు ప్రతినిధులను ఎన్నుకొనవలెను. ప్రజాప్రతినిధులేగాక సర్కారువారు కొందఱను సభ్యులనుగా నియమింతురు. ఈరెండుతరగతుల వారిసంఖ్య దాదాపు 125 అగును. ఇదిగాక సామ్రాజ్యశాసనసభ (వైస్రాయిగారిసభ) హిందూదేశమునంతటికిని ఉండును. ఇదివఱలో ఈరెండుసభ లుండినవి, గాని, వీనిలో ఈమార్పులు జరుగనున్నవి.

1. ఇప్పుడు సర్కారుపక్షముననుండు సభ్యులసంఖ్య ఎక్కువ, ప్రజాప్రతినిధులసంఖ్య తక్కువ. అందుచే ప్రజలమాట సాగుటలేదు. ఇఁక ముందు ప్రజలు ఎన్నుకొనువారిసంఖ్య హెచ్చగును.

2. ఈసభలకు ప్రతినిధుల నెన్నుకొనుఅధికారము కొద్దిమందికే

యుండెను. ఇకముందు సర్కారునకు పదిరూపాయలు శిస్తు చెల్లించు ప్రతివారికి ఈయధికార ముండును. వీరికి "ఓటర్లు" అనిపేరు.

3. ఇప్పుడు మనప్రతినిధులు మనతరపున మాట్లాడినను వీరికే అధికారమును లేదు ఇకను మనప్రతినిధులలో కొందఱు కొన్నిశాఖలలో మంత్రులుగా ఏర్పాటుచేసి వారిద్వారా కొంతరాజ్యభారమును నిర్వహింతురు. ఈఏర్పాటు సామ్రాజ్యశాసనసభలో లేదు

4. ఇప్పుడు రాష్ట్రసభలకు గవర్నర్లు సభాధ్యక్షులుగా నున్నారు. నాల్గు సంవత్సరములు గవర్నరు ఎవరిని నియమింతురో వారును అటు తర్వాత మనప్రతినిధులు ఎవరిని ఎన్నుకొనెదరో వారునుండును. ఈ యేర్పాటున మనమాట కొంత సాగవచ్చును.

5. ఏశాఖలు మనప్రతినిధుల అధీన మగునో వానియందు కొంత పన్నులు విధించుటకును వానిఖర్చు పెట్టుటకును కొంత అధికార ముండును. మనమంత్రుల యధీనమైన శాఖలలో విద్యాశాఖ యొక్కటి. ప్రారంభవిద్య కావలెనన్న పన్నువిధించి ఖర్చు పెట్టుకోవచ్చును. ఇతరమైన పన్నులు విధించుటయు వాని ఖర్చు పెట్టుటయు ఇప్పటివలెనే యుండును. వీనిలో మార్పు లేదు.

6. సామ్రాజ్యశాసనసభలో రెండు సంవిధానములు ఏర్పడును. క్రిందిసభవారి తీర్మానముల పైసభవారు ఆమోదించవలెను. క్రిందిసభకు ప్రజలు ప్రతినిధుల ఎన్నుకోవచ్చును. పైసభకు సభ్యుల ఎన్నుకొను అధికారము రాష్ట్రీయసభ్యులకును, ధనవంతులగు ప్రభువులకు మాత్రమే యివ్వబడినది.

ఈసభలో బాధ్యతాయుతప్రభుత్వము (జవాబుదారీ ప్రభుత్వము) ఏర్పడినచో ఆస్ట్రేలియా, కెనడావలె మనకు హెచ్చుస్వాతంత్ర్యము రావచ్చును. సభలలో ఎక్కువమంది అభిప్రాయప్రకారము మంత్రులు ఏర్పడుదురు. అంతహక్కు మనకింకను రాలేదు. ఇంతకాలమునిరంకుశాధికారుల క్రింద పడియుంటిమి. ఇప్పుడే మనకు సంపూర్ణ

స్వాతంత్ర్య మిచ్చినచో ప్రభుత్వము నిర్వహించ లేమని ప్రభుత్వము వా రభిప్రాయపడిరి. అందుచే కొద్దికొద్దిగ అధికారముల మనకిచ్చెద మనిరి. ఇందుకు కారణము కొంతవఱకు మనలోనిమితవాదులే అని చెప్పక తప్పదు. రాష్ట్రసభలలో క్రమేణ అన్నిశాఖలు ప్రజలఅధీనము చేయు దురట! ఆమీాద కేంద్రప్రభుత్వమునకూడ మనకీఅధికారము లభించు నట!! ఇప్పుడు రాష్ట్రసభలలో విద్యాశాఖ, వైద్యశాఖ, పరిశ్రమలు, మునిసిపాలిటీలు, తాలూకాజిల్లా బోర్డులు, డీ.పీ. డబ్లూ శాఖ ప్రజల అధీనముచేసిరి. ఈశాఖలు రాష్ట్రసభలో పలుకుబడిగల మంత్రులు నిర్వహింతురు. ఈమంత్రులు సభలోని ఎక్కువమం దిష్టపడినట్లు ప్రవ ర్తించవలెను. తక్కినశాఖలు యిదివఱలో పాలింపబడినట్లే పాలింప బడును. కాని కార్యాలోచనసభలో మనవారు కొందరుందురు. వారిని పనిలోనుండి తొలగించుఅధికారము మనకులేదు. ప్రజాప్రతినిధులకు, కార్యాలోచనసభకు (Executive Council) భిన్నాభిప్రాయము కలిగి నపుడు ప్రజలమాట సాగుట కష్టము. ఈసంస్కరణల పదిసంవత్సరములు ప్రజలు ఎట్లుపయోగించుకొందురో చూచి ఆమీాద మరికొన్ని స్వాతం త్ర్యముల మన కిచ్చెదమని పార్లమెంటువారు ప్రకటించిరి. దీనింబట్టి ఆలోచించగా అమృతసరమున దేశీయమహాసభవారి తీర్మానములు అందఱును శిరసావహించవలె నని నిశ్చయముగ తేలుచున్నది. ఆతీర్మా నము లెవ్వియనిన,—

1. భారతీయులు బాధ్యతాయుత (జవాబుదారీ) ప్రభుత్వమునకు వెంటనే అర్హులని కడచిన సంవత్సరము డిల్లీకాంగ్రెసులో శావించిన ప్రకటనను మరల ప్రకటించుచున్నాము. ఇందుకు విరుద్ధమైన వాదమును ఈమహాసభవారంగీకరింపరు.

2. రాజకీయసంస్కరణల విషయమై డిల్లీ కాంగ్రెసుతీర్మాన మునే ఈసభవా రామోదించుచున్నారు. సంస్కరణముల చట్టము ప్రజల ఆశయముల తృప్తిపొందింపచాల వనియు,ఆశాభంగకరమనియు అసంపూర్తిగ నున్నవనియు ఈసభ వా రభిప్రాయపడుచున్నారు.

3. స్వయంనిర్ణయసూత్రము ననుసరించి త్వరలో భారతీయులకు బాధ్యతాయుతప్రభుత్వ మొసంగవలయు నని ఈ సభవారు కోరుచున్నారు.

4. సాధ్యమైనంతమట్టుకు ఈసంస్కరణములు జయవంతముగా కొనసాగుటకు ప్రజలు కృషి సలుపుదురని ఈసభవారు నమ్ముచున్నారు. సంస్కరణములకై కృషిసల్పిన రైట్ ఆనరబిల్ మాంటాగ్యుగారికి ఈ సభవారు వందనములు చేయుచున్నారు.

కడపటి మాట.

రాష్ట్రీ, సామ్రాజ్యశాసనసభలకు ప్రతినిధుల, ఓటర్లు ఎన్నుకొనవలెనని జెప్పియుంటిమి. ఇందువలన ప్రభుత్వము ప్రజల యిష్టానుసారముగ జరగునా అని మీరు సంశయింపవచ్చును. రాష్ట్రీసామ్రాజ్యశాసన సభలకు ప్రతినిధులుగా యుందునని చెప్పువారు మనయిష్టప్రకారము వర్తించెద మని ఖండితముగ మాట యిచ్చిననే ప్రజలు వారిని ఎన్నుకొవలెను. మనలో కొందరు యిదివరలో మొదట చెప్పిన ప్రకారమునడవలేదు. వీరినే మితవాదులని చెప్పవచ్చును. వీరు ఈపదవికి అర్హులుకారు. వారెల్లప్పుడు నిరంకుశాధికారవర్గము వారి దయ కెదురు చూచుచు ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నారు. దేశములోని హెచ్చుసంఖ్యాకుల అభిప్రాయమును గౌరవించక ప్రవర్తించి యున్నారు. వీరిఅభిప్రాయములకు ప్రజాభిప్రాయములకు ప్రతివిషయమున భేదమున్నది. ప్రజాభిప్రాయ ప్రకారము వారు వర్తించరు. కావుననే వారిని ప్రభుత్వమువారు ఇప్పుడుగౌరవించుచున్నారు. ఈమితవాదులు యిది వఱలో రైతులందరును వర్తకులును దుస్థితియందున్నారనియు అందుచే సెటిల్మెంటు, సర్వేలు చేయునపుడు వారిఆర్థికస్థితిగతుల పరిశీలించి శిస్తు, పన్నువిధించవలెనని రాష్ట్రీసభలలోను సామ్రాజ్యశాసన సభలలోను గంటలకొలది యుపన్యాసము లిచ్చి మొరపెట్టుచుండిరి. ఇట్టి మితవాదులు సంస్కరణములు ప్రసాదింపబడ్డవెంటనే రాష్ట్రీములలో ప్రజల కధీనము కాబోవుశాఖలలో మంత్రుల పదవులు సంపాదించుకొని ప్రారం

భ విద్య మొదలగువానికి ధనము కావలయును కావున పన్నుల హెచ్చిం చుటకు సంసిద్ధులై యున్నామనిరి. వీరు సర్కారువారు చెప్పునది మంచో చెడుగో ఆలోచించక 'చిత్తము, మహాప్రభో' అనువారి తీరున యుంటు న్నారు. మంత్రులపదవి తమకేలభించును కావున సర్కారువారేదిచేసి నను వీరామోదించుచున్నారు. తినుటకుకూడు, కట్టుకొనుటకుబట్ట లేని ఈరోజులలో గొప్పఉద్యోగములు, హెచ్చుపన్నులుమననెత్తిన పెట్టుటకు ప్రయత్నించుచున్నారు. మంత్రులజీతము కార్యాలోచనసభలోని యూరోపియన్ మెంబర్లతో సమానముగ యుండవలెనని వీరీమధ్య ఇంగ్లాండున విశ్వప్రయత్నముల చేసిరి. జ్వరములవల్ల కోట్లకొలది మన వారు చనిపోయిరి. అందులో రైతులు విశేషముగ చనిపోయిరి. వీరి నెత్తిన మరల పన్నుల తెచ్చిపెట్టినచో భరించుటకష్టము. తెనుఁగు పత్రి కలవారుకూడా మితవాదులపక్షమును కొంత అవలంబించుచున్నారు. పత్రికలు ఒకప్పుడు ఒకపక్షమునను మఱొకప్పుడు మఱొకపక్షమునను వ్రాయుచున్నారు. ప్రజాభిప్రాయముల చక్కఁగ వెల్లడిచేయని పత్రికలవల్ల లాభమేమి? పంజాబున ప్రజలు ఎదురుతిరిగి రనుమిషమిూద సైన్యముచే వందలకొలఁది ప్రజలను కాల్పించి ఎంతో కష్టములుపెట్టిరి. మితవాదులు ఈసందర్భమున ఏమియు చేసినావారు కారు. ఇంకను వారిలోపములు ఎన్నియోకలవు, కాని, ప్రజాభిప్రాయప్రకారము వారు వర్తించుట లేదు కావున ప్రజలు వారిని ప్రతినిధులుఁగా ఎన్నుకో కూడదని మరల నొక్కి చెప్పుచున్నాము. జాతీయవాదులలో ప్రముఖులును హెచ్చువిశ్రాంతికల వారిని ఎవరికి భయపడక ప్రజాభిప్రాయమును సభలలో నిరాఘాటముగ చెప్పువారిని ప్రజలు ప్రతినిధులుఁగా ఎన్నుకోవలెను. అప్పుడే మనమా టకు పలుకుబడి యుండును.

### ప్రతినిధుల ఎన్నుకొను పద్ధతి.

ఇది మీకు కొంతవఱకు తెలిసియే యున్నది. తాలూకాబోర్డు న్నదికద! దీనిసర్కారువారేర్పాటుచేసిరి. ప్రతిసంవత్సరము మనమిచ్చు పన్నులలో కొంతపైకము సర్కారువారు తాలూకాబోర్డున కిచ్చు

చున్నారు. ఈపైకము స్కూళ్లకు, రోడ్లకు, ఆసుపత్రులకు బోర్డుమెంబర్ల ద్వారా ఖర్చు పెట్టించుచున్నారు. ఈమెంబర్లుతాలూకాలోని గొప్ప వారు; ప్రజలతరఫున ఎన్నుకోబడ్డవారు. వీరికే సొమ్ము ఖర్చు పెట్టు అధికార మివ్వబడి యున్నది, వీరు మనప్రతినిధులు. మన "ఓటు" మనము వీరి కిచ్చినందున వీరి కీఅధికారము లభించినది ఇట్లే రాష్ట్రసామ్రాజ్య సభలకుకూడా మనఓట్లవల్ల ప్రతినిధు లేర్పడుదురని తెలియవలెను. 'ఓట్' అనగా సమ్మతి లేక ఇష్టము అనిఅర్థము. ఒకరికి ఓటు యిచ్చుచున్నా మనగా వారిని ప్రతినిధిగా ఒప్పుకుంటున్నామని అభిప్రాయము. ఈ ఓటు ఇచ్చుఅధికార మెవ్వరి కున్నదనగా వారిపేర్లు గలపట్టీని సర్కారువారు ప్రకటింతురు. ఈపట్టీలో పేర్లున్నవారే ఓట్లనిచ్చుటకు అర్హులు. ఇతర దేశములలో ఈ ఓటర్ల సంఖ్య చాలఎక్కువ. జబాబుదారీప్రభుత్వము మన కిప్పుడిప్పుడే సర్కారువారు ప్రసాదించినారు కావున మనలో ఓటర్ల సంఖ్య తక్కువయేను. మనలో అందరు చదువు నేర్చుకున్నయెడల అందరికిని ఈఅధికారము రావచ్చును అందులకై మనముసదా కృషి చేయవలెను. ఓట్ యిచ్చుపద్ధతికి 'ఎలెక్షన్' అందురు. రాష్ట్ర, సామ్రాజ్య శాసనసభలకు ఎలెక్షను వచ్చినపుడు అనగా ప్రతినిధుల ఎన్నుకోవలసినప్పుడు కొందరు పెద్దలు ప్రతినిధులుగా యుంటామని ప్రజలకు (ఓటర్లకు) తెలియచేస్తారు. అనేకులుతమ్మే ఎన్నుకొందురను ధైర్యముతో వచ్చెదరు. వీరిని కాండీడేట్లని చెప్పెదరు. ప్రతినియామకుడును ప్రతినిధిగా యుండ తగినవాడని ఇద్దరు ఓటర్లు సర్కారునకు వ్రాతమూలకముగ తెలియ చేయవలెను. ఎవరిని ఈతీరున ఓటర్లు నియమింతురో వారికేసమ్మతుల నియ్యవలెననెడి నియమము లేదు ఎన్నికలప్పుడు తమకుతోచిన వారికి ఓట్లు యివ్వవచ్చును. సర్కారువారు ఎన్నికలకు (Election) ముందు ఫలానివారు నియమింపబడిరనియు, ఫలానిరోజున ఫలానిచోట సమ్మతుల ఇయ్యవలెననియు, ముందుగ గెజటున ప్రకటింతురు. ఎన్నికలు సక్రమముగ జరగుటకు ఒకఉద్యోగస్థుని ఏర్పాటు చేయుదురు. వీరిని పోలింగుఆఫీసర్ (Polling Officer) అంటారు. ఎన్నికలిచ్చుచోట

ఇతడు కూర్చుండును. ఓటరు ఇతనుండుగదిలోనికి వెళ్లవలెను. వెళ్లగానే కవరు చేతికిచ్చి ఓటరుయొక్క నెంబరు, పేరు, కవరుమూతలోపలి వైపు వ్రాయు మంటారు. వ్రాసినవెనుక కవర నతికించి ముద్ర వేయుదురు. కవరు పైపైవున నియమింపబడ్డకాండీడేట్ల పేర్లుండును. కవరును ప్రత్యేకముగ నుంచబడ్డగదిలోనికి తీసికొని వెళ్లవలెను. ఎవరికి ఓటు యిచ్చుటకిష్టమో వారిపేరునకెదురుగా ఈలాటిగుర్తును పెట్టిగదిలో ఉంచబడ్డపెట్టెలో కవరును పడవేయవలెను. చదువురానివారు నమ్మకమైన మనిషిని వెంట బెట్టుకొని పోయి తమకిష్టమైన పేరున కెదురుగా ఈగుర్తు పెట్టించవలెను. తర్వాత పోలింగుఆపీసరు పెట్టె తెరచి కాండీడేట్ల ముందర ఎవరిపేర ఎన్నిగుర్తులు పడినవో లెఖ పెట్టును. ఎవరికి హెచ్చు ఓట్లు వచ్చినవో వారు ప్రతినిధిగా ఏర్పాటైనారని గెజటులో ప్రకటింతురు. ఈఓట్లు యిచ్చుపని రహస్యముగా జరుగును కావున మనమునన్నున ఎవరికి ఓటు యివ్వతలచినామో వారికిచ్చుటలో ఏలాటి యిబ్బందియు లేదు. మర్యాదలకు, డబ్బునకు, గొప్పవారి మొగమోటమునకు ఎవరును లోబడకూడదు; శిఫార్సులు వినకూడదు. ఎవరు దేశసేవకై నిరంతరము పాటుపడెదరో, ఎవరుమాట ప్రకారము నడచుకొనెదరో, ఎవరు ప్రజాభిప్రాయమునకు బద్ధులో వారినే ఎన్నుకొనుట మనవిధియని తెలియవలెను. ఈరాజ్యాంగవిషయములు మాచేత్వారలో ప్రకటింపఁబడు 'రాజ్య తంత్రము' అను గ్రంథమున ఆబాలగోపాలమునకు తెలియునట్లు విపులముగ వ్రాయబడియున్నది. ప్రతిఓటరును ఈగ్రంథమును సొంతముగ చదివి మనదేశము బాగుపడుటకై అన్నివిధముల ప్రయత్నించవలెను. మొదటి ఎన్నికలప్పుడే (First elections) అనేక భాగముల నుండి ఆక్షేపణఅర్జీలు వేనవేలు రాఁగలవు. ఇంకను ఈ ఓట్లను సంపాదించు కార్య మెంతఘనమైనదియు, ఇప్పటియాచరణలోనుండు విధానముకంటెయెంతకష్టమైనదియు ఓటర్లగొప్పసంఖ్యయే తెలుపుచున్నది. ప్రస్తుత విధాన ప్రకారము ఎన్నికల నిచ్చుట కర్హులైనవారు, మునిసిపల్ కౌన్సిలులలోను, డిస్ట్రిక్టుతాలూకాబోర్డులలోను బహుకొద్దిమందిమాత్రమే

రిజిస్టరు కాఁబడిన మెంబర్లుగా నున్నారు. ఎన్నికలకై ఎట్టికష్టముఁలపడు చుండునది గతసంవత్సరముల చర్యలవలన అందఱకును తెలిసియేయున్నది. ఎన్నికలనిచ్చుట కర్హతగలవారును, ఎన్నికలఁ గైకొని సభ్యత్వమును బొందువారును, ఎట్టివిద్యాధికులైనను ఈయెన్నికల సంపాదించుటకు మాత్రము సరియైనపద్ధతుల నవలంబించి యుండలేదని ఒప్పుకొనక తప్పదు. ఎన్నికల నిచ్చుట కర్హతగలవారు సభ్యత్వమును తమ ఓట్లగుండా పొందినవానినిఏవిధమైన ప్రమాణములచేతను బంధించుటలేదు. ప్రస్తుతము ఆచరణలోనుండు విధానమునకును, రాఁగలవిధానమునకును మార్పులు మెండు. ఏదోకొంత బాధ్యతాయుతప్రభుత్వముమనకియ్యఁబడును. సభ్యత్వపదవిని గోరువాఁడు ఎన్నికలనిచ్చువారియెదుట కొన్ని ప్రమాణములకు బాధ్యుఁడు కావలసియున్నాఁడు. అట్లు కోరుట వారి ధర్మము అని జెప్పనచ్చును. తమజిల్లాలో నేయేభాగములో నేసభ్యుడైతే నిర్బంధోచితప్రారంభవిద్యావిధానము (Free and compulsory Primary education) ఏర్పఱచుటకు సర్కారును సమ్మతింపఁజేయుటకు ఇష్టపడఁడో వానికి తమ ఎన్నికలనిచ్చుటకు ఎన్నికదార్లు సమ్మతింపఁగూడదు. ఇట్లు ఎన్నికలనుపొంది సభ్యత్వమును పొందిన ప్రతి జిల్లాప్రతినిధి సభ్యులును తమజిల్లాలో నిర్బంధప్రారంభోచితవిద్యావిధానమునకై పాటుపడుటకు ప్రమాణమునుజేసి అందులకై పాటుపడి అనేకులగుబీదలకును, అర్హులకును విద్యలఁగఱపుబడుటను దేశమంతయు నొనఁగూర్చిరేని, అందువలన విశేషజనము విద్యాగంధమునుబొంది ఇఁకను కొన్నిసంవత్సరములకు జ్ఞానవంతమైన ప్రజ లేర్పడుటచే మన దేశస్థితి యేవిధముగ మార్పును జెందగలదో మన మూహింపఁగలము. ఉదాహరణమునకై చెప్పిన విద్యావిధానమువంటిదే పారిశ్రామికవిధానము, ఆరోగ్యవిధానము మొదలగు నవసరములైన యావశ్యకవిధానములు. వీటియందును పై సభ్యులు కృషిచేసి సర్కారున కచ్చుచెప్పినచో పారిశ్రామికవిధానము, ఆరోగ్యవిధానము మొదలగువానిలో నైతేమమార్పులు విశేషముగ గల్గి ప్రజాసౌఖ్యము విశేషముగ హెచ్చును. ఈపద్ధతి

ననుసరించి యే శాసనసభాసభ్యత్వమునుగోరువారు కృషి సలుపవలయును. అట్టివారినే ఏఱి, వారికే తను ఎన్నికలను ప్రజలి య్యవలయును. ప్రస్తుతవిధానమంతటి సౌలభ్యము ఇఁకను రాఁబోవు విధానమునందు లేదు. ఎందుచేత ననఁగా వేలమందికి అచ్చచెప్పి, వారి యందుండి యధికమైన ఓట్లను బడయుట కష్టమైన కార్యమే. కావున సభ్యత్వమునుబడయఁగోరువారు ఒక్కొక్క స్థలమునసభలఁగావించి ప్రజానురంజనముగా మాటలాడి, వారికితమపూనికను వెల్లడిపఱచి నమ్మకముగలిగింపవలయును. మఱియును సభ్యత్వమును బడయఁగోరువారు వారిభావములను దేశభాషావార్తాపత్రికలగుండా వెల్లడిపఱుపవలసియుండును. కావున ప్రతి జిల్లాలోను ఒకవార్తాపత్రిక ఆజిల్లాభాషలో నత్యావశ్యకముగఁ బ్రచురింపఁబడవలయును. మఱియును ప్రతిగ్రామమునందును, తాలూకాయందును, జిల్లాపట్టణమునందును రాజ్యాంగవిధానమును చర్చించుసభల నేర్పఱచి యెన్నికల నిచ్చుటకర్హులను రాజ్యాంగవిధానచర్చలచే శిక్షితులనుగఁ జేయవలయును. ప్రారంభకార్యమును జేయుటలో మనపై అధికమైన బాధ్యత యున్నది. ఎన్నికల నిచ్చువారిని తమవిధానమున శిక్షితులుగఁ జేయుటకై స్వార్థత్యాగులగు దేశసేవకు లెందఱో కావలయును. సభ్యత్వమును గోరువారునైతము వారియాచరణలలో బహుజాగరూకులై యుండవలయును. అయినను వారు తమపట్టుదలను వదలక ప్రజాభిప్రాయములకై పోరాడవలయును. సమయము వేచియుండి మనలోపములను వెదకుచుండుశత్రువు లనేకులున్నారు. వారు, మన కార్యములనే మన మెప్పుడును దిద్దుకోలేనంత చీలిచిందరవందరలై యుండుప్రజలని మనలను దూరుటకు సిద్ధముగ నున్నారు. అట్టివారి వలలలోమాత్రము పడక కార్యనిర్వాహకమును జేయవలసియున్నది. రాజ్యాంగవిధానములో పెద్దల అనుభవము దీనిని హెచ్చరించునట్లు చేయుచున్నది. మఱియు నిటీవల కొన్ని సంవత్సరముల యనుభవములవలన నేర్పడియుండువిషయమేమనఁగా, మనలోని స్వల్పమగు గృహకల్లోలములవంటి భేదాభిప్రాయములను గోరంతదానిని కొండంతగా మనశత్రువులు వివేకశూన్యులై చా

టింపుచున్నారు. ఈచాటింపు మన దేశస్థులలో ఆలోచనపరులగు మితవాదులను, తెనుఁగుపత్రికలవారిని భయభ్రాంతులుగఁ జేసినది; మఱియు ప్రతివానియందును ఈచాటింపు గాఢమైనభేదబుద్ధి నొకదానిని నిర్మించినది; తమపూర్వులచరిత్రను మఱచిన సైర్ణహోముకక్షలోనివారు యీభేదబుద్ధిని విస్తరింపఁజేసిరి. అయిన నీభేదమంతయు త్వరలోనే నశించును. పెడత్రోవలోఁబడిన తప్పును అందఱమును దెలిసికొనఁగలము.

ఇదివరలో ప్లీడర్లే విశేషముగ ఈపదవిని ఆశించుచుండిరి. వారికి తీఱుకయుండదు కావున వారిని ఎన్నుకొనిలాభము లేదు. వారికి రైతులు, వర్తకులు మొదలగువారికష్టసుఖములు బొత్తుగా తెలియవు. పరిశ్రమల విషయముకూడా వారికి దెలియదు. ఇతరవృత్తులవారినికూడ ప్రతినిధులనుగ ఎన్నుకొనిననే అన్నివిషయములు సభలో వెల్లడియగును. రైతుల తరఫున రైతులలో కొందరును, వర్తకులతరఫున వర్తకులు కొందరును, ఇట్లే అన్నివృత్తులవారును సభకు ప్రతినిధులుగా ప్రజలు ఎన్నుకోవలెను. ప్లీడర్లు యిదివరలో ప్రజలకు సహాయపడిరి కాని, ఇకముందు వారికి తీఱుక యుండదు కావున ప్రతినిధులపనుల చక్కగా నిర్వహించలేరు. ఈవిషయము ప్రజలు గ్రహించి గొప్పవాడు- ప్లీడరు, అనువిషయమును ఆలోచించక ఎవరు దేశమునకై పాటుపడెదమని బహులో వాగ్దత్తము చేయుదురో, ఎవరు దేశీయమహాసభ వారితీర్మానములకు వారినే ఎన్నుకుంటూ అన్నివృత్తులవారికి ప్రాతినిధ్యమున్నదా అను ముఖ్యాంశమును జ్ఞప్తియం దుంచుకోవలెను. శాసనసభల సభ్యత్వమునకుగాని యత్నించునపుడు, ఒకరినొకరు దూషణలను వృథావరస్పరకలహములను మానవలయును. ఎన్నికలకై పోరాడుట విధియే కాని అట్లుచేయుటలో అనవసరముగ ద్వేషములు, ఆగ్రహములు కలుగవచ్చును. కాని వాటికి లోబడక మంచిచెడుగులు ఆలోచించి యెక్కువసంఖ్యాకుల తీర్పునకు బద్ధులై ఉచితరీతిని ప్రవర్తింపవలయును.

---

'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.

# భగవద్గీతారహస్యము అను కర్మయోగశాస్త్రము

శ్రీయుత బాలగంగాధరతిలకకృతము.

ప్రతి 1-కి రూ. !

| | | | | |
|---|---|---|---|---|
| వేమనపద్యములు, 3060, తాత్పర్యసహితము | | .... | 3 | 8 |
| మదనమోహనమాళవ్యగారిజీవితము, పంజాబుఅల్లరి | | .... | 0 | 8 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్రము, ప్రతిమతో | | .... | 0 | 4 |
| రామకృష్ణపరమహంసచరిత్రము | ,, | .... | 0 | 2 |
| శ్రీలాలాలాజ్‌పతిరాయిజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీగోపాలకృష్ణగోక్లేజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీవేమనయోగిజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీకరంచంద్‌గంధిజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీవివేకానందస్వామిజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారిజీవితము | ,, | .... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర | ,, | .... | 0 | 3 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ,, | .... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర | ,, | .... | 0 | 2 |
| అనిబిసెంటుచరిత్ర | ,, | .... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ,, | .... | 0 | 1 |
| సోదరినివేదితజీవితము | ,, | .... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | | .... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | | .... | 0 | 2 |
| శ్రీవివేకానందవిజయము | | | 1 | 12 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.